*Issued on 18— 1—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

## OFFICIAL REPORT

*SATURDAY, the 24th MARCH, 1956.*

VOLUME V — No. 6.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Saturday, the 24th March* 1956.

The House met in the Assembly Hall Kurnool at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## SHORT NOTICE STARRED QUESTIONS.

### *Declaration of Kavali Taluk as 'Famine Area'.*

623-A.

S. N. Q. No. 1293-C. Q.—SRI B. RAMAKRISHNA REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether any representation was received by the Government requesting them to declare Kavali taluk, Nellore district as 'Famine Area' in view of the total failure of crops in that taluk , and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) Enquiries have revealed that there has been no widespread failure of crops in Kavali taluk and the Government have therefore decided that there is no need to declare that taluk as a famine area.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, నెల్లూరు జిల్లాలో మెట్ట తాలూకా లన్నిట్లో కూడా యీ సంవత్సరం చెరువుల క్రింద మెట్ట తోటల క్రింద పైరులు పోయినసంగతి ప్రభుత్వం గమనిస్తుందా? అట్లా గమనిస్తే మొత్తం జిల్లాలో investigate చేసి చర్యలు తీసుకుంటుందా?

THE HON. SRI K. CHANDRAMOULI :—మొత్తం జిల్లా ఎట్లా వున్నా, యీ తాలూకా విషయం విచారించారండి. పంటలు కనుక ఎక్కువగా

పొడై ఉంటే వాటికి తగిన remission యిస్తున్నారు కాని కరువు సంభవించే situation లేదు

SRI PRAGADA KOTIAH :—Wide spread failure లేదన్నారు. ఉన్న Failure of crops యొక్క percentage ఏ మాత్రం ఉన్నదో అధికారులు తెలియజేశారా ?

THE HON SRI K. CHANDRAMOULI :— రూ. 0-8-0 నుండి 0-12-0 ల పంట fair yield గా ఎంచుకోవాలి. కావలి తాలూకాలో మాగాణి ప్రాంతములలో ఉన్నదని చెప్పి సుమారు అంచనాలు వేయబడ్డాయి.

SRI S. VEMAYYA :—మాగాణి ప్రాంతం 0-8-0 మొదలు 0-12-0 వరకు అన్నారు. మెట్ట ప్రాంతం వెనుకబడ్డ గ్రామాలు ఆ తాలూకాలో ఉన్నాయి. కాబట్టి అవయినా యీ area క్రింద declare చేసి వసతి కలుగజేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—మెట్ట ప్రాంతాలలో గాని మాగాణిలో అక్కడక్కడ చెరువుల క్రింద నీటి వసతులు లేకుండా పంటలు తగ్గిపోయిన చోట్ల ఆయా విషయాలు ప్రత్యేకంగా విచారించి వాటికి ఏదయినా remissions యివ్వవలసివస్తే కలెక్టరు యివ్వడానికి సిద్ధంగా ఉన్నారు.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, కొన్ని తాలూకాలలో different types of mixed soils వుంటాయి అటువంటి తాలూకాలలో ఒక Firka కు బాగా వర్షం వచ్చిందంటే యింకో Firka లో లేకుండా ఉంటుంది అటువంటప్పుడు firka ల వారిగా famine area గా declare చేయడాని అవకాశం ఉంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Firka ల వారిగా famine area పెట్టరుగాని గ్రామాలుకూడా విచారణచేస్తారు. Permission యివ్వవలసిన అవసరం ఉంటే యిస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మామూలుగా రూపాయిలో ఎన్ని అణాల పంట failure అయితే famine గా declare చేస్తారు ?

THE HON. SRI K. CHANDRAMOULI :— బాగా Widespread గా పంటలన్నీ పూర్తిగా తగ్గిపోతే అటువంటప్పుడు famine అని declare చేస్తారు. Extraordinary conditions లో,

SRI SHEIK MOULA SAHEB·—అధ్యక్షా, నెల్లూరుజిల్లాలో బొత్తిగా వర్షాలు లేక అక్కడ త్రాగడానికి మంచినీళ్లు లేకుండావున్నది. ఉదయగిరి నియోజకవర్గంలో చాలా బాధగా ఉన్నది. ఈవిషయంపై ప్రభుత్వంవారికి అర్జీలు కూడా పంపుకున్నాం. అట్టివాటిని కరువుప్రాంతాలుగా declare చేసి సౌకర్యాలు కలుగజేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI:—ప్రత్యేక ప్రశ్న వేయండి.

SRI M. NAGI REDDI :—Famine area క్రింద declare చేయకపోయినా crops fail అయినాయి, కాబట్టి అది దృష్టిలోపెట్టుకుని వడ్డీలేకుండా అప్పులుగాని చౌకవడ్డీపై అప్పులుగాని యివ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అటువంటి పరిస్థితి ఏమయినా ఉన్నప్పుడు Collector తప్పకుండా ఆలోచిస్తారు. లేకపోయినట్లయితే Government దృష్టికి తెస్తే నిజముగా అటువంటి పరిస్థితి ఉన్నచోట ప్రభుత్వం కూడా కొంతవరకు సహాయంచేయడానికి ఎప్పుడూ వెనుకంజవేయదు.

SRI B. SANKARAIAH:—General గా 0-8-0 మొదలు 0-12-0 వరకు పంట ఉంది అన్నారు. కొన్నిగ్రామాలు బొత్తిగా పంటలు లేనటువంటివి. మేము స్వయంగా చూశాము. అటువంటప్పుడు మళ్లీ విచారణచేయించి బాగా fail అయినటువంటి చోట్ల సరైన సహాయం అందేటట్లు చేస్తారా ?

THE HON K CHANDRAMOULI:—మళ్ళీ విచారణ అవసరంలేదు. పండనిచోట కలెక్టరు గారు చూస్తూనేవున్నారు.

*Supply of Electricity to certain villages of Vijayawada Taluk.*

623-B.—

S. N. Q. No. 1306-B. Q.—SRI V. VISWESWARA RAO:—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Government sanctioned the scheme for the supply of electricity to the villages of Kowlur, Kondur, Chevutur, Mylavaram and Velvadam of Vijayawada Taluk, Krishna District ; and

(b) if not why ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) and (b) . Kowlur, Kondur, Chevutur, Mylavaram and Velvadam villages are included in a major scheme for extension of electricity to Mylavaram and 7 other villages estimated tocost 6·04 lakhs. The scheme is under consideration of the Government.

మైలవరం extension scheme లో కౌలూరు, కొండూరు, చెవటూరు, మైలవరం. వెల్లవాడ గ్రామాలు చేర్చబడివున్నాయి. ఈ scheme విలువ 6,04,000 రూపాయలు. ఈ scheme యిప్పుడు ప్రభుత్వంవారి పరిశీలనలోవున్నది.

## STARRED QUESTIONS.

*Application from the Secretary, High School Committee, Cheepurupalle regarding the building grant.*

624—

*991 Q.—SRI M. SATYANARAYANA RAJU :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether any application from the Secretary, High School Committee, Cheepurupalle, for a building grant has been received by the Government ; and

(b) if so, the action taken thereon ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) There is no proposal to make any new constructions at present and the Committee has therefore been advised to approach the Special Officer, Srikakulam District Board at the appropriate time.

*Gazetted Officers of the Education Department under the emergency regulation.*

625—

*629 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA and SRI G. RAMASWAMI REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) how many Gazetted Officers of the Education Department (Collegiate and Executive) are still under the mergency regulation of 10(a) (i) ;

(b) whether it is a fact that some of the incumbents under the emergency regulation have put in six or seven years' service and are about to retire, and

(c) whether the Government propose to regularise them and give them increments with retrospective effect ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) 79.

(b) Nil.

(c) The appointments of the Officers are as far as possible being regularised with effect from the dates of their joining duty in the posts. They will also be given increments with retrospective effect subject to the conditions laid down in General Rules 23 (a) of the State and Subordinate Service Rules.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—వీళ్లను permanent చేస్తారండీ?

THE HON. DR. B. GOPALA REDDI :—అవునండి

*Formation of rival labour unions.*

627—

*846-B. Q.—SRI PRAGADA KOTAIAH :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether there is a proposal with the Government to prohibit the formation of rival labour unions in one and the same industry in the general interests of the labour ; and

(b) if so, when the proposal will be given effect to ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) No, Sir.

(b) Does not arise.

(a) లేదండీ.

(b) ఈ ప్రశ్నకు అవకాశం లేదు.

[24th March 1956

SRI PRAGADA KOTAIAH :—రాష్ట్రంలో చాలా పరిశ్రమలలో rival labour unions ఉండడంవల్ల అసలు labour కోసం సరిగా కృషి చేయడం అసంభవ మవుతుంది. ఇతరరాష్ట్రాలలో యీ ఆలోచన చేస్తున్నట్టుగా కూడా తెలుస్తున్నది. అలాంటి ఆలోచన యిప్పుడైనా యీ ప్రభుత్వం చేయడానికి పూనుకుంటుందా?

THE HON. SRI G. LATCHANNA :—ఇది rival union అనే విషయంకంటే ప్రభుత్వానికి యిప్పుడున్నటువంటి Trade Union Act లోని 4వ section ప్రకారం ఏడుగురు కార్మికులుగాని మేము ఒక సంఘం పెట్టుకుంటామని Registrar గారికి దరఖాస్తు పెట్టుకున్నప్పుడు Registrar వారు ఆ ఏడుగురు అసాములు ఒక firm లో పనిచేస్తున్నవారుగా వారు భావించినప్పుడు Register అనేది తప్పనిసరిగా చేయాలనే Rules. శాసనం యిప్పుడు అమలులో ఉన్నది. కాబట్టి మొదటికంటె అదనంగా శాఖలుండకూడదని ఒక విధానం అవలంబించడానికి మన రాష్ట్ర ప్రభుత్వానికి అవకాశంలేదు.

*Recruitment to the Gazetted Posts from Harijan Communities.*

628—

*847-B. Q.—SRI N. SREENIVASA RAO:—Will the Hon. the Chief Minister be pleased to state:

whether the Government are proposing to stop direct recruitment to the Gazetted posts from Harijan Communities?

THE HON. DR. B. GOPALA REDDI :—
"No, Sir".

*Posts of Junior Deputy Inspector of Schools in the Madras Education Subordinate Service.*

629—

*663 Q.—SRI N. SRINIVASA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether it is a fact that as per G.O. Ms. No. 373, Education, dated 2nd April, 1952 the Secondary Grade

Teachers under the control of the Harijan Welfare Department are also recruited by transfer to the posts of Junior Deputy Inspector of Schools in the Madras Education Subordinate Service ;

(b) the number of Teachers working in Social Welfare Schools promoted as Junior Deputy Inspectors of Schools and the number of Secondary Grade Teachers under the control of the Harijan Welfare Department who are promoted according to the above order during the period of 3 years (1952-55): and

(c) the number of such cases still pending and the reasons for the same ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) Nil.

(c) No one has been appointed by transfer as Junior Deputy Inspector of Schools from Government Departments including Harijan Welfare Department, since 1950.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, 1952 సంవత్సరంలోనే ఈ G. O. pass అయినప్పటికినీ, ఇంతవరకు Deputy Inspectors గా ఎవరినీ post చేయక పోవడానికి కారణము ఏమిటో తెలుసుకోవచ్చునా?

THE HON. DR. B. GOPALA REDDI :—సరియైనవారు లేరేమో.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, రాష్ట్రముమొత్తముమీద, కనీసం department లోనైనాకూడా సరియైనవారు లేరని చెప్పేదానికంటే, ఉన్నారో, లేదో దర్యాప్తుచేయిస్తారా? ఒక్కరినీ ప్రమోటుచేయలేదన్న సంగతి విచారిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—విచారిస్తాము.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, backward classesకు allot చేసినటువంటి appointments కు suitable candidates లేరనే కారణముతో, వాటిని forward communities కు ఇస్తున్నారు. అట్లా కాకుండా మరల applications పిలిచి, backward classes కు set apart చేసిన ఉద్యోగాలను వారికి ఇచ్చేదానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ విషయమును ప్రభుత్వంవారు, ఉమ్మడి మద్రాసులోయుండగానూ, ఇక్కడకువచ్చినతరువాతనూ చాలా పర్యాయములు చర్చించారు. ఒక సంవత్సరములో ఒక community candidate లేకపోతే ఇతర communities కు పోవడము న్యాయముగాని, ఆ posts అన్నీ అట్లాగే అట్టేపెట్టుకొని, ఇవన్నీ 10 ఏండ్ల అనంతరం ఒక్కపర్యాయము ఇస్తాము అని చెప్పడం న్యాయంకాదని ప్రభుత్వమువారు నిశ్చయించారు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, suitable candidates లేనప్పుడు మరల applications పిలిచి, ఆ posts ను backward classes కు ఇవ్వడానికి ప్రభుత్వం వారు పూనుకుంటారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—మొదటి పర్యాయము advertise చేసినప్పుడు, వారు apply చేయలేదని, మరల advertise చేస్తే వారు apply చేస్తారని అనుకోవడములేదు. మొదటి పర్యాయము advertise చేసినప్పుడు వారు apply చేసుకుంటారు. వాళ్లయొక్క suitability ని చూచుకొని appointments ఇవ్వాలని ప్రయత్నము చేస్తున్నారుగాని ఏదో కారణముతో ఎగనామముపెట్టాలనే ఉద్దేశ్యము ప్రభుత్వానికిలేదు.

SRI V. KURMAYYA :—అధ్యక్షా, ఈ ప్రశ్న చాలాకాలమునుంచి అసెంబ్లీలో చర్చకు వస్తున్నది. ప్రభుత్వానికి కావలసినన్ని అర్హతలు కలిగిన candidates ఉన్నా, సర్వీసుకమీషనువారు "not suitable" అని వ్రాస్తున్నారు. సరియైన educational qualifications ఉన్నాకూడా, చాలా పక్షపాతముతో ఈ allotments జరుగుతున్నాయని మేము చాలా కాలమునుంచి feel అవుతున్నాము. అందువల్ల educational qualifications కావలసినంత మట్టుకు ఉంటే, "not suitable" అనేమాట వ్రాయకుండా, వారిని recruit చేయడానికి ప్రభుత్వంవారికి అభ్యంతరం ఏమీలేకపోతే, సర్వీసు కమీషన్‌వారికి కూడా తగిన instructions ఇస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ విషయములో మనం పబ్లిక్ సర్వీసుకమీషనును కొంతవరకు విశ్వసించవలసిఉన్నది. వారు candidates కు, Oral and written tests పెట్టి Candidates "Suitable," "not suitable" అని నిర్ణయిస్తారు. అందువల్ల వారు ఏదో ఉద్దేశ్యం పెట్టుకొని చేస్తున్నారనడం న్యాయముగా లేదు. వారి మీద అలాంటి నిందవేయడం న్యాయం కాదు.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, లోగడ సర్వీసు కమీషనువారు కొంత మంది ఉద్యోగస్థుల దగ్గరనుంచి సర్వీసు రిజిష్టర్లుకూడా తెప్పించుకున్నారు. వాటి సంగతి ఏమి అయిందో తెలియకుండా ఉన్నది. ఆ విషయం ప్రభుత్వానికి ఏమైనా తెలుసునా ?

THE HON. DR. B GOPALA REDDI :—ప్రత్యేక ప్రశ్న వేస్తే చెబుతాను.

SRI V. KURMAYYA :—అధ్యక్షా, సర్వీసు కమీషన్ వారిమీద remarks pass చేయడము న్యాయముకాదని మంత్రిగారు అంటున్నారు. మన దేశంలో communal feeling ఏవిధంగా ఉన్నదో మనకు అందరికీ తెలుసు. నిర్ణీత అర్హతలు ఉన్నప్పుడు, not suitable అని remarks వ్రాయకుండా సర్వీసు కమీషను members కు ఏమైనా instructions ఇస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :—హిందూ దేశములో Communal feelings ఉన్నాయి కాబట్టే, హరిజనులకొఱకు, reservation ఏర్పాటు చేసినాము. న్యాయప్రకారంగా వారికి reservations ఉండకూడదు. ఈవిషయం నాకు 1937 నుంచి తెలుసును. అప్పటికీ ఇప్పటికీ చాలా తేడా ఉన్నది. హరిజన విద్యార్థులు ఉద్యోగాలకు వస్తున్నారు. Minimum qualification నాకు ఉన్నది కాబట్టి నన్ను select చేయండి అనడం న్యాయంకాదు. వారిలో ఎక్కువ మార్కులు వచ్చినవానిని నిర్ణయిస్తారు. ఇప్పుడు suitable candidates వస్తున్నారు ఆవిధంగానే హరిజనులు కృషిచేస్తారని ఆశిస్తున్నాను.

*Touring Billets organised by the Animal Husbandry Department in the State.*

631—

*796 Q.—SRI S. VEMAYYA and SRI P. VENKATA SUBBAYYA .—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

the number of Touring Billets organised by the Department of Animal Husbandry in the State and the nature of work attended to by them ?

THE HON. DR. B. GOPALA REDDI :—

There are 28 touring billets in the State.

One Veterinary Assistant Surgeon will be in-charge of each Touring Billet having jurisdiction over the entire taluk. His main functions are as follows :

(1) He will have to tour for 20 days in a month in the taluk. He attends to all outbreaks of contagious diseases occurring within his jurisdiction. He will have to be on the spot on the outbreak of diseases, diagnose them and stop the spread of the contagion by immunising the healthy stock.

(2) When there are no outbreaks of contagious diseases needing his attention, he will tour and hold camp dispensaries in the villages attending to the treatment of ordinary cases.

(3) He will also attend to livestock work within his jurisdiction.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఈ 28 టూరింగ్ డిస్పెన్సరీలు ఎక్కడెక్కడ పనిచేస్తున్నాయి?

THE HON. DR. B. GOPALA REDDI :—నాకు తెలిసినంతవరకు అన్ని జిల్లాలలో కూడా ఉన్నాయి.

SRI P. VENKATASUBBAYYA :—అధ్యక్షా, టూరింగ్ డిస్పెన్సరీలలో పనిచేసే ఉద్యోగులు జబ్బులు ఉన్న ప్రాంతములకు త్వరగా పోయేందుకు వీలుగా వారికి 'జీపులు' సప్లయి చేస్తారా?

THE HON. Dr. B. GOPALA REDDI :—దానికి చాలా డబ్బు ఖర్చు అవుతుంది. డబ్బు ఉన్నప్పుడు చూస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—వాళ్ళకు T.A. లు ఏవిధంగా ఇస్తున్నారు?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఆ ఉద్యోగస్థులయొక్క జీతాలు ఏవిధంగా యున్నాయో, వారియొక్క category ని బట్టి T.A. లు యిస్తారు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, పశు సంపద విశేషంగా ఉన్న మన రాష్ట్రములో ఈ 28 టూరింగ్ డిస్పెన్సరీలు చాలవు. అందువల్ల దేశీయ వైద్యమును కూడా ప్రోత్సహించడానికి ప్రభుత్వం పూనుకొంటుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇదివరకు దేశీయ వైద్యము నకు కొంత సహాయముచేశారు మరల అవసరముఅయితే ఆలోచిస్తాము

SRI PRAGADA KOTAIAH :—ఇంతకుముందు దేశీయ వైద్యానికి ఎలాంటి సహాయముచేశారు ? ఇకముందు ఎటువంటి సహాయము చేయాలని అనుకుంటున్నారు ?

THE HON. DR. B. GOPALA REDDI :—కొంత ధన సహాయము చేసినాము. పంచాయితీలుకూడా దీనికి కొంత సహాయంచేయమని కొంతకాలము క్రిందట ఒక G.O చేయబడ్డది. ఆంధ్ర రాష్ట్రం వచ్చిన తరువాతకూడా కొంత ధన సహాయం చేయబడ్డది.

SRI S. VEMAYYA :—దేశీయ వైద్యంలో, గ్రామ వైద్యులకు కొంత మందికి training ఇచ్చారు. వారందరుకూడా ఎటువంటి ఉద్యోగము లేకుండా ఉన్నారు. వారందరిని దాంట్లోకి absorb చేసి పని చేయిస్తారా ?

MR. SPEAKER :—They are not Veterinary Doctors.

SRI PRAGADA KOTAIAH :—గ్రామాలలో ఈ వైద్యము చేస్తున్న వారు చాలా మంది ఉన్నారు. వారికి ఏదైనా ఒక కనీస వేతనము ఏర్పాటుచేసి గ్రామములలో పశు వైద్యం వృద్ధిచేసేందుకు ప్రభుత్వంవారు ప్రోత్సహిస్తారా ?

MR. SPEAKER :—There will be too many.

THE HON DR. B. GOPALA REDDI :—వారందరు ఒక register పెట్టి, దానికి కొంత Registration fee ఇచ్చేటట్లుగాను, వారు పేర్లు అందులో register అయ్యేటట్లుగాను చేసుకొంటే తరువాత ప్రభుత్వంవద్ద నుంచి దానినిబట్టి licence తెచ్చుకుని కొంత ప్రాక్టీసు చేసుకోవడానికి వీలుంటుందేమో ఆలోచిస్తాము. అంటే అట్లా practice చేసేవారే, ప్రభుత్వానికి డబ్బు యివ్వవలసి ఉంటుంది అని చెబుతున్నాను.

SRI G. NARASIMHAMURTHY :—ప్రత్యక్షముగా ప్రభుత్వం వీటిని నిర్వహించడానికి వీలులేనప్పుడు, పంచాయితీలకైనా ప్రభుత్వం కొంత contribu. tion ఇచ్చి, ఈ పశువైద్యమునకు తగిన సౌకర్యములు కల్పించి, దేశీయవైద్యమును ప్రోత్సహించి, పశువులను రక్షిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI:—ఆవిషయము ఆలోచిస్తాము. అదిన్ని గాక, రాబోయే రెండవపంచవర్ష ప్రణాళికలో ఈ Animal husbandry, veterinary, వగైరా వాటికి అన్నిటికిని, ప్రభుత్వం చాలా ఎక్కువగా సొమ్ము ఖర్చుపెట్ట బోతున్నారు. అందువల్ల అన్ని జిల్లాలలో దీనివల్ల కొంత అభివృద్ధి అవుతుందని ఆశిస్తున్నాము.

SRI P SUNDARAYYA:—అది ఏ రెండవ పంచవర్ష ప్రణాళికండీ? అది మనం సాయంత్రం చర్చించబోయే ప్రణాళికనా? ఇప్పుడు నాకు యిచ్చిన పుస్తకాలనుబట్టి చెబుతున్నారా, లేకపోతే మంత్రిగారి దృష్టిలో ఇంకేదైనా ప్రణాళిక ఉన్నదా?

THE HON. DR. B. GOPALA REDDI:—నా దృష్టిలో ఉండేది 8 వ పంచవర్ష ప్రణాళిక. 2nd five year plan అనేది ఇవాళ సాయంత్రం, రేపు, ఎల్లుండి చర్చించబోయేది. రేపు రాబోయే ఏప్రియల్ మొదటి తేదినుంచి ప్రారంభం కాబోయేది రెండవ పంచవర్ష ప్రణాళిక.

SRI P. SUNDARAYYA:—దాంట్లో 5 ఏండ్లకు కలిపి పశుసంపదకు 8 కోట్లు ఖర్చుపెడుతున్నారని ఉన్నది. వెటర్నరీ కాలేజీని ఒకదానిని ఆరంభించారు. కొంత administration ఖర్చులక్రింద పోయినట్లయితే పశువుల రోగాలను కుదిర్చేదానికి డబ్బు మిగలదని మంత్రిగారికి తెలిసిఉండికూడా, మేము పశువుల ఆరోగ్యమును కాపాడడానికి ఎక్కువ ఖర్చుపెడుతున్నాము అని చెబుతున్నారు.

THE HON. DR. B. GOPALA REDDI:—గత 8,4 సంవత్సరములలో ఈ డిపార్టుమెంటుక్రింద ఎంత ఖర్చుపెడుతున్నారో మాకు లెక్క తెలుసు. వచ్చే 5 సంవత్సరములలో ఎంత ఖర్చుపెడుతున్నారో లెక్కచూసుకుంటే, బహుశ 20% 80% increase కాబోతున్నది. ఇప్పుడు దానిక్రింద ఖర్చు 20 లక్షలుకన్నా ఎక్కువలేదు అనుకొంటున్నాను. వచ్చే 5 సంవత్సరములో దానిక్రింద ఇంకా ఎక్కువ ఖర్చుపెడుతున్నారు. ఈ ప్రణాళికలో టూరింగ్ విలేట్సుగాని, dispensaries గాని చాలా ఎక్కువ అవుతాయని ఆశిస్తున్నాను.

*Posts of L.D. Cs. and U.D. Cs. in the Education and Endowments Department.*

632—

*866 Q.—SRI T. LAKSHMINARAYANA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether it is a fact that in the Education and Endowments Department of the Secretariat, persons given higher rank by the Andhra Public Service Commission are kept as Lower Division Clerks and persons given a lower rank are given Upper Division Clerks' posts ,

(b) whether it is a fact that persons selected for Ministerial services by the Service Commission and were working as Upper Division Clerks in the Ministerial service were taken as Upper Division Clerks in the Secretariat services in the Department of Education and Endowments ignoring those persons selected for the Secretariat Service by the Andhra Public Service Commission ;

(c) if so, is it the practice in other departments of the Secretariat ; and

(d) whether it is a fact that emergency candidates in the Upper Division Clerks' posts are not reverted back, even when persons selected by the Andhra Public Service Commission were available in the Education and Endowments Department in the Secretariat as is done in other Departments of the Secretariat ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The post of Upper Division Clerk in the Secretariat belongs to selection category. A few of the Commission candidates allotted to this Department were appointed as Upper Division Clerks under emergency provisions as they had considerable previous experience in the Secretariat or in the moffusil more so than others and as they were found fit for promotion.

(b) The answer is in the negative.

(c) Does not arise.

(d) No direct recruit Upper Division Clerk selected by the Andhra Public Service Commission was allotted to this Department. Five among the Lower Division Clerks selected by the Andhra Public Service Commission and allotted to

this Department have put in service ranging from 4½ to 7 months only and they have not picked up the work well and are not ripe for promotion Some candidates were promoted under emergency provisions as Upper Division Clerks on different dates in view of their long service in the Secretariat. They will be replaced as soon as experienced Upper Division Clerks from the Collectorates or direct recruits selected by Andhra Public Service Commission become available or some of the existing Commission candidates pick up sufficient experience and are found fit for promotion in their turn.

SRI T. LAKSHMINARAYANA REDDI :—Mr. Speaker, Sir, is it not absurd and gross injustice that candidates who are given 4th, 5th, 6th or 7th rank should continue as lower division clerks in the Education and Endowments Department whereas candidates given 50th or 60th rank by the Public Service Commission are working as upper division clerks in the Secretariat ?

THE HON. DR. B. GOPALA REDDI :—Obviously, the Hon. Member was approached by some people in the department. Therefore, the department also is taking very serious view of the way in which the government servants are trying to bring political pressure on the Government. But the whole matter has been examined and I do not see anything absurd in this.

SRI T. LAKSHMINARAYANA REDDI :—I am sorry, Sir, I deny that charge.

THE HON. DR. B. GOPALA REDDI :—I do not know that. Unless, of course, some people have approached the hon Member, it is not likely that the Hon. Member will put this question and the supplementary question also. That is the impression of the Government, at any rate.

SRI S. VEMAYYA :—క్లాజు (b) కు జవాబుచెబుతూ negative అన్నారు. ఈ Secretariat service rules లో కూడా mofussil నుంచి

24th March 1956]

కొందరిని తీసుకున్నట్లు తెలుస్తోంది. ఇది negative అని చెప్పడం అర్థరహితంగావుంది. ఈ విధమైన జవాబు చెప్పటంవలన మీరు ఏ ప్రశ్నకూకూడా సరియైన సమాధానం చెప్పటలేదని తెలుస్తోంది. కాబట్టి దీనిని inquiry చేయించి యిటువంటి irregularities జరుగకుండా దీనికి ఒక Secretary ని నియమిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI:—దీనికోసం ఒక Secretaryని నియమించమంటారా? ఇవన్నీ కూడా Home department, concerned departments ఎప్పటికప్పుడు examine చేస్తూనే వుంటాయి. అందువల్ల సరియైన information చెప్పటలేదని మీరు అనుమానపడనక్కరలేదు.

SRI PRAGADA KOTAIAH.—ఇప్పుడు Secretariat serviceకు Minimum qualification graduate అయివుండాలి. Ministerial service కి S. S. L. C pass అయితే చాలును. ఇప్పుడు Secretariat service కి recruit అయినట్టి candidates పనిచేస్తూవుండగా వాళ్లను వదిలేసి, S. S. L. C pass అయి Ministerial service నుంచి వచ్చినవారిని upper division clerks గా తీసుకోవడం అన్యాయమని ప్రభుత్వం భావిస్తుందా ? లేక అధికారులు చేస్తున్న చర్యలనే సమర్థించడానికి పూనుకుంటుందా ?

THE HON. Dr. B. GOPALA REDDI:—ఈ విషయాన్ని గురించి ఆవేశపడవలసిన అవసరంలేదు ఆంధ్రరాష్ట్రం యేర్పడినప్పుడు Secretariat కి కావలసిన సిబ్బంది లేకపోయింది. అప్పుడు ఇతరజిల్లాలనుంచి కొంతమందిని వాళ్లకు పెద్ద qualifications లేకపోయినప్పటికీ ఏ collectorate లోనో 7-8 సం॥లనుంచి పనిచేస్తూ అనుభవంపొందినవారిని తీసుకువచ్చి Secretariat లో U. D. C. లుగా వేసుకున్నారు. Secretariat form అయినపుడు ఈవిధమైన emergency వచ్చింది. అప్పుడు graduates ని వేసుకోడమా? లేక అనుభవంగలవారిని ఏ గుంటూరు, కృష్ణాజిల్లాల Collectorate నుంచో తీసుకువచ్చి వారిని యిక్కడ promote చేయడమా అనేవిషయాన్ని చాలామంది consider చేసినారు.

దానిప్రకారమే promote చేసినారు. కాని యిది కేవలం వ్యక్తిగతమైన పక్షపాతంతో చేయలేదు.

SRI PRAGADA KOTAIAH:—ఇది ఈమధ్యఒకనెలనుంచి జరుగుతున్న విషయమండీ. Public Service Commission సెలెక్టుచేసిన candidates వుండగాకూడ యిలా జరుగుతోంది.

THE HON. DR. B. GOPALA REDDI :—Even Public Services Commission candidates may be raw candidates. Therefore it is a question of preference between experienced and inexperienced people.

SRI E. AYYAPU REDDI:—Sir, is the Government aware that there is lot of dis-satisfaction in the Secretariat staff that promotions have been arbitrary and quixotic in some cases, and if so, will the Government ask the Public Service Commission or appoint some Secretary, to go into the question of regularising those promotions ?

THE HON. DR. B. GOPALA REDDI :—I am not aware of any dis-satisfaction in the Secretariat staff. Perhaps the Hon. Member is aware of it more. Anyhow, if there is any complaint in regard to any particular promotion, the Government will certainly look into the matter and rectify if there is any mistake committed.

MR. SPEAKER .—Bring specific cases to the notice of the Government in stead of putting too general questions.

SRI P. SUNDARAYYA :—ముఖ్యమంత్రిగారు ఇపుడిచ్చినట్టి సమాధానమునుబట్టి చూస్తే ఇటువంటి specific instances మంత్రిగారి దృష్టికి తీసుకురావడమే ప్రమాదకరంగా కనిపించుచున్నది. ఈ ప్రశ్న శాసనసభ్యులకు ఎవరో చెప్పినట్లుగా మంత్రిగారు చెపుతున్నారు. ఎవరూ చెప్పకుండా వుంటే మేము శాసన సభ్యులుగా వుండవలసిన అవసరమేమిటి? ఎవరో వారి కష్టాలను గురించి మాతో చెప్పుకుంటే మేము దాన్నిగురించిన వాస్తవము ఏమిటని మంత్రిగారిని అడిగితే "ఆలోచిస్తున్నాము. ఆ ఉద్యోగస్థులమీద చర్య తీసుకుంటాము" అని వారిని ఆ ఉద్యోగం నుంచి తొలగించేటట్లుగా బెదిరించుతూ, సమాధానం యిస్తుంటే అటువంటి specification ను శాసన సభ్యుడు మంత్రిగారి దగ్గరకు యేవిధంగా తీసుకొని రాగలడు ? తీసికొని వచ్చినందువల్ల ఫలితము ఏమిటి? ముఖ్యమంత్రిగారు దీనినిగురించి ఇంకొక పర్యాయం వివరిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఎవరికైనా అక్రమంగా promotion జరిగిందని వారు అనుకున్నప్పుడు "They have always got the right of appeal and the right . of memorial to the Governor. అంతేకాని M. L. A. ల కొరకు hostel చుట్టూ తిరుగుతూవుంటే అది న్యాయంకాదు.

Sri P. SUNDARAYYA :—అధ్యక్షా! ఇది శాసన సభలయొక్క, శాసనసభ్యులయొక్క హక్కులకుకూడా భంగకరమని మీదృష్టికి తీసుకొనిరావడమే నా ఉద్దేశ్యం. ప్రభుత్వోద్యోగులకు కొన్ని కష్టాలు వచ్చినపుడు, అవి శాసన సభ్యులకు తెలిసినపుడు వారు general గా యిటువంటివి జరుగుతున్నాయని మంత్రులతో చెప్పుకోడానికి హక్కు లేనట్లయితే ఎల్లాగ ?

Mr. SPEAKER :—The right was never denied by the Hon. Chief Minister.

Sri P. SUNDARAYYA :— ఈ ప్రశ్న మేము అడిగినాము. ఇటువంటివి జరుగుతున్నాయి విచారిస్తారా అని అడిగితే "మీకు ఎవరో చెప్పారు కొబట్టి వాళ్ల మీద తగిన చర్య తీసుకుంటాము" అంటున్నారు. ఇట్లా అయినట్లయితే మేము అసలు ఈ ప్రశ్న తీసుకురావడమే పొరపాటు. ఇంకొక విధంగా దానికి పరిష్కార మార్గం చూసుకోవలసిన అవసరమున్నట్లు కనిపిస్తోంది, ఏదైనా general గా అన్యాయం జరుగుతోందని మేము చెప్పినపుడు, ఈ information మీకు ఎవరో చెప్పారు. వాళ్లకు అధనంగా punishment యిస్తామనే ధోరణిలో మంత్రిగారు సమాధానమిస్తున్నప్పుడు మేము వారిని ఏ రీతిగా యిక్కడ ప్రశ్నలడుగగలము ? మేము యిక్కడ వుండవలసిన అవసరము ఏమిటి ?

The Hon. Dr. B. GOPALA RLDDI :—ఇది చాలా అనుభవంమీద చేసిన rule. Govenment servants కు ఎవరైనా వారియొక్క grievances ను గురించి general questions వేసుకోవచ్చును. అంతేకాని శాసన సభ్యుల ద్వారా ప్రశ్నలు వేయించుట ద్వారాగాని, కోత తీర్మానముల ద్వారాగాని ప్రభుత్వముపై వత్తిడి తీసుకొనిరాకూడదు. ఇది పూర్వం నుంచీ అమలులోవున్న నిబంధన. అన్ని దేశాలలోనుకూడ ఈ rule వుంది. ఏ Deputy Inspector కో, ఏ Circle Inspector నో వారి యిష్టమువచ్చిన చోటికి transfer చేయలేదు అనిగాని, వారికి promotions యివ్వడం లేదనిగాని 10 మందినో 20 మందినో శాసన సభ్యులనుకూడ గట్టుకొని, వారిచేత ప్రశ్నలు వేయించడం, కోత తీర్మానాలు ప్రవేశ పెట్టించడం న్యాయంకాదు. అలా చేసినట్లయితే అది రాజ్యాంగంమీద ఒత్తిడి తీసికొని వచ్చినట్లు అవుతుంది.

కొబట్టి ఏదైనా general questions కావాలంటే శాసనసభ్యుల నడిగి తెలుసుకోవచ్చును. అంతేకాని ఫలాన ఉదోగస్థుని ఎందుకు transfer చేసినారు? Deputy Collector గార్ని కందుకూరునుంచి కావలికి ఎందుకు transfer చేసి

సారు? అని అడగకూడదు. General గా ఏమైనా అక్రమాలు జరిగినపుడు శాసనసభ్యులు ప్రశ్నలువేయవచ్చును. లేకపోతే ఏ Deputy Collector గారో వచ్చి "మీరు మంత్రిగార్ని ప్రశ్నలువేయండి. వారు ఏమని సమాధానం చెబుతారో చూస్తాము" అని శాసనసభ్యులద్వారా ప్రభుత్వంమీద ఒత్తిడితీసికొని వచ్చుటకు ప్రయత్నించడం న్యాయంకాదు. వారికి ఎటువంటి యిబ్బందులయినా కలిగినపుడు appeal చేసుకోడానికి అధికారంవుంది. వారుదానిని rectify చేసుకోడానికి ఒక procedure వుంది. Public service commission వారికి appeal చేసుకోవచ్చును. గవర్నరుగారికి appeal చేసుకోవచ్చును. ఇవన్నీ చూడకుండా ప్రభుత్వంమీద ఒత్తిడితీసుకొని వచ్చుటకు ప్రయత్నించరాదు.

SRI P. SUNDARAYYA:—General గా ఏమైనా అక్రమాలు జరిగినప్పుడు గవర్నరుగారికి appeal చేసుకోవచ్చునని మంత్రిగారు చెప్పారు. Constitution లో చూసినట్లయితే గవర్నరుగారుకూడా మంత్రివర్గం చెప్పినట్లు చేయాలని వుంది. "మంత్రివర్గానికి కాకుండా గవర్నరుగారికి appeal చేసుకుంటే వారు దీంట్లో జోక్యం కల్గించుకునే హక్కు వుంది" అని ఈనాడు గోపాలరెడ్డిగారు చెబుతున్నారు. కాని Constitution లో ఎక్కడాకూడా కనిపించలేదు. పోనీ గవర్నరుగారికి సర్వాధికారాలు వున్నాయనుకునేటట్లయితే గవర్నరుగారికి appeal చేసుకున్నప్పటికీకూడా న్యాయం జరుగకపోతే ఫలానవ్యక్తికి అన్యాయం జరుగుతోంది. ప్రభుత్వంవారు న్యాయంజరిగేటట్లుగా ఎందుకు చేయుటలేదు అని శాసనసభ్యులు అడగడానికి అభ్యంతరం ఏమిటి? ఎవరో ఒకరు చెప్పినంతమాత్రాన శాసనసభ్యులు దానినిగురించి నిజానిజములు తెలుసుకోకుండా యిష్టంవచ్చినట్లు ప్రశ్నలువేసి political pressure తీసుకువస్తున్నారు" అనేది ఏలా వుందంటే మంత్రులే అటువంటి political pressure తీసుకొనివచ్చి దానిని కప్పిపుచ్చుకోడానికి యిలా చేస్తున్నట్లుంది.

THE HON. DR. B. GOPALA REDDI:—Members కు అటువంటి హక్కు వుంది అని చెబుతున్నాను. కాని ప్రభుత్వోద్యోగులు శాసనసభ్యులద్వారా ఒత్తిడితీసుకొనివచ్చుట మంచిదికాదు.

Members కు యిప్పుడున్నటువంటి అధికారాలను ఎవ్వరూ తీసివేయలేరు. అధ్యక్షులవారు వాటిని సంరక్షించుటకు పూనుకొనివున్నారు. సభ్యుల అధికారాలకు ఏమీఫరవాలేదు. కాని Government servants M.L.A. ల దగ్గరకువచ్చి "మాకు ఈవిధమైన కష్టాలున్నాయి. వీటిని గురించి అసెంబ్లీలో ప్రశ్నలువేయండి, కోత తీర్మానాలు పెట్టండి, లేకపోతే no confidence తీర్మానం పెట్టండి" అని అడుగుట న్యాయంకాదు.

SRI S. VEMAYYA:—ప్రభుత్వోద్యోగులే M.L.A ల దగ్గరకువచ్చి చెప్పినారు అనుకోకుండా, వారి తల్లిదండ్రులువచ్చి మాపిల్లలు యిటువంటి కష్టాలు పడుతున్నారని చెబితే తెలుసుకొనిగాని, లేకపోతే ఏదోవిధంగా M.L.A లకు తెలిసిందని భావించి వాళ్లకు punishment యివ్వకుండా మన్నిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI:—మన్నించడం, మన్నించకపోవడం అనేది point కాదు. వారిని ఈవిధంగా encourage చేయకూడదని చెబుతున్నాను.

The point is that Government servants should not approach the M. L. As while M. L. As. have every right to get information from any quarter they like, from the newspapers or from anybody. But Government servants should not approach M. L. As. and try to bring political pressure on the Government.

SRI PRAGADA KOTAIAH.—ఎవరో చెబితేనే ఈ ప్రశ్న ఉత్పన్నమైనది అంటున్నారు. శాసనసభ్యులు వారంతటవారే ఈ విషయాలను గ్రహించడానికి ప్రయత్నంచేస్తూ, తెలిసినప్పుడు ఈ సమస్యను ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొనిరావడంకోసం ఈ ప్రశ్న వేస్తున్నారని ఎందుకు అనుకోకూడదు ?

THE HON. DR. B. GOPALA REDDI:—ప్రభుత్వం అన్నీ ఆలోచిస్తుంది. Government servant M.L.A. దగ్గరకువచ్చి ఈ information చెబుతున్నాడా ? లేక M. L. A. ఎవరిదగ్గరకైనాపోయి ఈప్రశ్న సంపాదించారా అని ప్రభుత్వం తెలుసుకోడానికి కొన్నికొన్ని విషయాలలో వీలవుతుంది.

SRI T. LAKSHMINARAYANA REDDI:—Mr. Speaker Sir, నేను charge deny చేసినప్పటికికూడా ముఖ్యమంత్రిగారు దానిని నాకెవరో చెప్పినట్లు మాట్లాడుతున్నారు. ప్రభుత్వమే ఆవిధంగా భావించినట్లయితే M. L. As గా మేము, మా duties ను discharge చేయ్యలేమేమో అనుకుంటున్నాను. It is a question of principle.

MR. SPEAKER:—Your right of putting the question is not denied.

SRI P. SUNDARAYYA:—What is that right of putting the question if the particular officer is going to be victimised ?

[24th March 1956

MR. SPEAKER :—You calmly think over the matter. There is a lot of difference.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, మాకేదో ఒకవిధంగా information వచ్చినది. దానిని పురస్కరించుకొని మేము ప్రశ్న అడిగినాము. పక్షపాత బుద్ధితో కొంతమంది promote చేయబడినారనే విషయం ప్రభుత్వానికి కూడా తెలుసు. ఈ విషయమై మాకు information వచ్చినంతమాత్రంచేత ప్రభుత్వం మీద presure తీసుకురాబడినదని భావించడం సరికాదు. మాకు అధికారాలు లేవు, కనుక presure తీసుకొనివచ్చినారని అనుకోవడం భావ్యం కాదు. మంత్రులకు అధికారం ఉన్నది కాబట్టి political pressure మంత్రులమీదనే ఉపయోగింపబడి ఉండవచ్చు. దానిమీద ప్రశ్నవేస్తే మీకు ఎవరో చెప్పిఉండాలి అనడం న్యాయంకాదు. Promote కావలసినవాళ్లకు promotion ఇవ్వకపోవడమే కాకుండా వారు చెప్పిఉండాలనే presumption తో వాళ్లమీద ప్రభుత్వం చర్య తీసుకొనేధోరణిలో నడుస్తున్నపుడు శాసనసభ్యులయొక్క హక్కును ఏరకంగా కాపాడడం అవుతుంది ? శాసనసభ్యులు ఏరీతిగా పనిచేయడానికి వీలవుతుంది ?

MR. SPEAKER :—I will give my ruling. I am not here to protect the rights of those public servants who make complaints to M. L. As. I am here to protect the rights of hon. Members to put questions. The Members have got every right to put questions. But I am not here to protect the rights of people elsewhere.

SRI P. SUNDARAYYA :—Sir, we are not asking you to protect the rights of Members to put questions and that we will take care of ourselves. What we want you to protect is the right of the Assembly. My point is the Speaker's job is to protect the rights of the Assembly. When we are putting a question in the Assembly, relating to a particular grievance of particular people and if on that the Government takes vindictive action, it goes against the right of the Assembly itself. Otherwise we cannot do anything at all.

MR. SPEAKER :—I differ.

SRI P. SUNDARAYYA :—In that case, Sir, I suggest that the whole matter may be referred to the Privileges Committee.

24th March 1956]

MR. SPEAKER :—I will consider it.

SRI M. NAGI REDDI :—మంత్రిగారు చెబుతూ దానికి సంబంధించినటువంటి వ్యక్తులు M. L. A ల దగ్గరకు వచ్చి చెప్పారా, లేక ఆ ఉద్యోగులు తెలిసినందువల్ల వీళ్ళే ఆ ప్రశ్నలు అడుగుతున్నారా? అని అంటున్నారు. Secretariat గుమాస్తాలు మొదలైన ప్రతి department వారు కూడా M.L Aలను approach అవుతున్నారా అనే విషయాన్ని C.I.D లను వేసి తెలుసుకొంటున్నారా లేక ప్రభుత్వమే ఆవిధంగా ఆలోచిస్తున్నదా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అన్నివిషయాలు ఉన్నాయి. అవసరమైతే C.I.D లను కూడా వేస్తాము.

(At this stage Sri Vavilala Gopalakrishnayya was seen standing.)

MR. SPEAKER:—We have already spent sufficient time.

SRI PILLALAMARRI VENKATESWARLU :— అనేకమంది గుమాస్తాలు victimise కాబోతున్నారు. వాళ్ళయొక్క హక్కులను రక్షించవలసిన బాధ్యత మామీద ఉన్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇది general గా వేసిన ప్రశ్న. ఎవరైనా ఇద్దరి ముగ్గురికి అన్యాయం జరిగితే అది generalisation అవుతుంది. Particular గా ఒకరిపేరు తీసుకొని అడిగితే అది particularisation అవుతుంది. General గా అడగవద్దు. Specific cases గురించి చెప్పమని మమ్మల్ని ప్రభుత్వమువారు అడుగుతున్నారు. Specific cases గురించి చెప్పినట్లయితే చర్యతీసుకొంటామని అంటున్నారు. General గా అడిగితే specific cases కాదు. గనుక జవాబు లేదు అంటున్నారు.

MR. SPEAKER :— You are putting a hypothetical question.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇప్పుడు జరిగిందే నేను మనవిచేస్తున్నాను. ఒక cadre లో ఉన్నటువంటి వాళ్లను seniority ఉన్నప్పుడు దానికిపై cadre లోకి వేయడమా లేదా అనే ప్రశ్న వచ్చింది. ఎవరో ఫలానావాళ్లు మీకు వచ్చి చెప్పారు వాళ్లమీద చర్యతీసుకొంటామని ముఖ్యమంత్రిగారు చెప్పుతున్నారు. అంతేకాకుండా generalise చేసినట్లయితే మాకు

పర్యతీసుకోడానికి కొంతవరకు అవకాశం ఉంటుంది అన్నారు. Specific cases చెప్పినట్లయితే పరిశీలిస్తామనికూడా చెప్పారు. ఇటువంటిపరిస్థితులలో మేము specific cases ను గురించి చెప్పవలెనో, లేక general cases ను గురించి చెప్పవలెనో మాకు బోధపడడంలేదు. అయితే ఒకవిషయం ప్రభుత్వం గమనించాలి. మేము అనేకసంగతులు వింటూ ఉంటాము. Affect అయిన మనుష్యులు మాదగ్గరకు వచ్చి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. మేము అనేకవిషయాలు enquiry చేస్తూ ఉంటాము. ఎన్నోవిషయాలగురించి మాకు తెలుస్తూఉంటాయి వాటిపై ప్రశ్నలు వేసే హక్కు మాకుఉన్నది. మాకు తెలిసిన విషయాలగురించి మేము ప్రశ్నలువేస్తూ ఉంటే ఒక్కవ్యక్తిని దృష్టిలో ఉంచుకొని ఆ ప్రశ్న మేము పంపించామని భావించి వారిని victimise చేయడం భావ్యంకాదు. మేముపంపిన ప్రశ్నకు మేమే బాధ్యులము. ప్రశ్నలయొక్క అర్థాన్ని ఉన్నది ఉన్నట్లుగా గ్రహించాలిగాని, ఎవరో మాచేత వేయించారని భావించరాదు. అందుచేత ఎవరినీ victimise చేయడం సబబుకాదు. General questions కు general గా సమాధానం చెప్పాల్సిన అవసరం ఉన్నదని చెబుతూ, ఆ విధంగా ఈ సందర్భములో ఏమి చేశారని అడుగుతున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—I have already answered the question and I have nothing more to add.

SRI P. SUNDARAYYA :—Sir, I protest the way in which the Hon Chief Minister answered the question. We, members of the Communist Party, are not going to participate any more in the supplementary questions of the day, and we will consider what further action is necessary.

THE HON. DR. B. GOPALA REDDI .—After great experience, this rule that Government servants should not meet M.L.As. has been made. Otherwise the life of Assembly Members will be imposible.

*Starting of Veterinary Hospitals in the State.*

633—

* 981 Q.—SRI. P. VENKATARAVANAPPA :—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) whether the Government propose to start some more Veterinary Hospitals in the State ; and

(b) if so, where ?

24th March 1956]

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) Yes, Sir.

(b) The Centres have not yet been decided.

SRI P. VENKATARAVANAPPA :—అధ్యక్షా, మన రాష్ట్రంలో ఎన్ని పశువైద్యశాలలు ఉన్నాయి ? ఇంకా ఎన్ని ఏర్పాటుచేయబోతున్నారు ?

THE HON. DR. B. GOPALA REDDI :—సంఖ్యలేదు. వేరే ప్రశ్న వేస్తే సమాధానం చెప్తాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, Veterinary hospitals లో చాలా catagories ఉన్నాయి. Hospitals, Minor veterinary dispensary, first aid centre వీటన్నిటిని ప్రజలే ముందుకువచ్చి స్వయంగా పెట్టుకోవాలిఅంటే దానికి, ప్రభుత్వం అవలంబిస్తున్న విధానంఏమిటో వివరంగా తెలియచేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇటీవల కొన్నిచోట్ల ప్రజలు "మేముకూడా buildings కట్టిస్తాము, recurring expenditure ను మా పంచాయతీబోర్డునుంచి ఇస్తాము" నేటటువంటి offiers కూడా వస్తున్నాయి. L. D. works లోకూడా కొన్ని hospital buildngs కట్టిస్తామంటున్నారు. ఈ విధంగా ఒకటి, రెండు సంవత్సరాలలో ఇంకా ఎక్కువ చేయడానికి ప్రభుత్వము సర్వవిధాల ప్రయత్నము చేస్తున్నది.

*Admission of pupils into the Elementary Schools.*

634—

* 1027 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether there is any rule in pursuance of G.O. Ms. No. 2678, Education, dated 27—12—1955 that a Divisional Inspector of Schools can sanction the age exemption to admit the pupil below 5 years into the Elementary Schools ;

(b) to what extent the exemption can be sanctioned ; and

(c) whether the rule will be placed on the Table of the House ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) and (c) Does not arise.

*Establishment of an Agricultural College*

635—

* 818 Q.—SRI B. APPA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government have any proposal to establish an Agricultural College or to reopen and make permanent the Agricultural Technical Training School at Anakapalle ; and

(b) if so, when ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) No, Sir.

(b) Does not arise.

SRI B. APPA RAO :—ఆంధ్రరాష్ట్రంలోకల్లా ఒక్కటే Agricultural College బాపట్లలో ఉన్నది. కాబట్టి అనకాపల్లిలో యింకొకటి పెట్టవలసి ఉన్నది. Second Five years Plan కాలంలో ఇంకొక Agricultural College ని నెలకొల్పడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇప్పుడు మనకు బాపట్లలో ఒక కాలేజీఉన్నది. బహుశా హైదరాబాదులోకూడా ఒక కాలేజి ఉన్నదనే అనుకొంటున్నాను. ఆంధ్ర తెలంగాణాలకు ఈరెండు Colleges కన్న ఎక్కువ అవసరంలేదు. అయినా దానిని నెమ్మదిగా విచారించవలసిఉన్నది: ఇప్పుడు పరిస్థితులనుబట్టి అంతకన్న ఎక్కువ Colleges అక్కరలేదని అనిపిస్తున్నది.

SRI A. CHIDAMBARA REDDI :—అధ్యక్షా, ఇది కాలేజిని గురించికాదు. Agricultural Technical Trainınig School గురించి అనంతపురం, కడప, కర్నూలు, ఈ ప్రాంతాలలో ఇటువంటి Traininig school లేనందువల్ల Agriculture గురించి తెలుసుకోవాలన్న విద్యార్థులకు చాల నష్టం కలుగుతున్నది. కాబట్టి ఈ జిల్లాలలో ఎక్కడైన ఒకచోట Agricultural Technical Trainınig School ను open చేయడానికి ప్రభుత్వం ఏమైన ప్రయత్నంచేస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—College కాకుండా Technical School విషయమైతే Government వారు ఆలోచిస్తారు.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఆంధ్ర రాష్ట్రములో వ్యవసాయముమీద హెచ్చుమంది జీవిస్తున్నారు. కనుక కనీసం రెండు Colleges అయినా క్రొత్తవి రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రారంభించడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ దినము సాయంత్రము ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికపైన discussion జరుగుతుంది. అప్పుడు ఆలోచిస్తాము.

## II POINT OF INFORMATION Re: Travelling Allowance to Assembly Members.

SRI L. LAKSHMANA DAS :—On a point of information Sir, ఇక్కడ అన్ని పార్టీల నాయకులందరు సమావేశమై ఆంధ్రరాష్ట్రములో మళ్లీ ఎన్నికలు వెంటనే కావాలని కోరినట్లుగా ఆంధ్ర ప్రభలో ఒక ప్రకటన వచ్చింది. అది ఎంతవరకు నిజమో ఈ సభయొక్క Leader గారు తెలియజేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అది కొంచెము వాస్తవానికి దూరంగా ఉన్నది.

MR. SPEAKER :—That information is not correct.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, అది కొంచెము వాస్తవానికి దూరమని అంటున్నారు, అది ఎంత దూరమో తెలియజేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—పదియోజనము లైనా ఉంటుంది.

SRI P. GUNNAYYA :—ఈ అసెంబ్లీ సమావేశమునకు 30 వ తేదీ నుండి మూడు రోజులు సెలవిస్తామని అన్నారు. మూడు రోజులు చాలదు, అయిదు రోజులు ఇవ్వవలసిందని కోరాము. ఆ విషయము ఈ దినము చెప్పుతామని అన్నారు. అది త్వరగా చెబితే బాగుంటుంది.

THE HON. DR. B. GOPALA REDDI :—ఇప్పుడు T.A. Rules మార్చడానికి ప్రభుత్వము నిశ్చయించింది. అవి మార్చి 23 నుండి అమలులోకి వస్తవి. కనుక ఈమధ్య మూడు రోజుల సెలవులలో ఎవరైనా ఇంటికిపోయి రావచ్చును. T.A. or D.A., whichever is less will be given to them.

[24th March 1956

SRI R. B. RAMAKRISHNA RAJU :—T.A or D.A. whichever is less అనే rule మద్రాసులో ఉన్నది. అది దగ్గరగా ఉంటే వాళ్లకు ఫరవాలేదు కాని, దూరంగా ఉండేవాళ్లకు చాలా కష్టంగా ఉంటుంది ఇప్పుడు విశాఖపట్టణము, శ్రీకాకుళం పోయేవారికి మూడు రోజులకు 36 రూపాయలు D.A. వస్తే, అది వారికి ఏమిటికి సరిపోతుంది. వారికి ఒక single చార్జీనే 40, 50 రూపాయలు అవుతుంది. కాబట్టి ఒకసారి మధ్యలో ఇంటికిపోయి రావడానికి అవకాశము కల్గించే ఉద్దేశముతో చేస్తున్నారు. గనుక ఈవిధంగా T.A. or D.A. whichever is less అనకుండా, ఒకసారి ఇంటికిపోయిరావచ్చును అంటె బాగుంటుందని మనవిచేస్తున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—పార్లమెంటులోను, మద్రాసులోను, ప్రతిచోటకూడా 'T.A. or D.A. whichever is less' అనే rule observe చేస్తున్నారు. కనక వారందరు ఆవిధంగా చేసేటప్పుడు, మనము మాత్రము దానిని ఉల్లంఘించడం న్యాయంకాదేమో అనుకుంటాను

SRI R. B. RAMAKRISHNA RAJU :—సభ్యులు ఒకసారి ఇంటికి పోయిరావడానికి సౌకర్యం కలిగించడం అనేది మీ ఉద్దేశమయితే, మాబోటి వాళ్లకు చిత్తూరుకు పోయిరావడానికి D. A. ఇస్తామంటె అది మాకు అనుకూలంగానే ఉంటుంది గాని విశాఖపట్టణము, అటువంటి దూరప్రదేశాలకు పోయే వారికి D. A. అంటె చాల తక్కువగా ఉంటుంది. కనుక అందరికి సౌకర్యంగా ఉండేటట్లు, ఒకతూరి ఇంటికిపోయి రావచ్చు అంటె బాగుంటుందని మనవి చేస్తున్నాను.

SRI A. BAPI NEEDU :—ఇప్పుడు T.A. Rules ప్రకారం బస్సుమీద ప్రయాణంచేస్తే double the bus fare ఇస్తున్నారు. కాని రైలులో ప్రయాణం చేస్తే first class fare ఇస్తున్నారు ఈవిధంగా బస్సులో ప్రయాణముచేసి నప్పుడు peons కు ఇచ్చినట్లుగా T A. ఇవ్వడం ఏమాత్రం సమంజసంగా లేదు. కనుక ఈ Rulesను amend చేసి bus లో ప్రయాణంచేసినా, రైలులో ప్రయాణం చేసినా car లో ప్రయాణంచేసినా, మామూలు రైలులో ప్రయాణంచేసినట్లు T.A. ఇవ్వవలసిందని మనవిచేస్తున్నాను.

THE HON. DR B. GOPALA REDDI :—ఈ rule సవరణచేస్తే బాగుంటుందనే మాట స్పీకరుగారుకూడ చెప్పారు; అది నెమ్మదిగా చూచుకో వచ్చును. ముందు ఇప్పుడు ఇంటికిపోయి వచ్చేది చూచుకొందాము. నేను చెప్పిన rule, 23 వ తేదీనుంచి అమలులోకివస్తుంది. దాని actual wording కావాలంటే తరువాత చెప్పతాను. ఇంకా అది draft చేస్తున్నాము ఆ నిర్ణయము మాత్రం జరిగింది.

SRI N P CHENGALRAYA NAIDU :—అధ్యక్షా, ఈ అసెంబ్లీ సమావేశము ఈనెల ఆఖరుకు సమాప్తమవుతుంది. మళ్ళీ రెండవ తేదీ ప్రారంభ మవుతుంది. అంటే అది కొత్త session అవుతుందన్నమాట. కనుక ఇప్పుడు ఇంటికి పోయివచ్చేదానికి ప్రభుత్వము ఏమీ దాక్షిణ్యం చూపి T.A. ఇవ్వవలసిన పనిలేదు.

THE HON. DR. B. GOPALA REDDI :—అవిధంగా కాదు, ఇది continuous sitting. మధ్యలో 30, 31, 1వ తేదీలలో sitting మాత్రము ఉండదు. అంతేగాని, ఇదంతా continuous sitting.

SRI L. LAKSHMANA DAS :—ఇప్పుడు మేము చాలా దూరము పోయి రావలసిఉంటుంది కాబట్టి, మీరు T. A. ఇస్తే ఇవ్వండి లేకపోతే లేదు. కాని మాకుఇస్తే అయిదురోజులు time ఇవ్వండి, లేకపోతే 29 నుంచి continuous గా కూర్చోడానికి మేము సిద్ధంగా ఉన్నాము. అందుచేత చాలాదూరంగా పోవలసినటువంటి సభ్యులగురించి ఆలోచించవలసిందని కోరుతున్నాను

[NOTE.—An asterisk* at the commencement of a speech denotes revision by the Member.]

## III DISCUSSION ON SUPPLEMENTARY STATEMENT OF EXPENDITURE FOR 1956-57 (Contd.)

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈరోజు ప్రభుత్వము మన ముందు పెట్టినటువంటి ఈ Supplementary Demands లో కొన్ని కొన్ని విషయాలు తీసుకొన్నప్పుడు, ప్రభుత్వము ఒక ప్రక్కనేమో డబ్బులేదని చెప్పు తూనే రెండవప్రక్కన కొంత అనవసరంగా ఖర్చుపెట్టేధోరణి ఇందులో కన్పడు తున్నదనే విషయము ప్రధానంగా మీ దృష్టికి, తీసుకురావలసియుంటుంది. మొదట అడవుల డిమాండు తీసుకొందాము. ఈ అడవుల డిమాండులో 3 లక్షల, 38 వేలకుపైగా కోరారు. అందులో అడవులలో వచ్చేటటువంటి సామాగ్రిని అమ్మే దానికోసం ఒక కొత్త scheme పెడతామని, దానికి లక్షా, 50 వేలు కావలసి యుంటుందన్నారు. కొస్త నిర్మాణాత్మక సూచనగా న్యాయంగా కనిపిస్తున్నది అది ఒక్కటే అని చెప్పవలసియుంటుంది. మిగిలిన లక్ష, 90 వేల రూపాయలు ఎక్కువమంది ఉద్యోగస్థులను వేయవలసివచ్చినందువల్ల, వారికి జీతాలకుగాను చూపించారు ఈ అడవులలోనుంచి వస్తూన్నటువంటి సామాగ్రిని అమ్మేదానికోసం లక్షా, 90 వేల రూపాయలు అదనంగా ఖర్చుపెట్టవలసియుంటుందని నేను అను కోవడంలేదు. ఎందుకంటె, ఈ ఖర్చుఅంతాకూడ ఆ scheme క్రిందనే వస్తుంది.

Sri P. Sundarayya] [24th March 1956

ఉన్న ఉద్యోగస్తులు చాలరని, ఇంకా ఎక్కువమంది ఉద్యోగస్తులను వేస్తేమాత్రం ఈ అడవులను బాగుచేసేందుకు ఇది ఏరీతిగా ఉపయోగపడుతుందో తెలియదు. దానికోసం ఎక్కువడబ్బు పెట్టడం నిరుపయోగమవుతుందనేది అనేక పర్యాయాలు మీ దృష్టికి తీసుకురాబడింది. అది మరల ఇప్పుడు మీదృష్టికి తీసుకురాదలచాను రెండవది వివిధ పరిపాలనాయంత్రములయొక్క అధిపతుల ఖర్చుక్రింద కొంత డబ్బు అడిగారు. అందులో ముఖ్యంగా, గవర్నరు ఖర్చుక్రింద 27 వేల 7 వందలు రూపాయలు మరల అడిగారు. ఇదంతా Charged Item క్రిందనే వచ్చింది. వాటిలో దేనిని తోసివేయడానికి మనకు అధికారంలేదు. అధికారము ఉన్నప్పటికి, ఈరోజు మన శాసనసభయొక్క నిర్మాణాన్నిబట్టిచూస్తే అటువంటి అవకాశము కూడ ఉండదు గవర్నరుమీద ఖర్చుపెట్టే ప్రతిదమ్మిడికూడ అనవసరము, నిరర్థకము, నిరుపయోగము, అది ప్రజలయొక్క ధనమును దుర్వినియోగంచేయడం తప్ప మరొకటికాదు అని గతసంవత్సరంనుంచి చెప్పుతూవచ్చాను. పోయిన బడ్జెట్ సమావేశములో చెప్పాను. మొన్న general debate లో చెప్పాను. మరల ఈ రోజుకూడ అదే చెప్పుతున్నాను. గవర్నరు మన ఆంధ్రరాష్ట్రానికివచ్చి మూడేళ్లకన్నా ఎక్కువకాలేదు. కొత్తగా వచ్చినరోజులలో గవర్నరుగారికి ప్రత్యేకంగా కార్లు ఇవ్వడానికని, ఇంకా ఇతర ప్రత్యేకఖర్చులు కోసమని లక్షా, 50 వేలకుపైగానే ఒక lump sum grant ప్రెసిడెంటుగారు ఇచ్చారు. అవన్నీకూడ Audit account లోకూడ వెళ్ళడానికి అవకాశము లేదనుకొంటాను. ఆ లక్షా, 50 వేలు ఏరీతిగా ఖర్చుపెట్టబడిందో వివరాలులేవు. తరువాత గత రెండు, మూడు సంవత్సరములనుంచికూడ ఇది తాత్కాలిక రాజధానిఅనే అనుకొంటున్నాము. ఎందుకంటె ఎటూ విశాలాంధ్ర వస్తుందని ఆశిస్తూనే ఉన్నాము. అది ఒకవేళ రాకపోతే, శాశ్వత రాజధాని నిర్ణయించుకుందామని అనుకొన్నాము. అయినప్పటికి, ఈ రెండు, మూడు ఏళ్లు ఒక యింటిలో సుఖంగా వారినిఉంచే దానికోసం, ఉన్నది చాలదన్నట్లుగా, 12, 13 లక్షల రూపాయలు ఖర్చుపెట్టడం జరుగుతున్నది.

గవర్నరుగారికి ఆమాత్రము పటాటోపము, రాజఠీవి ఉండకపోతే, మన ఆంధ్రరాష్ట్రముయొక్క గౌరవప్రతిష్టలు తగ్గిపోతాయనా, యీ విధముగా 13, 14 లక్షలదాకా ఖర్చుచేశారు. ఇంతడబ్బు ఖర్చుచేసేటప్పుడు, అది ప్రెసిడెంటు ఆర్డరు ప్రకారము ఖర్చుచేశారాఅంటే, అదేమికనబడదు. ప్రెసిడెంటు ఆర్డరు మూడు లక్షల యాభైనాలుగువేలదాకా ఖర్చుచేయటానికి ఉన్నది. గత సంవత్సరముకూడ ప్రెసిడెంటు అనుమతిలేకుండా ముందుగా ఖర్చుచేసి, తరువాత కొత్త ఆర్డరు తెప్పించుకుని 60 వేలదాకా ఖర్చుచేసినట్లుగా తెలుస్తున్నది. ఈరీతిగా ఎప్పటికప్పుడు ఇక్కడినుంచి ప్రభుత్వము వ్రాస్తూఉండడము. అక్కడ ఢిల్లీలో

వరములుయిచ్చే దేవుడుమాదిరిగా ప్రెసిడెంటుగారు గవర్నరుకు allowances పెంచడము, వారికి కావలసినఖర్చులు అన్నింటికీ అనుమతులు యివ్వడము, యిక్కడ అంతులేకుండా ఖర్చుచేయడము జరుగుతున్నది. ఈ విధంగా అంతులేనిఖర్చు ప్రభుత్వముచేస్తున్నది. ఇక్కడ రాష్ట్రములో ఒకవైపున ప్రజలకు తిండిలేక ఎన్నో యిబ్బందులు పడుతూఉంటే, మరొకవైపున చిన్న చిన్న గుమాస్తాలయొక్క జీతాలు పెంచమంటూఉంటే, దానికి డబ్బుకావాల్సిఉంటుంది, యిప్పుడు మాకు రెవిన్యూలో లోటుఉన్నది, దాన్ని ముందు పూర్తిచేసుకుంటేగాని ఒకదమ్మిడీకూడ జీతాలుపెంచటానికి ఇవ్వము, అని గదమాయించడము జరుగుతున్నది. ఇక్కడ యింత అవసరమైన ఖర్చుఉండగా, గవర్నరుకు కావలసినపద్దు ఏదైనాఉంటే, అది యిక్కడనుంచి ఢిల్లీకివెళ్ళేలోపుగానే, టెలిగ్రాములమీద టెలిగ్రాములు యిచ్చి ఆఖర్చు మంజూరుచేయించుకోవటము జరుగుచున్నది. అయితే గవర్నరుకు గాని, గవర్నరుక్రింద అయ్యేఖర్చుగాని ఏదైనాసరేఉంటే, ఆఖర్చు ఎవరు భరిస్తున్నారు ? అది యీ ప్రభుత్వము భరించడములేదా ? ఈ విధముగా ప్రజలసొమ్ము తీసుకొనిపోయి అనవసరఖర్చులు చేయడము ఎంతన్యాయమో ఆలోచించవలసియున్నది. మనము యిక్కడికివచ్చిన యీ మూడు సంవత్సరాలలో కనీసము ఒక్క పర్యాయముఅయినా గవర్నరు కాలినడకను నడిచినట్లులేదు. ఆయన ఎక్కడికివెళ్లినా కార్లలో తప్పపోవడములేదు. పోనీ, పాడైపోయిన కార్లలోమటుకు పోతేయేమి ? పాడైనవి అయినప్పటికీకూడగవర్నరు ప్రయాణానికి చాలునని అనుకుంటాను.మంత్రులుగాని ప్రజలుగాని కార్లలో వెళ్ళగలిగినవారు ఉన్నప్పటికిని, వాళ్లకు brakes సరీగాఉండాలి, లేకపోతే ప్రజలమీద పడేఅవకాశముఉన్నది అని చెప్పుతారుగాని, గవర్నరుకు అటువంటిది యేమీలేదు. ఎందుకంటే, గవర్నరు ఎక్కడకు వెళ్లుతూన్నప్పటికినీ, ఆ దారిలో ఎవరుగూడ ఆ రోడ్డున పోకూడదు. అయినవచ్చి తిరిగి వెళ్ళిపోయినదాకా, ఎవరూ నడవకూడదు ఏ కారుగూడ పోకూడదు అని చెప్పి ఆ రోడ్లు అన్నీ ఆ సమయములో ఖాళీగానే ఉంచుతారు. రోడ్డు పొడుగూన బార్లు తీర్చి పోలీసు సిబ్బందిని గూడ పెట్టుతారు. అందుచేత ఆయన ఎక్కిన కారు ఎంత పనికిమాలినదైనప్పటికినీ పరవాలేదు, ఎవరిమీదనైనా పడుతుందేమోననే భయముకూడ అక్కరలేదు. ఆ సమయములో రోడ్లు అన్నీ ఖాళీగా ఉంటాయి. కాబట్టి, అటువంటి ప్రమాదము యేమీ ఉండదు.

THE HON. Dr. B. GOPALA REDDI :- అలాంటికారు దారిమధ్యన ఎక్కడైనా break-down అయితే, అప్పుడు ఎవరిని అంటారు ?

SRI P. SUNDARAYYA :—దారి మధ్యన break-down అయితే, అప్పుడు గవర్నరు కారుదిగి, కారును నెట్టుకోవచ్చు. అందులో తప్పేమిలేదు. లేకపోతే ఆయనకు కావలసినంతమంది సిబ్బంది వెనక ఉంటుంది. కాబట్టి, వాళ్లు అయినా దిగి కారును నెట్టవచ్చు. అంతకన్నా, ఆ సిబ్బంది ఏమి పని చేస్తుందో నాకు తెలియడములేదు. ఏమిపని కాకపోతే, యీ కార్లు నెట్టే పని అయినా యివ్వవచ్చునుగదా! ఆ పనిఅయినా యిస్తే, అది ఒక ప్రదర్శనను క్రిందనైనా ఉంటుంది. అందుచేత యిటువంటి పరిస్థితులున్నప్పుడు మరల గవర్నరుగారికి 21 వేల రూపాయలు పెట్టి, ఒక కారో, రెండు కార్లో, ఆ పద్దులో మిగిల్చినాము, యీ పద్దులో మిగిల్చినాము అని చెప్పుకొన్నారు. ఇప్పుడు ఆ పద్దును శాసనసభ ఆమోదించాలని అంటున్నారు. ఈవిధముగా గవర్నరుకు ఏది అవసరమువచ్చినా, అది అవసరమా, అనవసరమా, అనే విచక్షణ లేకుండా ఖర్చు చేయడం జరుగుతున్నది. ఆయన అడగడము, యిక్కడ ప్రభుత్వము కొనడం, యీవిధంగా చేస్తే అది ప్రజల డబ్బు దుర్వినియోగము చేయడము తప్ప మరేమికాదు రెండు సంవత్సరాలకు, ఒకసారి మూడు సంవత్సరాలకు ఒకసారి ఒక కొత్తకారు వేలకువేలు ఖర్చు చేసికొంటూ ఉంటున్నారు. ఇదిగాక ఆయన బైటఊరు వెళ్ళితే, ఆయనకు special-గా ఒక railway saloon ను గూడ ఏర్పాటుచేశారు. ఈ saloon రిపేరుచేయడమునకు అయ్యే ఖర్చులుగూడ మనమీదనే పడుతున్నది. కార్లు చూద్దామా అంటే, ఒకసారి కారుకొంటే, అది కనీసము నాలుగు అయిదు సంవత్సరాలైనా ఉపయోగించడములేదు. ఒక కారుకు 20 కార్లు వెంటపెట్టుకొని పోవడం కనబడుతున్నది. పోనీ రైలు చూద్దామంటే, మన ఆంధ్ర రాష్ట్రానికి అది గూడ కరువులో అధిక మాసము అన్నట్లుగా, మనకు యిక్కడ మీటరు గేజియే ఉన్నది. Broad guage లేదు. గవర్నరుగారికి రాజరీవికి తక్కువకాకుండా ఉండటానికి, మరొక 9 వేలు అదనముగా యీ saloon కోసము ఖర్చు చేయవలసివస్తున్నది. ఈవిధముగా ప్రతి సంవత్సరముకూడ 18 వేల రూపాయలు యీ saloon charges క్రింద ఖర్చు అవుతున్నవి. ఇదిగాక దీనికి మరమ్మతు ఖర్చులు వేరే. ఈ సంవత్సరము మరికొన్ని వేల రూపాయలు sanction చేయడము జరిగింది అంటే దాదాపు 12, 15 వేల రూపాయలదాకా ప్రెసిడెంటు దగ్గరనుంచి అనుమతి తెప్పించుకున్నామని చెబుతున్నారు. ఈడబ్బు అంతాగూడ ప్రభుత్వం ఎక్కడనుంచి ఖర్చు చేస్తున్నది ? ప్రెసిడెంటు అక్కడ ఢిల్లీలో కూర్చుని గుడ్డిగా ఆర్డర్లు వేసి పంపుతూఉంటే, యిక్కడ ఖర్చు చేయడము జరుగుతున్నదిగాని, నిజంగా యిది ఎవరి డబ్బు అనే సంగతి ప్రభుత్వము గుర్తించారంటే గుర్తించినట్లు లేదు. ఇక్కడ ప్రజలకు తిండిలేకుండా, రైతాంగానికి నీటి వసతులు లేకుండా

24th March 1956] [Sri P. Sundarayya

ఉపాధ్యాయులకు జీతాలు చాలకుండా, పరిశ్రమలో పనివాళ్ళకు పనిలేకుండా నిరుద్యోగ సమస్యదారుణముగా పెరిగిఉంటే, సామాన్య ప్రజలందరు తిండికి కమలమలమాడుతూంటే, ప్రభుత్వము తమ యిష్టము వచ్చినట్లు అంతూ పొంతూ లేకుండా ఖర్చు చెయడము వివేక వంతముకాదు. ఉపాధ్యాయులకు జీతాలు చాలడములేదు, Peons కు, చిన్న తరగతి గుమాస్తాలకు జీతాలు ఎక్కువ చేయమని అంటె, యిప్పటికి మూడు సంవత్సరములుగా, అది మాచేత కాదని ప్రభుత్వము చెబుతున్నది. ఈ చిన్న రకపు ఉద్యోగస్థులకు ఉన్న కష్టములనుగురించి శాసనసభలో సభ్యులు ప్రశ్నించినప్పుడు, వాళ్లు శాసన సభ్యులతో ఎందుకు చెప్పాలి, వాళ్ళ ఉద్యోగాలను తీసివేస్తామని ముఖ్యమంత్రి బెదరించారు. చిన్న ఉద్యోగస్థులు వాళ్లు చెప్పుకునే చోట చెప్పుకోకపోతే వినవలసినవాళ్లు వినకపోతే, యిక వారి సంగతి ఆలోచించేది ఎవరు? యీ శాసనసభముందు యీ విషయము సభ్యులు తీసికునిరావటము, తప్పా? అని అంటున్నాను. అడిగినప్పుడు వారికి సమాధానము చెప్పకపోతే, వారికి వేరే గత్యంతరము యేమిటి? ఉపాధ్యాయులకు జీతాలు పెంచమని అంటే, ప్రభుత్వంకు డబ్బులేదు అని అంటారు. అయితే గవర్నరుకు మాత్రము అంతుపొంతు లేని ఖర్చులు చేయటానికి డబ్బు ప్రభుత్వానికి ఎక్కడనుంచి వస్తున్నది? "గవర్నరుగారికి" అని అంటే, అది అడిగిఅడగకముందే, ఆయనకోసము ఎంత అడిగితే, ఆ వరప్రసాదమూర్తి ప్రెసిడెంటుగారు అడిగినవరము యిస్తూ ఉంటాడు. అదిముందు ఖర్చుచేయడము. తరువాత దానిని తెచ్చి యిక్కడ ఆమోదించమని కోరడము జరుగుతున్నది. శాసనసభయొక్క అనుమతిలేనిదే, ఒక దమ్మిడిఅయినా ప్రెసిడెంటు శాంక్షను చేయడము చాలా పొరబాటు. ఈ ఖర్చుకు అంతటికినీ మేము చెప్పిన అభ్యంతరాలు అన్నీ, దానికీ సంబంధించిన files లోనే ఉంచుతారుగాని, మేము చెప్పిన విషయాలు అన్నీ ప్రింటు అయినా చేయరు. గవర్నరుగారికోసము చేసినఖర్చుల సంగతి మేము ఎంతఘాటుగా విమర్శించినప్పటికినీ, అవి ఢిల్లీకి చేరుతాయా అంటే, అవి అక్కడికి పోవు. ప్రభుత్వము పంపరు. పోనీ పత్రికలలో వేస్తారాఅంటే, వాళ్ళమీద defamation suits వగైరాలు వస్తాయని వాళ్లు అసలే యీ విషయాలు ముట్టుకోరు, పబ్లిషు చేయరు. ఏదో ప్రభుత్వానికి అనుకూలముగా రెండు ముక్కలు వ్రాసి ఊరుకుంటారు. ప్రభుత్వముతో మొగమాటములు ఉండడంవల్ల పత్రికలవారు యిటువంటివి అసలే వ్రాయరు. ఇక్కడ సభలో గవర్నరు క్రింద చేసేఖర్చు అనవసరమని ఎంత విమర్శించినన్నూ, అందుకు మేము కంఠశోషపడడమేగాని, ఏమీ ప్రయోజనము లేకుండా ఉన్నది. ఢిల్లీదాకా వెళ్ళితే, అప్పుడు మా విమర్శలు ఎంతవరకు న్యాయమో అక్కడ ఆ వరప్రసాద మూర్తి అయినా గ్రహించుకోగలుగుతాడుగదా? అయినప్పటికి గవర్నర్ల విషయము

రేపు Sates Re-organization Bill వచ్చినప్పుడు, గవర్నర్ల పదవులు ప్రజలకు ఎంత నిరర్థకమో చూచి, గవర్నర్లను అసలు పేరులేకుండా చేయడానికి, "ఓ మహానుభావా! ఓ వరప్రసాదమూర్తి! ఓ భారతదేశాధ్యక్షుడా! ఈ గవర్నర్ల క్రింద అయ్యేఖర్చు మాకువద్దు, దీనిని మేము భరించజాలకున్నాము. ఈ పదవి ఊరకనే సంతకాలు చేసేది. ముఖ్యమంత్రి ఉండగా, యింకా యీ గవర్నరు పదవి అనవసరము, మాకు వీరు అక్కరలేదు, మీకు కావలసి ఉంటే, వీరిని మీరే పెట్టుకుని, ఆ ఖర్చు మీరే భరించండి. ఒక్క సంతకాలు చేయటానికై యింతపెద్ద ఖర్చు మామీద ఎందుకు, ఆ సంతకాలు చేసేపని మావల్ల ఎన్నుకోబడ్డ మా ముఖ్యమంత్రియే చూడగలడు. కాబట్టి యీ గవర్నరుపదవిని యీ బిల్లులోనుంచి తొలగించి, మా రాష్ట్రానికి వారిని లేకుండా చేయండి" అని కోరుతాము అయితే రాష్ట్రములో ముఖ్యమంత్రిని తొలగించి, యింకొకరిని నియమించుకునేలోగా, యీ మధ్యకాలములో ఏవైనా ప్రభుత్వములో పనులు జరపవలసిఉంటే, అప్పుడు కేంద్రప్రభుత్వము ఎవరినైనా ఒక సలహాదారుని పంపవచ్చు. వారికిఅయ్యే T A. లు వగైరాలు మాత్రము యిచ్చుకోగలముగాని, యీ గవర్నరుపదవులను మాత్రము తొలగించమని మరొకసారి చెప్పవలసివస్తున్నది. ఈ మధ్య గవర్నరు అనంతపురములో ఒకరోజో రెండురోజులో పర్యటించారు. ఆయన అక్కడ ప్రజల కష్టసుఖాలు విచారించటానికి పర్యటనకు వెళ్లారు. మంత్రులుఉండగా, గవర్నరు ప్రజల కష్టనిష్టూరాలు తెలుసుకోవలసినంతపని యేమి ఉన్నది? ప్రజలచేత ఎన్నుకున్న ప్రజాప్రతినిధులు, వారు ఎన్నుకొన్న మంత్రులు, ప్రజలతరఫున పనులు జరుపుకుంటున్నారు అలాంటప్పుడు గవర్నరు మంత్రులపైన అధికారియా? ఇదివరకు బ్రిటిషువారి హయాములో గవర్నరు రాష్ట్రమునకు నిజమైన అధికారియే. అందుకు నేను ఒప్పుకుంటాను. కాని యిప్పుడు ప్రజాప్రభుత్వము ఏర్పడ్డదిగదా! అప్పుడు గవర్నరుగారికి ప్రజలకు సంబంధము ఏమిటి? ఈ రోజులలో గవర్నరు ' అధికారి క్రిందకురారు మనకుఉన్న రాజ్యాంగచట్టము ప్రకారము మంత్రివర్గము చేసినదానికి సమ్మతిస్తూ సంతకములుచేసే అధికారము తప్ప, వారికి యింకొక అధికారములేనేలేదు. ప్రజల అవసరాలను తీర్చవలసింది మంత్రివర్గముకాని, గవర్నరుకాదు మంత్రివర్గము తీర్చకపోతే, పైన కేంద్రప్రభుత్వము ఉన్నది. అక్కడ శాసనసభ్యులు ఎన్నుకున్న పార్లమెంటు మెంబర్లు ఉన్నారు ప్రజలు అక్కడ కేంద్రప్రభుత్వానికి అప్పీలు చేసుకుంటారు మంత్రులు ప్రజల అవసరాలు తీర్చకపోతే, రేపు ఎన్నికలువచ్చినప్పుడు, వారికి పాఠము ప్రజలే చెబుతారు. అంతేకాని గవర్నరు పర్యటన చేయవలసిన అవసరము యేమివచ్చింది? కాకపోతే, గవర్నరు, తన పటాటోపాన్ని రాజరీవిని ప్రదర్శించుకుంటూ ప్రజలను

భయోత్పాతములో పెట్టటానికి అధికారము చలాయించటానికి తప్పితే, గవర్నరు ఏపర్యటన ఏ విధముగానూ ప్రజల కుపయోగించదు, అనంతపురములో ఎన్ని దినములు గవర్నరుఉన్నారో, నేను యిప్పుడు ఆ వివరాలలోనికి పోదలచలేదు.

THE HON. DR. B. GOPALA REDDI:—సుందరయ్యగారు గవర్నరు క్రింద అయ్యేఖర్చును గురించి చాలా విపులముగా మాట్లాడారు. గవర్నరు అధికారాలను గురించి, వారు tour చేయవచ్చునా, వారు tour లో ఏమిచేస్తున్నారు, అనేటటువంటి విషయాలు అంతలోతుగా యిక్కడ సభలో చర్చించడం బాగా ఉండదని నా అభిప్రాయము. వారికి కార్లకొరకు యింతఖర్చు ఎందుకు అని అన్నారు Expenditure కు సంబంధించిన విషయాలు మాట్లాడవచ్చును. కాని గవర్నరు అధికారాలనుగురించి అంతవిపులముగా మాట్లాడడము బాగాలేదని నేను అభిప్రాయపడుతున్నాను

MR. SPEAKER :—I am reading Rule No. 55(4) of the Assembly Rules.

"Rule 54, says that every speech must be strictly relevant to the matter before the Assembly.

Rule 55, says that a Member while speaking must not—

(i) ......

(ii) make a personal charge against a member ,"

(iii) use offensive expressions about the conduct or proceedings of the Parliament or any State Legislature or of the other House ,

(iv) reflect upon the conduct of the President or any Court of Justice or use the Rajpramukh's or Governor's or President's name for the purpose of influencing a debate ;

SRI P. SUNDARAYYA :—నేను గవర్నరుగారిపేరు ఎత్తిమాట్లాడలేదు. లేదా యింకొకరిపేరుపెట్టి, వ్యక్తిగతముగా వారు affect అయ్యే విషయాలను గురించి మాట్లాడలేదు. గవర్నరుయొక్క వ్యక్తిగత ప్రవర్తనను గురించిగూడ మాట్లాడలేదు. గవర్నరుచేసే కార్యక్రమాలు దానికిఅయ్యేఖర్చును గురించి మేము మాట్లాడటానికి మాకు హక్కుఉన్నది వారియొక్కవ్యక్తిగత నడవడికగురించి నేను చెప్పడముకాదు. గవర్నరువల్ల మన రాష్ట్రము ఎంతఖర్చు భరించవలసి వస్తున్నదో, అంతఖర్చు మనకు అనవసరమని చెబుతున్నాను. గవర్నరు tour చేసే

Sri P. Sundarayya] [24th March 1956

టప్పుడు, అక్కడ ఉద్యోగస్థులనందరిని కేంద్రీకరించి వారందరికీ T. A. లు వగైరాలు, అంతాగూడచేరి సుమారు 40, 50 వేల రూపాయలవరకూ ఖర్చు చేయడము జరుగుతున్నది. ఈ రకముగా గవర్నరు పర్యటనచేసినప్పుడల్లా యీ విధమైన ఖర్చు మనకు అనవసరముగా ప్రభుత్వంమీద పడుతు వేఉంటున్నది. ఈ ఖర్చు మనకువద్దు ఇది న్యాయమైనఖర్చుకాదు. అని నేను అంటున్నాను.

ఈ మధ్య పత్రికలలో మంత్రివర్గము సమావేశముఅయిందని పడింది. అయితే అప్పుడు ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు ఢిల్లీలో ఉన్నారు. డిప్యూటి ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు ఇంకో ఎక్కడో పర్యటనలో ఉన్నారు, అయితే వీరు యిద్దరు లేకుండా, గవర్నరు అధ్యక్షత క్రింద మంత్రివర్గము సమావేశము అయిందంటే, అది మంత్రివర్గము సమావేశముక్రిందకు వస్తుందా ? ముఖ్యమైనవార్లు లేకుండానే Cabinet రాష్ట్రీయముయొక్క విషయాలను చర్చించి తీర్మానము చేయగలదా ? పత్రికలలోవచ్చిన వార్త నిజముఅవునోకాదో నేను చెప్పలేను. దాని నిజానిజములు ప్రభుత్వమే చెప్పవలసియుంటుంది. కాబట్టి గవర్నరుపదవులు ప్రభుత్వానికి అనవసరము. వారిక్రింద అయ్యేఖర్చుఅంతా శుష్కదండుగ కాబట్టి, యీ ఖర్చు ఎంతతగ్గిస్తే అంతమంచిది అని అంటున్నాను. ఈ విషయము కేంద్ర ప్రభుత్వానికి ప్రభుత్వము వ్రాయవలసిఉంటుంది.

THE HON. DR. B. GOPALA REDDI :—అయితే ప్రెసిడెంట మాత్రము ఎందుకు ? ఆయనను కూడావద్దనిచెప్పరాదా ? ఒక్కగవర్నరుమాత్రమే వద్దని ఎందుకు చెప్పాలి ? అయితే గవర్నరువద్దని ఒక తీర్మానముపెట్టండి ?

SRI P. SUNDARAYYA :—గవర్నరువద్దని మేము ఎలాగూ పెట్టబోతాము? ప్రెసిడెంటు అక్కరలేదని ప్రభుత్వముపెట్టండి. మంత్రివర్గాన్ని శాసనసభ్యులమైన మేము ఎన్నుకున్నాము. కాని గవర్నరును మేము ఎన్నుకోలేదు.

THE HON. DR. B. GOPALA REDDI :—మా ఉద్దేశ్యములో గవర్నరు, ప్రెసిడెంటు యిద్దరూ ఉండాలనే. ఇక్కడ గవర్నరు ఉండాలని అక్కడ ప్రెసిడెంటుగూడ ఉండాలనే.

SRI P. SUNDARAYYA :—అది మీ ఉద్దేశ్యము అయితేకావచ్చు మా ఉద్దేశ్యముమాత్రము అదికాదు. మీరు యిద్దరూ కావాలనేఅంటారు, ఇంకవీలుఅయితే, ప్రతిజిల్లాకు, ప్రతితాలూకాకు, ప్రతిగ్రామానికిగూడా ఒక గవర్నరు ఉండాలనే అంటారు. అంతే, మీ చేతిలో అధికారము ఉన్నది గనుక, మీరు ఎంతమంది గవర్నర్లను కావాలన్నా పెట్టుకోగలరు.

THE HON. DR B. GOPALA REDDI:—లెఫ్టనెంటు గవర్నరుల్లనా

SRI P. SUNDARAYYA :—అది ఎవరిదైనా కావచ్చు. అందులో నేమము చేయగలిగినదియేమీ లేదు. కాని వాస్తవపరిస్థితులు చెప్పాలంటే ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభ్యులుగా మనము ప్రజలతరఫున యిక్కడికివచ్చిఉన్నాము. పార్లమెంటులోగూడ పార్లమెంటుసభ్యులను, యిక్కడ ప్రజాప్రతినిధులుగా ఉన్న వారమే ఎన్నుకొంటున్నాము. కాని మన India Constitution లో ఒక మంత్రివర్గము పడిపోయినప్పుడు, యింకొక మంత్రివర్గము ఏర్పడేలోగా, ప్రభుత్వము నడవటానికి కొన్ని చిక్కులు ఏర్పడవచ్చు. ఆ చిక్కులు సవరించటానికి అక్కడ కేంద్రప్రభుత్వమువారే చూచుకుంటారు. ఇక్కడ గవర్నరును మనము ఎన్నుకోము కాబట్టి, ఆ పదవి మనకు యిక్కడ రాష్ట్రములో అక్కరలేదని అంటున్నాను

[At this stage Mr. Deputy Speaker occupied the Chair.]

గవర్నరు పద్దుమీదఖర్చంతా కేవలం దండుగనే సంగతిమాత్రం ఖచ్చితంగా చెప్పవలసివస్తుంది. Administration of the Justice కు కొంతడబ్బు అడిగారు. General Administration, Civil and Criminal courts లలో కొంతమంది ఉద్యోగస్థులను వేసుకోడానికి డబ్బు అడిగారు. వచ్చిన సమస్య ఏమంటే డబ్బు ఎంతనికాదు. ఈ department లు సక్రమంగా పనిచేస్తున్నాయా అంటే, లేదని చెప్పవలసి వస్తోంది. ఒకసందర్భం చూచుకున్నప్పుడు నేటికికూడా జిల్లా జడ్జీలను executive department నుంచి వేరుచేయని జిల్లాలు ఇంకా రెండు, మూడున్నాయి. వేరుచేస్తే ప్రజలకు వచ్చినలాభం ఏమిటని ప్రభుత్వం అనవచ్చును. కొంతమందికి ఉద్యోగాలువచ్చి డబ్బు అనవసరంగా ఖర్చవడం తప్పితే వేరేలాభంలేదు. అందుచేత నిదానంగా చేస్తాం, తొందరపడవలసిన అవసరమే లేదని చెప్పారు. దానికి సమాధానం చెప్పడం చాలా కష్టం. ఎందుకంటే మాకున్న అనుభవాన్నిబట్టి ఈ judiciary ని executive నుంచి వేరుచేసినంతమాత్రాన న్యాయపరిపాలన మరింత—స్వతంత్రంగా జరుగుతుందని మేము ఏమాత్రం అనుకోవడం లేదు. ఈ సందర్భంలో ఒకటిరెండు పర్యాయాలు ఈ శాసనసభలోనే పరోక్షంగా గోపాలరెడ్డిగారికి తెలియజేశాను. ఐనప్పటికీ నేటికి కూడా నెల్లూరుజిల్లాలో గోపాలరెడ్డిగారి పేరు ఉపయోగించుకొని—గోపాలరెడ్డి గారికి దానిలో సంబంధం ఉన్నదని నేననడం లేదు—వారి బంధువర్గం ఉద్యోగస్థులమీద ఒత్తిడితీసుకువస్తున్నారు. ఆ ఉద్యోగస్థులు ఒత్తిడికి లొంగిపోతున్నారు.

THE HON. DR. B. GOPALA REDDI :—అందులో మా బంధువర్గంకూడా కొంతమంది ఉన్నారేమో ?

SRI P. SUNDARAYYA :—నాబంధువర్గం ఉంటే చెప్పండి.

THE HON. DR. B. GOPALA REDDI :—మావాళ్లు ఎవరో చెప్పండి.

SRI P. SUNDARAYYA :—వారి తమ్ముడు రామిరెడ్డిగారు.

THE HON. DR. B. GOPALA REDDI :—వారితమ్ముడుగారు ఇంతవరకూ కలెక్టరుదగ్గరకుగాని, D. S. P. దగ్గరకుగాని ఎప్పుడూ పోనేలేదా ? మీ బంధువర్గంకూడా కొంతమంది పోయినారు.

SRI P. SUNDARAYYA :—వారి బంధువులు వెళ్ళారో లేకుంటే కబుర్లుచేశారో, నేను రెండుమూడు ఉదాహరణలు మీకు చెబుతాను.

THE HON. DR B GOPALA REDDI :—బహుశః ఎప్పుడైనా మా కుప్పలు తగలబెట్టినప్పుడు మా తమ్ముడుగారు ఆ విషయమై ఏదైనా పోయినారేమో గాని, తరువాత ఇంకెందుకూ పోలేదు. కొంపలో, వరికుప్పలో సంరక్షణ చేసుకోవడంకోసం పోయూరేమోగాని, ఇంక దేనికోసంకాదు.

SRI P. SUNDARAYYA :—కుప్పలు తగలబెడితే వెళ్లవచ్చును.

THE HON. DR. B. GOPALA REDDI :—కుప్పలు తగలబెట్టింది నిజంకాదా ?

SRI P. SUNDARAYYA :—కుప్పలు తగలబెట్టుకుని, కేసులుపెట్టుకున్నారో, లేకుంటే ఏమి చేసుకున్నారో ఎవరికి తెలుసు ? కుప్పలు తగలబెట్టిన వారిమీద కేసులు పెట్టుకోండి, శిక్షలు వేసుకోండి అది ఎవరూ కాదనరు. లేక కుప్పలు తగలపెట్టుకుని ఇతరులమీద కేసులుపెట్టాలన్నాకూడా మీరు అంతసమర్థత శక్తిసంపదలు కల్గినటువంటివారే. ఆరకంగా చేసినాకూడా ఏమీ అభ్యంతరంలేదు. అదికాదు సమస్య. ఒక Deputy Collector దగ్గరికి ఆ ఊరిలో పెద్దభూస్వామివెళ్లి "ఈ తెలివితక్కువ orderను నిన్ను ఎవరు వెయ్యమన్నారని" అంటే ఆయన వెంటనే లేచివెళ్ళి record లోనుంచి ఆ order ను తీసివేసిన ఘటన ఒకటి. ఇంకో ఘటనను. District Judge గారు సాక్ష్యం అంతా విని, తరువాత judgment వ్రాయడానికి తన private room లోకివెళ్ళి Public Prosecutor ను పిలిచి ఏమిటీకేసు, ఈ విధంగా జరుగుతోందేమి అంటే Prosecutor ఒకరకంగా సమాధానం చెప్పిన తరువాత, ఆ Judge గారు తన అభిప్రాయం మార్చుకుని ఇంకోరకంగా judgment ఇవ్వడం జరిగింది. ఇదికూడా Nellore లో బహిరంగంగా మాట్లాడుకుంటూ ఉన్నవిషయం. మేము ఉద్యోగంలో ఉన్నప్పుడు వీళ్ళందరికి ఇదే రకంగా శిక్షలు వేయవలసిందే, అని ఒక District Magistrate

బహిరంగంగా వీధుల్లో కనబడినవారికల్లా చెప్పేస్థితిలో ఉంటున్నాడు. వీటన్నిటికీ ముఖ్యమంత్రిపేరు ఉపయోగించుకుని చేస్తూఉన్నారు. నా కేమి సంబంధంలేదని ముఖ్యమంత్రిగారు అనుకుంటే అనుకోవచ్చునుగాని ప్రజలుమాత్రం ఎవరూ అనుకోవడంలేదు. పరిపాలన ఇట్లనే సాగడం మంచిదని వారనుకుంటే సాగించండి. మేము ఈరోజు చెయ్యగల్గిం దేమీలేదు. మీరు వారికి చెప్పారా లేదా అనేవిషయం కాదు. మీపేరు ఉపయోగించుకుని ఈరకంగా వాళ్లు చేస్తూఉన్నప్పుడు మీరు దాన్నిగురించి విచారించి "ఇదుగో నాపేరు ఉపయోగించి ఏమిచేసినాకూడా నేను తీవ్రమైన చర్య తీసుకుంటాను, వీటితో నాకేమీ సంబంధంలేదని, నీవు నిష్పక్షపాతంగా చెయ్యవలసియుంటుందని" ఆ ఉద్యోగస్థుడికి మీరు ప్రత్యేకంగా హెచ్చరికచేయకపోయినట్లయితే పరిపాలనాయంత్రం అనేది ఇప్పటికన్న మరింత బీభత్సస్థితిలోకి పోతుంది. న్యాయానికి తావుండదని మీ దృష్టికి తీసుకువస్తున్నాను.

THE HON. SRI A B. NAGESWARA RAO:—ఒక మనవి. మంత్రుల పేర్లు ఉపయోగిస్తున్నారు అని అనేటప్పుడు, ఫలానావాళ్లు అని గౌరవసభ్యులు మా notice కు తీసుకువస్తే దానిమీద ఏదైనాచేస్తాం.

THE HON. DR. B. GOPALA REDDI:—నాకు తెలిసినంతవరకూ ఉద్యోగస్థుల దగ్గరకు communist లు పోయినన్నిసార్లు, కాంగ్రెస్‌వారు పోవడంలేదు. ఏదో నెపంపెట్టుకుని ఏ Sub Inspector దగ్గరకో ఏ Deputy Collector దగ్గరకో communist లు ఎన్నిమార్లు పోతున్నారో, అన్నిమార్లు Congress వాళ్లు పోవడంలేదని నేను ఘంటాపథంగా చెప్పగలను. పేరు పెట్టుకుని వాళ్ళంతాకూడా ప్రతిదినం Deputy Collector దగ్గరకూ, Collector దగ్గరకూ పోతున్నారు. కమ్యూనిస్టు పార్టీ పేరుకూడా ఉపయోగించుకుని.

SRI P SUNDARAYYA:—అధ్యక్షా, నాపేరు పెట్టుకోవచ్చు, నా పార్టీపేరు పెట్టుకోవచ్చు. ఎందుకంటే అధికారంలో లేని పార్టీ మా పార్టీ.

THE HON. DR. B. GOPALA REDDI:—గలభా చెయ్యడానికి చాలుగా.

SRI P. SUNDARAYYA:—గలభా చేస్తే పోలీసులున్నారుగా. Arrest చేసి jail లో పెట్టేందుకు, వారికి కావలసిన శక్తి ఉంది. అందుకు వారు ఏమాత్రం వెనుదీయరనే సంగతి చరిత్రంతా ఋజువుచేస్తోంది. దాన్నిగురించి రోషాలు, ఆవేశాలు తెచ్చుకోవలసిన విషయంకాదు. అధికారంలోవున్న పార్టీవాళ్లు

ఉద్యోగస్థులదగ్గరకువెళ్ళి అధికారాన్ని, ప్రాబల్యాన్ని ఉపయోగించి న్యాయంగా చెయ్యవలసినపనులు చెయ్యకుండా చేసినందుకు వాళ్ళకు సాధ్యమవుతుంది కాని ప్రతిపక్షంలో ఉన్నటువంటి మేము అధికారులదగ్గరకు వెళ్ళి "ప్రజలకు ఈరకంగా జరుగుతోంది అని విన్నపంచేసుకోవడంకోసం వెళ్లడంలో ఏమీ అపచారం లేదు. ప్రజలకు కష్టాలువస్తున్నప్పుడు అక్కడ స్థానికంగా ఉన్న ఉద్యోగస్థుల దగ్గరకువెళ్ళి చెప్పుకోవడం జరుగుతుంది.

THE HON. DR. B. GOPALA REDDI :—మావాళ్లు పోకూడదా ? కష్టాలు వచ్చినప్పుడు కుప్పలు తగలబెడుతోంటే మావాళ్లు Deputy Collector దగ్గరకు, Superintendent దగ్గరకు పోకూడదా ? మీవాళ్ళేనా వెళ్లవలసింది ?

SRI P. SUNDARAYYA:—మీరూ వెళ్లవచ్చును. నాకేమీ అభ్యంతరం లేదు. కాని మీరు వెళ్లినప్పుడు మాత్రం మీది అధికారంలో ఉన్న పార్టీ కాబట్టి మీపేరు పెట్టుకుని వెళ్లి officerలను బెదిరించకూడదని నా ఉద్దేశం మీరు అధికారంలో లేకుండా మీరూ opposition లో యుంటే 50 పర్యాయాలు మీరు వెళ్లినప్పటికీ, అది చర్చకు వచ్చే సమస్య కానేకాదు. మీరు అధికారంలో ఉన్నప్పుడు, మీపేరు ఉపయోగించుకుని, మా బంధువులు ముఖ్యమంత్రులుగా ఉన్నారు కాబట్టి ఈరకంగా చెయ్యాలని అడుగుతూయున్నప్పుడు, దానిప్రకారం ఉద్యోగస్థులు చేస్తూఉన్నప్పుడు, అదుపులో పెట్టవలసిన బాధ్యత మీమీద ఉన్నదని చెప్పానుగాని, మీరూ మావలెనే opposition లో యుండి మేము అధికారంలో ఉన్నప్పుడు, మీరు వెళ్లినట్లయితే ఎందుకు వెళ్ళారని అడగడం నాది బుద్ధి తక్కువవుతుంది. ఆవిధంగా నేనడిగే ఉండను. అందుచేత అధికారంలోవున్న పార్టీ చెయ్యవలసిన రీతి వేరు ప్రతిపక్షంలో ఉన్నపార్టీ ఇంకోరకంగా చెయ్యవలసిన సంగతి మీరు గుర్తించకపోతే మీరూ ఒకటే, మేమూ ఒకటే అని మాటలుమాత్రం చెప్పవచ్చునుగాని ప్రజలకు కలిగే నష్టాలుమాత్రం చాలా ఉంటాయనే సంగతి మాత్రమే నేను చెప్పదలచు కున్నాను. దురదృష్టవశాత్తూ ఇంకోసంగతికూడా చెప్పాలి. ఎన్నికల Tribunal లో Judge లను వేస్తున్నారు. ఈ పద్ధతి సరియైన పద్ధతికాదు ఎందుకంటే స్థానిక పలుకుబడులనుబట్టి ఈ Judge లు ఎన్నికల tribunal గా ఉండడము నిష్పక్షపాతంగా ఉండడానికి వీలుండదు.

THE HON. DR. GOPALAREDDI :—I think I have to protest against these aspersions on the Election Tribunal వారు judges గా ఉన్నారు. మొదటినుంచీ High Court ల క్రింద ఉన్నారు Executive Government కి ఏలాటి సంబంధంలేదు. Appointment o

Judges లో ఈ Provincial Government కు ఏలాంటి సంబంధంలేదు. Election Commission వారూ, Government of India వారూ చేస్తున్నారు. Election Tribunals మీద మనం ఏమాత్రం నిందారోపణచెయ్యడం న్యాయం కాదేమో అనుకుంటాను వాళ్ళమీద political influences ఉన్నాయంటే, న్యాయంకాదు. కొన్ని వేలకూపాయిలకు సంబంధించిన properties విషయం decide చేస్తున్నటువంటి District Judges, Election Tribunalsలో ఉండ కూడదని వారిమీద నిందారోపణచెయ్యడం న్యాయంకాదు.

SRI P. SUNDARAYYA —మన జడ్జిగారిని అక్కడ వేశారు కాబట్టే ఎన్నికల tribunal సంగతి నేను తేవలసివచ్చింది.

Mr. DEPUTY SPEAKER —Judges నిష్పక్షపాతంగానే చేస్తారని అనుకుంటాను.

SRI P. SUNDARAYYA .—కాని ప్రజలెవరూ కూడా ఆ రకంగా అనుకోవడంలేదనే సంగతి మాత్రం చెప్పాను.

THE HON. Dr. B. GOPALA REDDI :—ప్రజలనుకోవడంలేదంటే, ప్రజలు చాలా అనుకోవడంలేదు. చాలా అనుకుంటున్నారు. కాబట్టి వాళ్ళను కున్న వన్నీ మనం చేస్తూంటామా ? ఈ Judge లు సక్రమంగా చేయడంలేదని ప్రజలనుకుంటే మనం ఏమిచేయగలం ?

SRI P. SUNDARAYYA —ఆలోచించవలసి యుంటుంది.

THE HON. Dr. B. GOPALA REDDI :—ఏమీ ఆలోచించ నక్కర్లేదు.

SRI P. SUNDARAYYA:—ప్రజలంటే 'మీప్రజలూ అనుకుంటున్నారు, మా ప్రజలూ అనుకుంటున్నారు.' మా ప్రజలు 100 కి 10 మందే ఉండవచ్చు. 20 మందే ఉండవచ్చు. ఏ కేసులు అయితే నిష్పక్షపాతంగా విచారించాలని వాళ్ళ ముందుకు వెడుతాయో ఆ పక్షాలలో ఇతను నిష్పక్షపాతికాడు అనే సంగతి వాళ్లు అనుకుంటున్నారు. మీరు ఏమనుకున్నా సరే మా ఇష్టంవచ్చిన వారిని మేము వేసు కుంటాం అంటే దానికేమీ అభ్యంతరంలేదు.

Mr. DEPUTY SPEAKER .—తమపక్షం తీర్పు రాకపోతే అతడు నిష్పక్షపాతికాడని అనుకుంటూ ఉంటారు.

SRI P. SUNDARAYYA:—Election Tribunals ఉన్న ఆ జడ్జీల కూతుళ్లను ఎన్నికలకు నిలబెట్టడం న్యాయంఅని మీరు అనుకోవచ్చును. కొన్ని నిజమైన విషయాలు ఖచ్చితంగాచెబితే మీకూ మాకూ ఆవేశాలు వస్తుంటాయి. అది తప్పనిసరి.

THE HON. Dr. B. GOPALA REDDI:—High Court Judges కొడుకులు మీ పార్టీలో లేరా? High Court Judges కొడుకులు పార్టీలో ఉండకూడదా?

SRI P. SUNDARAYYA:—High Court Judges కొడుకులు మా పార్టీలో ఉన్నారోలేదో తెలియదు. Lists చూడాలి. ఉద్యోగస్థులు కొడుకులు మా పార్టీలోఉన్నారు. అటువంటి ఉద్యోగస్థుల పరిస్థితి గడగడ లాడుతూ నేఉంటుంది. బళ్లారిజైలులోఉన్న మన ఖైదీలకు 7 లక్షల 20 వేల రూపాయిలకుపైగా ఖర్చుఅవుతోంది. ఇది చాలా ఎక్కువఖర్చు. మనిషికి దాదాపు రు 720 లు ఖర్చుచేస్తున్నాం అన్నమాట. భత్యం తీసుకుంటే నెలకు రు 30 లు కన్న ఎక్కువఉండదు. ఈ రకంగా జైళ్లలోపెట్టి అనవసరంగా ఖర్చుచేసుకునే బదులు open jails అనంతపురంలో పెట్టాలి అనుకున్నారు. ఆరకంగాచేస్తే డబ్బుమిగుల్చుకోవచ్చును. లక్షలుఖర్చుచేసి ఇతర రాష్ట్రాలలోని Jails కు పంపడం సరిఅయిన విధానంకాదని చెప్పవలసివస్తున్నది. Police గురించి వచ్చినపుడు 20 లక్షలరూపాయలు అధికంగా ఖర్చుచేస్తున్నారు. ఈ ఖర్చు అంతా Special police ఖర్చునుపెంచడానికి ఉపయోగిస్తున్నారు. పోలీసు బడ్జెటుమీద చర్చిస్తూ ఆంధ్రరాష్ట్రంఅంతా శాంతంగా ఉన్నదని ఒకప్రక్క చెబుతూనే, పోలీసు బలగాన్ని పెంచడానికి ఖర్చుచేస్తున్నారు. ఈ ఖర్చు పోలీసులు, చిన్నఉద్యోగస్థుల జీతాలను పెంచడానికిగాని వాళ్ళకు ఇండ్లు కట్టడానికి గాని కాదు. బలగాన్ని పెంచడానికే 20 లక్షలరూపాయిలు ఖర్చుచేస్తున్నారంటే ప్రభుత్వం ఏదారిన నడుస్తున్నదో స్పష్టంగా తెలుస్తోంది. British ఉద్యోగస్థులకు ఇవ్వవలసిన commuted pensions క్రింద 5 లక్షల 78 వేలురూపాయిలు ఖర్చు చేస్తున్నారు. డబ్బులేనప్పుడు, అప్పు పుట్టడమే కష్టంగా ఉన్నపుడు commuted pensions క్రింద మనం ఎందుకు కట్టుకోవాలి? సంవత్సరం సంవత్సరం ఇంత చొప్పున కట్టవలసిన sterling ను British ఉద్యోగస్థులకు ఎందుకు కట్టాలి? ఇండియాప్రభుత్వం మనం మద్రాసు రాష్ట్రంలోఉండగా ఇవ్వవలసినదని చెప్ప వచ్చును. ఇదివరకు కట్టవలసిన pension సంవత్సరం సంవత్సరం కట్టడం న్యాయం కాని ఒకేసారి 5 లక్షలు 78 వేలరూపాయిలు చెల్లించడం డబ్బును దుర్వినియోగం

చేయడంతప్ప మరొకటికాదు. స్కీములకోసం కోటిరూపాయిలు అదనంగా token grants అడిగారు. 21 Schemes చెప్పారు. వీటి ఖరీదు దాదాపు కోటిరూపాయలు అవుతుంది. ఆరంభించిన స్కీములు పూర్తికావడంలేదు. కేంద్రప్రభుత్వం డబ్బు ఇవ్వమని చెబుతున్నారు. ఆరంభించిన స్కీములే పూర్తికానప్పుడు, తిరిగి కోటిరూపాయలు ఖర్చుకాగల 21 స్కీములను తయారుచేయడం ప్రజలకళ్లు తుడవడానికి చేస్తున్నారా ? ఉన్నస్కీములు పూర్తిచేయడానికి డబ్బులేదు అంటున్నారు. కొత్తవి 21 scheme లు sanction చేశాము అంటున్నారు. దీని విలువ ఏమిటో నాకు అర్థంకావడంలేదు. వీటినన్నింటినిచూస్తే ప్రజలసమస్యలు పరిష్కారం విషయం వచ్చేటప్పటికి ప్రభుత్వానికి డబ్బు చిక్కువస్తుంది. ఈ రకంగా ఖర్చులుచేయడానికి మాత్రం వీలుఉంటుంది. మొత్తం బడ్జెటుచూసినా Supplementary budget చూసినా క్రొత్త schemes ను sanction చేస్తూనే ఉంటాము ; పాతవాటినిమాత్రం అమలుచేయము అనేధోరణి కనిపిస్తోంది. ఒక విధానం లేకుండా ఈ Supplementary budget ఉన్నది. దానిని గురించి జాగ్రత్త వహించాలని కోరుచున్నాను.

Sri A BHAGAVANTARAO :-ఉపాధ్యక్షా, బడ్జెటు పరిశీలనలో కాని సప్లిమెంటు బడ్జెటు పరిశీలనలో కాని ముఖ్యంగా తేలేది గవర్నమెంటువారి ఆలోచనలో ఒక ఆదుర్దా, ఆవేశము, ఈ పనులు చేయవలసనేటటువంటిది కనిపిస్తోంది. కాని అవి చేయడంలో, ప్రజానీకానికి అందుబాటులో ఉండేటు చేయడంలో ఒక విధమయిన జాప్యం కనబడుతోంది అందుచేత అనుకున్న policies జరగే కార్యక్రమంలో కొంత తేడా, నిరుత్సాహం, నిస్పృహ (పజలలోను, ప్రజాప్రతినిధులలోను కనపడడం చూస్తూనే ఉన్నాము దీనికి గవర్నమెంటు policies పంచవర్ష ప్రణాళికలో పొందుపరచిన విధంగా అమలు జరపడానికి ఒక సక్రమమైన పంథాను నిర్ణయించిననాడే మన policies సక్రమముగా జరుగుతాయి అని చెప్పడానికి బలం చేకూరుతుందని నా అభిప్రాయం లేనినాడు administrative set up తీసుకుంటే democracy అని చెప్పడానికి వీలులేని పాత institutions సక్రమంగా నడపాలంటే నడపడానికి అవకాశంలేకుండా పోతున్నది బ్రిటిషు ప్రభుత్వకాలంలో సవరింపబడిన కొన్ని G.Os, ఇప్పుడు అమలులో ఉండడం antiquated గా, పురాణకాలసిద్ధాంతాలుగా పరిణమించినాయి. Boards Standing Orders, Police Standing Orders వీటన్నింటిని ప్రజాస్వామ్యానికి సక్రమంగా ఉండేపద్ధతులలో సవరించిననాడే మనం అనుకున్న సిద్ధాంతాలను అమలు చేయడానికి వీలుఉంటుంది. Development schemes ను అధికంగా అమలు చేసేస్థితిలో పురాణకాలంనుంచి ఉంటున్న కలెక్టరుగారి ఆధ్వర్యాన అన్నీనడి

Sri A. Bhagavantha Rao] [24th March 1956

పించడం పాతకాలపు పురాణపు పాటగాఉన్నది కలెక్టరు చేయవలసిన కార్యక్రమాలు సక్రమంగా నిర్వర్తించలేకపోతున్నారు ప్రస్తుతం District Boardsకు functions లేవుకాబట్టి రోజు రోజుకు మనమే తీసుకుంటున్నాము. కాబట్టి, development schemes District Boards కు అప్పగించి ఏ I. C. S. Secretary ద్వారానో అమలు చేయడానికి ప్రయత్నిస్తే దానికి పూర్తి అయిన సదుపాయముకలిగి ప్రజలకు అందుబాటు కలుగుతుందని అనుకోవచ్చును. గ్రామాలలో కార్యక్రమాలు సక్రమంగా జరగాలంటే administrative unit గా village ని తీసుకొని సక్రమమైన మార్గంలో తీసుకునచ్చే విషయంలో కొంత అభిప్రాయ భేదాలు కలుగడానికి అవకాశాలు ఉన్నాయి. Hereditary institutions గా ఉన్న గ్రామకరణాన్ని, Village Munsif లను abolish చేసి, సరిఅయిన పద్ధతిలో ఏర్పాటుచేస్తేనేకాని మనం అనుకున్న సిద్ధాంతాలను అమలు చేయుడానికి అవకాశంలేదని నా అభిప్రాయం. Excise policy కి సంబంధించిన వివరాలలోనికిపోతే గవర్నమెంటు ఏ అంశముమీద పడిపోయిందని అనుకున్నామో, ఆ అంశాన్ని మరుగుపరచడం జరుగుతోంది. గోపాలరెడ్డిగారు నాయకుడుగా ఎన్నిక అయిన రోజున ex-tappers విషయంలో మేము ఎదో సరిఅయిన policy తీసుకుంటామని statement ఇస్తే మేమందరము లోలోపల సంతోషించాము ఈనాడు ex-tappers సమస్య మూలకు త్రోసినారని చెప్పడానికి నాకు ఏమీభయంలేదు. ఎంత ఉత్సాహంగా ప్రధానమంత్రిగారు మొదట statement ఇచ్చారో అంత నిరుత్సాహంగా దానిమీద పని జరుగుతోందని చెప్పడానికి నాకు సందేహంలేదు. ఈనాడు వారి సమస్యను ఎంతవరకు పరిష్కారంచేశాము ; ఏఏ మార్గాలు అవలంబిస్తున్నాము అంటే ఈ సమస్యలను ఎంతవరకు తీసుకుపోతున్నారనేదికూడా అర్థంకాని గూఢమైన పరిస్థితిలో ఉంచారనడానికి సందేహంలేదు. ఈ సమస్యను గవర్నమెంటు level లో పరిష్కారంచేయుడానికి ద్రవ్యం, స్తోమతులేకపోతే పరిష్కారం చేయడానికి ఒక కమిటీని ఏర్పాటుచేసి సలహాలు తీసుకుంటే వాటిద్వారా ఈ సమస్యపై ఏమిచేస్తున్నారో ప్రజలతోచెప్పి సహకారం పొందడానికి పాటుపడటం అయితే త్రోసిపుచ్చారు. వీరికి జీవనోపాధి కల్పించడానికి 15 నీరా societies పెడతాం అన్నారు తరువాత జరిగిన సంఘటనలు, పోరాటం, ఏ విధంగాను ఆచరణలోనికి రాకపోవడం, applications పెట్టి 7 నెలలు అయినా licences రాకపోవడం ఇవన్నీ జరిగాయి. ఏ ఉద్దేశంతో ఇవి పెట్టాలని అనుకున్నారో, ఆ ఉద్దేశమే నెరవేరకుండాపోయింది, నీరా societies పెడుతుంటే

law అక్రమంగా పాడైపోతుంది అని కొందరు అంటున్నారు. ఈ విషయంలో మంత్రివర్గం నిర్దుష్టమైన మార్గం ఆలోచించాలని కోరుతున్నాను.

దీన్ని గురించి మీరు ఆలాంటిది చేయలేకపోతే మేము చేస్తామని సరియైన practical steps ఇస్తామని, మేము అంతా సహకారము చేస్తామని చెప్పుతున్న వారిని ఏ కమిటీలో కూడా ఎన్నుకోకపోవడం అనేది నాకునచ్చినటువంటి విషయముగా కనబడడంలేదు. ఇప్పుడు గీత పనివారల సమస్యను వెనుకకు తోసివేయడంలోను, Prohibition Act ను అమలులో పెట్టడంలోను చాలా అన్యాయాలు జరుగుతున్నాయి అని చెప్పడానికి లాయరుగా నాకు చాలా అంశాలు ఉన్నాయి. కొన్ని సిద్ధాంతాలు నాకుకూడా తెలుసు. వాటిని ఏకరువు పెట్టుకోవడానికి ఇక్కడికి రాలేదు. అవి ఏకరువు పెట్టుకొన్నందువల్ల వచ్చేలాభాలుకూడా లేవు. Prohibition ను తీసేయటమా, వద్దా అన్నది సమస్యకాదు. Ex-tappers విషయంలో వారికి employment create చేస్తామని చెప్పినదానికి ఏమి చేసినారు ? నేను ఒకప్రశ్న వేస్తున్నాను. దీనికి sample survey అని ఒక శాఖను ప్రభుత్వం పెట్టి ఉన్నారు. ఈ sample survey శాఖఅంతా bogus అంటే మొన్న మంత్రిగారు సమాధానము చెప్పుతూ "అది bogus కాదు మేము తిరిగి examine చేయబోతున్నాము" అన్నారు. నేను ఇదే challenge చేసి చెప్పుతున్నాను. మాలో ఎవరినైనా నలుగుర్నో ఐదుగుర్నో ex-tappers కు సంబధించినవారిని, ఒక కమిటీగా వేయండి. Government ప్రతినిధులవల్ల జరిగినటువంటి survey తప్పు అని మేము ధైర్యంగా నిరూపించగలము. దానికి తగినటువంటి సమాచారం మాదగ్గర ఉన్నది అంతేగాని ఏ Statistical Department లోనో మరి ఎవరినో కొంతమందిని తీసుకొని 'వారు తిరిగి విచారిస్తారు, చేస్తారు' అంటే ఈ సమస్యను మూలకు తోసినట్లే ! అందులో ఏమీ సంకోచములేదు. దానివలన ఈ సమస్యా పరిష్కారానికి తగినటువంటి మార్గము దొరకదు. ఇది తప్పు అని నిరూపించగలశక్తి ఉన్నదని చూపించడానికే Government మాకు అవకాశము కలిపిస్తారని నేను విశ్వశించుతున్నాను. నేను Government పరిపాలనాలో ఏమిచేయదలచుకొన్నప్పటికీ ప్రస్తుతము ఉన్నటువంటి administrative set up లో కొంత మార్పును తీసుకురావటానికి ఏ మాత్రము ప్రయత్నము చేయకపోతే మన పాలసీలు ఎంత బ్రహ్మాండంగా ఉన్నవని చెప్పకొన్నప్పటికినీ అవి ప్రజానీకానికి అందుబాటులో ఉండటానికి తావులేకుండా పోతుందని చెప్పడానికి నాకు సంకోచములేదు. ఇంతవరకూ నాకు అవకాశమిచ్చినందుకు ఉపాధ్యక్షులకు వందనములు.

SRI N. C. SESHADRI :—ఉపాధ్యక్షా ! సుమారు 8 కోట్ల చిల్లర రూపాయలు, పోయిన సంవత్సరము Budget allotment కాక, ఇంకా ఎక్కువ

Sri N. C. Seshadri] [24th March 1956

ఖర్చు పెట్టినందుకు గాను ఈ సప్లిమెంటరీ డిమాండ్లను approve చేయవలసిందిగా ముఖ్య మంత్రిగారు మన ముందు ఉంచినారు. పోయిన సంవత్సరము ఐదు కోట్ల చిల్లర deficit budget లో ఉంది. ఎనిమిది కోట్ల చిల్లరలో రెండు కోట్లదాకా revenue account లో మనము ఖర్చు పెట్టుతున్నాము. ఈ డబ్బుఅంతా ఏ విధంగావచ్చింది అనేది clear గా details మాకు తెలియకుండగా మళ్ళీ ఖర్చుపెట్టడమనేది మాకేమి అర్థముకానట్టి వ్యవహారము. తర్వాత District Administration లో Treasury branch ని separate చేయడంవల్ల 1,32 లక్షలు ఖర్చు అవుతుందని దానికిగాను token grant ఏదో కొంత చేసినారు. అది April నుంచీ అమలు లోనికి రాబోతుంది అనికూడా తెలుస్తున్నది. ప్రతి జిల్లాలోకూడా ఉత్తర ప్రత్యుత్తరాల్లో ఏలాంటి జాగు లేకుండాను, కావలసినటువంటి information రావడానికి వీలుకలిగించేందుకు, reception Officers ను వేయమని అనేకమంది శాసన సభ్యులు కోరినారు. ఐనప్పటికి 20 వేలో 25 వేలో రూపాయలు ఖర్చు అయ్యేటటువంటి ఈ service విషయంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవడంలేదు. పెద్ద పెద్ద new service లను ఎన్నో start చేస్తూ చిన్న చిన్న విషయాల్లో మాత్రము ప్రభుత్వము ఏమీ శ్రద్ధ తీసుకోనందుకు చాల విచారిస్తున్నాను. రెండవది ఈ Medical Demand క్రింద Director of Indigeneous Medicine కు 14,100 రూపాయలను మనము Madras State లో ఇస్తూవచ్చినాము. Indigenous Medicine కు మన రాష్ట్రములో తగినంత ప్రాధాన్యమును ఇస్తూ మన రాష్ట్రములోనే ఒక separate post ను ఎందుకు create చేయకూడదు అని ఈ సందర్భములో వారిని నేను ప్రశ్నించుచున్నాను. అంతే కాకుండా చాలా రోజులుగా గుడివాడలో ఉన్నటువంటి Homeopathy Medical College విషయంలో వాళ్లు ప్రభుత్వాన్ని ఆర్థిక సహాయానికై అభ్యర్థన చేస్తున్నారు. వాళ్లకు ప్రభుత్వం 5 వేల రూపాయలు మాత్రమే ఇచ్చినారు. Medical Demand వచ్చినపుడు మంత్రిగారు కేంద్రానికి ఈ విషయమై సిఫార్సుచేసినాము అని చెప్పినారు. అయినప్పటికీ ఈ 5 వేల రూపాయల గ్రాంటు ఏమాత్రము చాలదు. ఇంకా ఎక్కువ గ్రాంటు homeopathy వైద్య విధానానికి ఇచ్చి encourage చేయవలసినట్టి అవశ్యకత ఈ ప్రభుత్వానికి ఉందని నేను సూచించుచున్నాను. నీరా స్కీమును గురించి భగవంత రావుగారు ఎక్కువగా మాట్లాడినారు. దీనికిగాను 5,300 రూపాయలు నీరాభవన్ బారువాలో ఏర్పాటు చేయడానికి కోసంగాను non-recurring subsidy క్రింద 32 వేల చిల్లర recurring subsidies ఇవన్నీకూడా ఈ పద్దులో చూపించినారు. అయితే నా వ్యక్తిగత అభిప్రాయాన్ని మాత్రమే నేను చెప్పుతున్నాను. ఈ ex-tappers కు employment provide చేసేటటువంటి విషయంలో ex-tappers కాకుండా

వృత్తులను పోగొట్టుకొన్నటువంటి పనివారు అనేకమంది ఉన్నారు. అటువంటి సందర్భములలో కేవలము ex-tappers నే గుర్తించి ఇతరులవిషయంలో ఏమీ యోచించకుండా ఉన్నారు. Tractor cultivation, Mechanized cultivation రావడంవల్ల agricultural labour కొంతవరకు suffer అయింది. వాళ్లకు ఈ ప్రభుత్వము ఏమి సహాయంచేస్తుందంటే అందుగురించి దీనిలో ఏమి కనిపించడం లేదు. అసలు ex-tappers skilled workers కాదా అనే సమస్య ఉంది. Skilled workers ఐతే వాళ్లకు జీవనభృతి లేకుండా పోయినట్లయితే వాళ్లకు employment provide చేయవలసినట్టి ఆవశ్యకత ఈ ప్రభుత్వముపై ఉన్నదిగానీ skilled worker గానప్పుడు ఈ ex-tappers కు మాత్రం ఏదో ఒక జీవనోపాధిని కల్పిస్తూ ఇతర రంగాలలో ఈ advanced civilization వల్లనో social legislation వల్లనో తమవృత్తులను పోగొట్టుకొన్నటువంటివాళ్ల విషయంలో ఏమాత్రము యోచనచేయకుండా ఈ ప్రభుత్వం ఉండటం చాల విచారకరమని నేను భావించుతున్నాను.

Irrigation కు వచ్చినట్లయితే "భైరవానితిప్ప" ప్రాజెక్టును సుమారు ఒకటిన్నర సంవత్సరముల కాలముగ construct చేస్తున్నారు. ఈ ప్రాజెక్టుక్రింద మునిగిపోయేటటువంటి గ్రామాల సమస్యలు అట్లాగే ఉన్నాయి. వాటిలో ఒకటి రెండు పెద్దగ్రామాలుకూడా వున్నాయి. వాళ్లకు compensation పునరావాససౌకర్యం కల్పింపచేయడం జరుగుతుందని వాళ్లకు చెప్పుతునే వున్నారుగాని ఈనాటివరకు వాళ్లకు ఏవిధమైనటువంటి compensation ఇవ్వలేదు. 1957 వ సంవత్సరం June నాటికి ఆ ప్రాంతాలంతాకూడా మునిగిపోతూ వుంటే వాళ్లకు సరిఅయినటువంటి వసతులు కల్పించటానికి ప్రభుత్వం ఇంతవరకు ఏమీ చర్యలు తీసుకోకుండా ఉండటంవల్ల వారు నానాకష్టాలకు గురిఅవుతున్నారు.

కాబట్టి ఆవిషయంలో ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధవహిస్తుందని నేను భావిస్తున్నాను. అంతేకాకుండా rural medical relief scheme అనేది 1924 సంవత్సరంలో start చేసినప్పటికీ దాంట్లో యీనాటివరకుకూడా ఏవిధమైన improvement లేకుండా కేవలం వైద్యులకు నెలకు 60 రూపాయలు ఇవ్వడంవలన వాళ్లస్థితి యధాతధంగా ఉండినందుకు విచారిస్తున్నాను. ఇది మాతృస్థానం అయినటువంటి మన రాష్ట్రంలో స్థాపింపబడి Bombay, U. P. లో scheme fallow అయితే యీరోజు వాళ్లు allopathy వైద్యులకు 150 రూపాయలు ఆయుర్వేద వైద్యులకు 120 రూపాయలు యిస్తూంటే మాతృస్థానం అయినటువంటి మనరాష్ట్రంలో మాత్రం యింకా వాళ్లకు 65 రూపాయలుయిస్తూ గ్రామాలకుపోయి ఆ దంపౌకర్యమునకు subsidy గా treat చేస్తున్నాం అని చెబుతున్నారు. కాని

Sri N. C. Seshadri] [24th March 1956

యిది regular paid service గా ఆ category క్రిందికి రాదనిచెప్పడం చాలా విచారకరం. ఇతరరాష్ట్రాలలో వాళ్లకు ఎక్కువవసతులు కల్పిస్తున్నారు. మనం వాళ్లకు ఏవిధమైన జీతాలు పెంచకుండా యింకా 65 రూపాయలలోనే పెట్టడం చాలా విచారకరమైన విషయం. అంతేకాకుండా National health centres రెండవపంచవర్ష ప్రణాళికలో 145 దాకా open చేస్తున్నాం. కనీసం ఆ Health Centres లోనైనా G. C. L. Ms, L. I. Ms ను తీసుకునివెళ్ళి ఒక సమానమైనటువంటి స్థాయి చేకూర్చాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. తరువాత district roads విషయంలో కొంతడబ్బు ఖర్చుచేసినారు. Highways department క్రింద అయితే మేము మా తాలూకాకు సంబంధించినంతవరకు బళ్లారిజిల్లానుంచి ఎప్పుడైతే విడిపోయినామో అనంతపురం జిల్లాలో కేవలం Revenue purposes కు మాత్రం చేరినాముకాని రాయదుర్గం తాలూకాపైన ఒకవిధమైన సవతితల్లి ప్రేమచూపిస్తూవచ్చినారు. అనంతపురంజిల్లా అన్నితాలూకా Head-quarters roads కూడా సరిగా maintain చేసినప్పటికీ, రాయదుర్గం అనంతపురంకు 65 మైళ్లున్నప్పటికీ ఏ విధమైనరోడ్డు రవాణా సౌకర్యం లేకుండా, తాలూకా రోడ్లకు black topping వేసినప్పటికీ ఒక్క రాయదుర్గం తాలూకామాత్రం ఇంతవరకు black topping లేకుండా కనీసం motor లు సక్రమంగా నడిచేటటువంటిదానికి సరైనటువంటి వసతులు కల్పించకుండా ఉండడం చాలా విచారకరం. District Board roads వ్యవహారం వచ్చినప్పుడు local boards క్రింద కొంతడబ్బు కేటాయించి ఖర్చుచేసినారు. దాంట్లో కేవలం ఊరికేరోడ్డుకు మన్ను మాపించడమే కాని repairs కాదు. అసలు Assistant Engineers check measurement కు వచ్చినప్పుడు పైన మాత్రం కొల్చుకొనిపోతుంటారు. గుంటలలోనుండి రోడ్డుకు ఏమాత్రమైనా మట్టి వేసినారా? అది సక్రమంగావున్నదా? అని విచారించడం జరగడంలేదు. తరువాత administration of justice విషయంలో 173 Section of the criminal procedure code ను amend చేయడంవల్ల ఎక్కువగా ఖర్చు లయినవి కాబట్టి దానికోసం 3 లక్షలుపై చిల్లరఖర్చుపెట్టినాము అని లెక్క చూపించారు. కాని దూరప్రాంతములలో ఉన్నటువంటివారికి Administration of justice విషయంలో ఏమాత్రమైనటువంటి యిబ్బందులున్నవో చూడడంలేదు. ఉదాహరణకు రాయదుర్గం తీసుకొని కొన్ని వివరాలు మనవి చేస్తున్నాను. అనంతపురమునకు 65 మైళ్లదూరంలో రాయదుర్గం ఉన్నది. Distant point తీసుకున్నట్లయితే Munsiff's court కు 90 మైళ్లు అనంత [illegible] [illegible]. దాని విషయమై ప్రభుత్వానికి ఎన్ని అభ్యర్థనలు చేసి

నప్పటికీ separate munsiff court యివ్వకుండా ఉండడం చాలా విచారకరంగాఉన్నది. కేవలం 200 రూపాయలుపైనున్న ప్రామిసరీ నోటును కోర్టులో file చేయాలంటే 8 గంటలసేపు రాయదుర్గంనుంచి అనంతపురం ప్రయాణంచేసి అక్కడ 2,3 రోజులుండి నానావిధమైనటువంటి ఖర్చులు పెట్టుకొని వాళ్లు చాలా బాధపడుతూంటే administration of justice విషయంలో వసతులుకూడా యీనాటికీ కల్పించకుండాఉన్న విషయం ప్రభుత్వదృష్టికి తీసుకునివస్తూ తగినటువంటి ఏర్పాట్లు యికముందయినా చేస్తుందని నేను భావిస్తున్నాను.

SRI B. SANKARAIAH :—ఉపాధ్యక్షా, ఈచర్చ సందర్భంలో budget మీద చర్చవలెకాక కేవలం ఈ supplementary demands లో ఉండే విషయాలే చెప్పవలసినదని మంత్రిగారు సలహాయిచ్చారు Constituency లో జరిగినటువంటి విషయాలుగాని యీ ప్రభుత్వంవారి rules ను ఉద్యోగస్థులు సరిగా అనువర్తింపచేయడంలో జరిగేటటువంటి లోట్లనుగాని ఇదివరకు సమాధానం చెప్పలేదు. అటువంటిలోట్లు యిప్పుడైనా ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చినప్పుడు ఆలోచిస్తారని భావిస్తున్నాను. ఇప్పుడు ముఖ్యంగా Co-operative Department చాలా లోపభూయిష్టంగాఉన్నది. ఇదివరకే ముఖ్యమంత్రిగారు Planning Committee కి వచ్చినప్పుడు కొన్నివిషయాలు చెప్పాను. Field Labour Society లు పెట్టాలంటే ముందు వాళ్ళకు భూములు యిస్తామంటేనే తప్ప society register చేయడానికి వీలులేదని Deputy Registrar అంటారు లేదా societyను register చేస్తేనేతప్ప భూములు ఇవ్వడానికి వీలులేదని ఆయనంటారు కాబట్టి యిది పిచ్చికుదిరితేనే గాని పెళ్ళికాదు, పెళ్ళి అయితేగాని పిచ్చి కుదరదు అన్నట్టుగా వుంది ఇప్పుడుకూడా పరిస్థితి అట్లాగే continue అవుతున్నది అందువల్ల ప్రభుత్వ దృష్టికి యిటువంటి లోటుపాట్లను తీసుకునివచ్చినప్పుడు వెంటనే విచారించి ఉన్నటువంటి అసౌకర్యం తొలగించితే అక్కడేదైనా కొంతపని జరగడానికి అవకాశం ఉంటుంది. దానితరువాత యీ society ల registration విషయాలు కేవలం particular భూములకోసమే ఉండదు అటువంటప్పుడు society ని register చేసినతరువాత ఎక్కడ ఏ అవకాశాలుంటే అటువంటి అవకాశాలుపయోగించుకొని society పని చేయాల్సి ఉంటుంది. అటువంటప్పుడు ముందు భూములు ఎక్కడఉన్నాయో చెప్పవలెనంటే దానికి ఎన్ని చిక్కులు వాళ్లనెదుర్కొంటున్నారో చూచి యీ విషయం మళ్లా ఒకసారి ఆలోచించాలని కోరుతున్నాను. Andhra State Co-operative Society కి కొంత సహాయం యిస్తాం అని suplementary budget లో తెలియచేశారు. ఇదివరకు ప్రతిగ్రామములో

Sri B. Sankaraiah] [24th March 1956

ఉన్నటువంటి society లన్నీ affiliate అవడంవల్ల ఆ సంఘం ఏర్పడింది. అయితే ఇటువంటి చిన్న society లను affiliate చేసుకోమని rules మార్చుకుంటే తప్ప మా ప్రభుత్వం మీకు ఏవిధమైనటువంటి సహాయం చేయదని ప్రభుత్వం మామీద పదేపదే ఒత్తిడి తీసుకువస్తుందని మేము రాష్ట్ర సహకార మహాసభకు పోయినప్పుడు rules ను amend చేసేటప్పుడు తెలియజేశాము. ఈవిధంగా ఎంతకాలం మన రాష్ట్రంలో Society లు అన్నీకలిసి ఒక Union గా ఏర్పడి ఉన్నప్పుడు యీ రోజుకుకూడా చిన్నచిన్న Society లను 10 గ్రామాలకొక society పెట్టి run చేసేటటువంటివి ఎన్నో దేశంలో లేవని తెలుసును. అటువంటప్పుడు ఏ గ్రామంలోనైనా అక్కడున్న ప్రజలకు ఏదయినా ఒక సౌకర్యంకావాలన్నా Society లు register చేసుకుని పనిచేయడానికి అవకాశం వుంటుందేగాని 10 గ్రామాలుకలిసి స్థాపించి నటువంటి Society లను మాత్రం యీ Co-operative union లో register చేసుకుంటాం లేకుంటే లేదు అనడం న్యాయంకాదు. 10 గ్రామాలు కలసి పెద్ద society లు పెట్టుకున్నప్పుడు ప్రభుత్వం యింకా ఎక్కువ సహకారం యివ్వవచ్చు, encourage చేయవచ్చు. ప్రజలంతట ప్రజలే పదేపదే సహకారసంఘాలు నిర్మించుకోమనిచెప్పి ఒక విధమైన ప్రోత్సాహం యీయవచ్చు. కాని చిన్న society లు చేర్చడానికి వీలులేదని చెబుతున్నారు. ఈ విధంగా Rural Bank పెట్టినచోటకూడా ప్రభుత్వం యిచ్చినట్టి లెక్కలుప్రకారం అన్ని విధముల తక్కువ అప్పులు, సహకార సంఘాలద్వారా, అన్నీకూడా 5 per cent loans ప్రజలకు ఎక్కువ ఇవ్వాలని ప్రభుత్వపు report తెలియజేస్తుంది. అటువంటప్పుడు ఏ 2) ఏండ్లకో 30 ఏండ్లకో Rural Bank పెడతామని యీ area లో నున్నటువంటి society లన్నీకూడా రద్దుచేసుకోలేదని, liquidate చేసుకోవాలనే టటువంటి వైఖరి న్యాయంకాదు. 10 గ్రామాలకు ఒక society ఉన్నప్పుడు అందరి అవసరాలు ఒక society తీర్చలేదు. ఒక గ్రామానికి ఒక society ఉన్నప్పుడు కొంతసేవ చేస్తుంది. అటువంటప్పుడు ఇటువంటి వైఖరి తీసుకోకుండా పెద్ద Society లను Rural Bank లను encourage చేయడంద్వారా అందరికీ దాని ఫలితం చేకూరేటట్లు చేయడం మంచిది. ప్రజలందరూకూడా దానిద్వారా సులభంగా తమకు కావలసినటువంటి అవసరాలను తీర్చుకోగలమని వెంటనే voluntary గా వచ్చేటట్టుచూడాలి. అంతేకాని నిర్బంధపద్ధతిని పెట్టి చిన్న చిన్న society లను యీ విధంగా పొడు చేయడం న్యాయంకాదు.

ఇప్పుడు weavers society లకు Central Government ఎన్నో లక్షల రూపాయలు రిబేటు ఇస్తున్నారు. దానిని అంతా మన రాష్ట్ర ప్రభుత్వము ఖర్చు పెడుతున్నది. ఈ rebate అన్ని సొసైటీలకు అందడంలేదు సొసైటీలలో చేరిన weavers కు మాత్రమే ఇస్తాము అంటున్నారు బయట ఉన్నవాళ్లకు ఇవ్వడములేదు. ఇప్పుడున్న డైరెక్టర్లు కొత్తగా కొందరు సొసైటీలలో చేరుతామంటే, చేర్చటానికి నిరాకరిస్తున్నారు ఇటువంటివన్నీ కో-ఆపరేటివు రిజిస్ట్రారు దృష్టికి తీసుకువచ్చాము. చిన్న చిన్న సొసైటీలన్నింటిని liquidate చేస్తున్నాము, అందరినీ చేర్చుకోవడానికి వీలులేదు అని చెప్పడానికి extra-ordinary powers ఉపయోగిస్తారుగాని, weavers ను సొసైటీలో చేర్చుకొనకుండా డైరెక్టర్లు అడ్డుపెడుతూంటె వారిమీద ఏవిధమైన చర్యతీసుకోరు. ఖచ్చితంగా చేర్చుకోవాలి, చేర్చుకోకుండా ఉండేటట్లయితే, మిమ్ములను 38 సెక్షను క్రిందనో లేక ఇంకా special powers క్రిందనో దిద్దిస్తామంటున్నారు ఇంతమంది ప్రజలకు ఉపయోగపడాలని ప్రభుత్వము ఈ సహాయక స్కీమును ప్రభుత్వం తీసుకువచ్చింది అటువంటప్పుడు అన్యాయంగా వీరినందరిని చేర్చుకోవడం న్యాయముకాదని చెప్పకుండా, అక్కడ ఎవరైతే పలుకుబడి కలిగినవారు ఉన్నారో అటువంటివారికి ఇవన్నీ ఉపయోగపడేట్లు ఉన్నాయేగాని సామాన్యమైన weavers కు ఏమీ ఉపయోగపడటములేదు. ఉదాహరణకు, నెల్లూరు పట్టణంలో కొందరు వ్యక్తిగతంగాపోయి మమ్ములనుకూడా సొసైటీలలో చేర్చుకోమని అడిగినారు. మరల 50, 60 మంది కలిసి పిటిషన్ పెట్టుకున్నారు మీరంతా ఒక పర్యాయమువస్తే చేర్చుకోము ఒక్కొక్కరు రండి అన్నారు. ఈవిధంగా నేనుకూడా 2, 3, పర్యాయములు రిజిస్ట్రారు దగ్గరకుపోయి చెప్పినాను. కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వము ఇంత సహాయముచేస్తూ, అది weavers కు అందరికీ అందాలంటూంటే, society లకు డైరెక్టర్లుగా ఉండేవారు చేర్చుకోము అని చెప్పడం న్యాయమా అని రిజిస్ట్రారుగారిని అడిగినాము చెప్పినప్పటికికూడా వారందరినీ ఇప్పటికికూడా చేర్చుకోలేదు ప్రభుత్వం ఇచ్చే సహాయం weavers కు అందరికీ అందేటట్లు చూడాలన్నప్పుడు తప్పనిసరిగా వారందరినీకూడా చేర్చుకొనేదానికి డైరెక్టర్లకు ఇష్టములేకపోయినా, చేర్చుకొనే స్కీమును ప్రభుత్వము ప్రవేశపెట్టాలి లేకపోతే rebate మొత్తంమీద అందరి weavers కు అందేట్లు అయినా చూడాలి. ప్రభుత్వము ఒక ప్రక్క weavers కు సహాయముచేస్తూ, దానిని అందరకూ అందేట్లు చేయకుండా ఉండడము ఏ మాత్రం న్యాయముకాదు అందువల్ల weavers అందరికీ ఈ rebate అందేట్లు చూడాలని కోరుతున్నాను. మాజిల్లాలో ఎక్కువగా పట్టె నేత నేస్తారు అది మనకు ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో

Sri B. Sankaraiah] [24th March 1956

యుండగా అక్కడనుంచి export అయ్యేది, ఇప్పుడు దీనికి export facilities లేనందువల్ల, మద్రాసులో చెల్లారావ్ వంటివారి దగ్గరకు దీనినితీసుకుపోతున్నారు వాళ్లు తడవతడవకు అక్కడకు తీసుకుపోవడమువల్ల, export చేసేందుకు ఎక్కువ profit తీసుకుంటున్నారు. నేసినవారికి కూలికూడా గిట్టడములేదు. వారందరికి export చేసేదానికి కేంద్రప్రభుత్వము అవకాశములు కల్పించినట్లు నెల్లూరు జిల్లాలో ఎక్కువ మంది Weavers నెలకు 30 రోజులు పనికలిగే అవకాశముఉన్నది. ఇవన్నీ చూడాలని కోరుతున్నాను. కో-ఆపరేటివ్ రూలులో 2 విధాలుగా ఉపయోగిస్తున్నారు ఇప్పుడు కోవూరు మొత్తానికి ఒక Fishermen co-operative society పెడితే అక్కడఉన్నటువంటి ఒక పెద్ద కంట్రాక్టరు 16 మందిని తీసుకువచ్చి, వారు fishermen అని సర్టిఫైచేయించి, వారికి ఆయన డబ్బు ఖర్చుపెట్టి, ఒక సొసైటీని లేవదీశాడు. ఈ విషయము అంతా ఎవరికీ తెలియకుండా చేపలు పట్టుకునే లైసెన్సుకూడా వారికే వచ్చింది. ఈ విషయము రిజిస్ట్రారుకు, కలెక్టరుకు తెలియజేశాము. మంత్రిగారికి తెలియజేశాము ఇది విచారించాలా, అక్కరలేదా, ఇది న్యాయమా, కాదా, అక్కడ ఎంతమంది చేపలు పట్టేవారు ఉన్నారు, అని విచారించలేదు. వల మొదలగు చేపలు పట్టేసాధనములతో అక్కడ ఉన్నవారందరనీకూడా ఆ సొసైటీలో చేర్చుకోమని రిజిస్ట్రారుగారుకూడా చెప్పారు దానికి అక్కడఉన్న డైరెక్టర్లు నిరాకరిస్తున్నారు. మొన్న శ్రీ సంజీవయ్యగారు అక్కడకు వచ్చినప్పుడు, ఈ విషయములన్నీ వారి దృష్టికి తీసుకువస్తే, అది మా co-operative rules లో లేదు, వారు చేర్చుకోమంటే మేము చేసేదిఏమి లేదు అన్నారు. వాళ్లు కావాలన్నప్పుడు 38 సెక్షను ప్రకారం suspend చేయమని చెప్పవచ్చును. లైసెన్సు ఇవ్వవద్దు అని చెప్పవచ్చును. అందువల్ల అది దుర్వినియోగము చేస్తున్నప్పుడు, specific గా అన్యాయము జరుగుతున్నప్పుడు, కనీసం విచారించేదానికి ప్రయత్నము చేయాలి. Fishermen కానివారిని ఆ కంట్రాక్టర్లు చేర్చుకుంటున్నారంటే ఎవరికి సంతృప్తి కరంగా ఉంటుంది ? అందువల్ల ఇటువంటివన్నీ విచారించాలని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను

S. S. L C. చదువుకునే విద్యార్థులు, కోవూరునుంచి అల్లూరిసెంటరకు వెళ్లకుండా అక్కడనే సెంటరు ఏర్పాటుచేసినందుకు ప్రభుత్వమువారిని అభినందిస్తున్నాను. మా జిల్లాలో కవ్వూరునుంచి నెల్లూరుకు 40, 50 మైళ్ల దూరం 13,14 సం॥ల వయస్సుగల పిల్లలు S.S.L.C పరీక్షలకు వచ్చుటకు చాలా ఇబ్బందులు పడుతున్నారు. అందువల్ల, కనూరులో వచ్చేసంవత్సరంనుంచి అయినా సెంటరు [illegible]యాలని మంత్రిగారిని కోరుతున్నాను. ఇప్పుడు పోలీసు డిపార్టుమెంటులోనే

మద్యనిషేధశాఖను కలిపినందువల్ల గీత కార్మికులు అనేకచిక్కులకు గురిఅవుతున్నారు లైసెన్సులు దొరకడములేదు. "మీరు దుర్వినియోగము చేయరని గ్యారంటీ ఏమి ఉన్నది. అందువల్ల గీయడానికి వీలులేదని ఆ డిపార్టుమెంటు అధికారులు అంటున్నారు. ప్రభుత్వ రిపోర్టులో 100 కి 45 మంది గీతకార్మికులు, వ్యవసాయ కూలీలుగా మారిపోయారు అన్నారు. వ్యవసాయ కూలీలకైనా ఎల్లప్పుడూ పని ఉండదు. వ్యవసాయకూలీలకు సంవత్సరమునకు 23 నెలలకంటే పనివుండదు. అందువల్ల వారికి ఉద్యోగము దొరికినది అనడం సరికాదు Weavers కూడా వ్యవసాయపనుల సమయంలో వారికి పనిలేప్పుడు 10, 15 రోజులు వ్యవసాయ కూలీలుగా పనిచేస్తునారు. అందువల్ల గీతకార్మికులు వ్యవసాయ కూలీపని చేసుకుంటున్నారు, వారికి ఉద్యోగము దొరకినది అనకుండా, వారికి చేసిన వాగ్దానాల ప్రకారం వారికి పనులు కల్పించితగిన సహాయము చేయవలయునని కోరుతున్నాను.

63 మందిపై కేసులుపెట్టారు. అందులో నలుగురు చచ్చిపోయారు. ఆవిషయము ముఖ్యమంత్రిగారికి తెలియచేశాము. D.I.G. కి I.G. కి తెలియజేశాము. చచ్చిపోయినవాళ్లను 4 గురిని తీసుకువస్తేనేగాని కేసు విచారించనని మేజిస్ట్రేటు చెప్పారు. చచ్చిపోయినవారిని ఎట్లా తీసుకువస్తాము అన్నాకూడా వినిపించుకోలేదు. అచ్చటి ఉద్యోగస్థులమీద ఏమీ చర్యతీసుకోలేదు.

ఆదేవిధంగా అల్లూరుగ్రామంలో 30 మందిమీద సెక్యూరిటీ కేసుపెట్టారు. ఇది ఏవిధంగా జరిగిందిఅంటే, ఆ ఊరిలో influence కలవారు ఇద్దరుపోయి ఆ కార్డులు అన్నీ వారిష్టమువచ్చినట్లు వ్రాసియిస్తే వారిమీద కేసులుపెట్టారని తెలుస్తున్నది. ఆపేర్లను సబిన్స్పెక్టరుకు, సర్కిలుకు పంపించారు. సర్కిల్ ఇన్స్పెక్టర్ R.D.O.కు పంపించారు. అది మేజిస్ట్రేటువద్దకు విచారణకువచ్చినది. వారిని 6 నెలలు సత్ప్రవర్తనకు పూచీ ఇవ్వమన్నారు. ఇది 2 యేండ్లు పట్టినప్పుడు, ఈ రెండు యేండ్ల శిక్ష ముందే అయిపోయింది అన్నమాట. దానికి maximum punishment ఎంత ఉన్నది, ఎటువంటి సత్ప్రవర్తనకు పూచీ ఇవ్వడము అంటె, సెక్యూరిటీ సెక్షన్క్రింద కేసుపెట్టి, ప్రిలిమినరీ విచారణ కాకుండానే ఆ 50 మందిని సత్ప్రవర్తనకు పూచీ ఇవ్వమంటున్నారు. హైకోర్టుకు అప్లైయిచేస్తే తాత్కాలికంగా stay ఇచ్చి. ప్రిలిమినరీ విచారణలేకుండానే అట్లా సత్ప్రవర్తనకు పూచీ అడగడానికి వీల్లేదని చెప్పారు. బుచ్చిరెడ్డిపాలెం, ఎల్లయపాలెం, ఉప్పలపాడుల్లో ఇటువంటి కేసులుఉన్నాయి.

ఎప్పుడయితే petition యిస్తారో అప్పుడు 3, 4 నెలలకు సత్ప్రవర్తనకు పూచి ఇవ్వాలి. ఆ గ్రామంలోని ఒకరో ఇద్దరోకలిసి petition పెడితే దానిమీద

preliminary enquiry చేయకుండా అంతా విచారించిన తరువాత నేరంచేసిన వాడు ఎవరో తెలిసిన తరువాత ఏ శిక్ష పడుతుందో దానికన్నా 3, 4 రెట్లు ఎక్కువ శిక్ష పిటీషన్ రాగానే విధించడం న్యాయమా ? మాజిల్లాలో ఉన్నటువంటి security cases పై ఇంతవరకు శిక్షపడలేదు. ఎన్నో వందల కేసులు జరుగుతున్నాయి. ఒకవేళ Deputy Collector వ్రాసినప్పటికీ కోర్టులలో శిక్షలు రద్దు అవుతున్నాయి. అట్లా అన్యాయంగా కేసులు పెడుతోంటే వాటినిగురించి ప్రభుత్వం ఎందుకు ఆలోచించడంలేదు? Minimum శిక్ష ఎక్కడాకూడా 6 నెలలకంటే ఎక్కువ వుండదు. 6 నెలల సత్ప్రవర్తనకు పూచి ఉండే శిక్షకు petition రాగానే 2, 3 సంవత్సరములు శిక్ష విధించడమనేది న్యాయమా ?

ఒకగ్రామంలో ఇట్లా అన్యాయంగా కేసుపెట్టినతరువాత, ప్రభుత్వం దానిని విచారించిన తరువాత అది నిజమని తేలినపిమ్మట మరల అదేగ్రామంలో నూటికి 80 మందిమీద కేసులుపెట్టే అధికారం ఎందుకు ఇవ్వాలి ? దీనిని ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొని వచ్చినప్పటికీ ఎందుకు విచారించకూడదు? వారు ఏదో చేస్తే దాన్ని ప్రభుత్వంమీద ఆరోపించుటకుకాదు. ప్రభుత్వ దృష్టికిమాత్రం తీసుకు వస్తున్నాను. ఉప్పలపాడు అనే గ్రామంలోని 10, 15 ఇళ్లవారినితప్ప మిగిలినస్త్రీ పురుషులందరిని, కూలివారు, బీదవారు అందరిమీద కేసులుపెట్టారు. ఇప్పటికింకా 6, 7 కేసులు జరుగుతున్నాయి. ప్రభుత్వంవారు ఎందుకు enquiry చేయకూడదు?

THE HON. DR. B. GOPALA REDDI :—వారంతా శ్రీ శంకరయ్యగారి బంధువులా ?

SRI B. SANKARAIAH :—బంధువులనే మాట వదలి వేయండి. స్త్రీలనుకూడ కలిపి ఒకే పార్టీమీద ఈ కేసులు పెట్టినారు. ఒక పక్షంమీదనే ఈ కేసులు పెట్టవలసిన అవసరం ఏమి వచ్చింది ? ఈ ఒక్కపక్షమే అంత దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నదా, ప్రభుత్వంవారు ఒకసారి ఆ దుర్మార్గం చేసేవారు ఎవరో ఎందుకు విచారించకూడదు ? R. D. O. ల ద్వారా గాని, police ద్వారాగాని ఉప్పలపాడు, అల్లూరులలోని కేసులువిషయమై పరిశీలించండి. మేము చెప్పిన దాంట్లో ఏమైనా అసత్యమున్నట్లయితే అసెంబ్లీలో చెప్పవచ్చును. ఒక statement రూపంలో ఇవ్వవచ్చును వీరు ఇంత అన్యాయంగా ప్రవర్తిస్తోంటే ఇదివరకు రెండు కేసులను గురించి చెప్పినాము, విచారణ జరిగింది, ఇప్పుడు ఈ 2 కేసులను విచారణ జరిపించండి. అప్పుడు ఆ రెండు కేసులు ఎట్లా ఉపసంహరించుకున్నారో అటులనే ఈరెండు కూడ [illegible] న్యాయం కనుక ప్రభుత్వం వెంటనే విచారించాలని

కోరుతున్నాను. నెల్లూరుజిల్లాలో, కోవూరుతాలూకాలో ఇటువంటివి ఎక్కువగా జరగడానికి అవకాశం ఉంది. ఇటువంటి విచారణ చేసేటప్పుడు ఏపక్షం మీదనైనా కేసుపెట్టాలంటే దానికి తగిన రుజువు కావాలి. Preliminary enquiry చేయాలి. అప్పుడు కేసు నిజమైతే శిక్షించాలి. అంతేకాని రుజువులేకుండా శిక్షించకూడదు. ఆమధ్య కొంతమందిని ఉప్పలపాడులో అరెస్టుచేసి బుచ్చిరెడ్డిపాలెం తీసుకువచ్చారు. అప్పుడు వేమయ్యగారు వెళ్ళి "వాళ్లను అరెస్టుచేసి ఎక్కడకు తీసుకొనిపోతారు ? మేము జామీను ఉంటాము. విడిచిపెట్టండి" అని చెప్పి Sub-Inspector గారిని, Circle inspector గారిని అడిగినారు. "మేము కోవూరు తీసుకువెడతాము. అక్కడకు మీరు జామీనుదారులను తీసుకువచ్చి సిద్ధంగా ఉండండి" అని చెప్పారు. ఇట్లుచెప్పి వారు అరెస్టుచేసినవారిని ఉదయగిరికి తీసుకుపోయారు. ఇంతకన్నా వేరే అన్యాయం ఉందా ? హరిజనులకు సంబంధించిన వేమయ్యగారు వెళ్లి జామీను ఉంటామని చెబితే అబద్ధమాడవలసిన అవసరం ఏమి వచ్చింది ఆ పోలీసు ఆఫీసరుకు ? కోవూరుకు తీసుకువస్తామనిచెప్పి ఉదయగిరికి తీసుకుపోవలసిన అవసర మేమి వచ్చింది ? ఇటువంటి 1,2 విషయాలను విచారించండి. ఇటువంటివి విచారించినపుడు న్యాయంగా చేయాలి. బంధువులని చెప్పుకోడానికి వారిక్కూడా భయంగానే ఉంటుంది. నేను ఇప్పుడు ప్రభుత్వందృష్టికి తీసుకొని వచ్చిన 2 కేసులను ఖచ్చితంగా విచారించి వారిమీద సరియైన చర్య తీసుకోవాలి ఇప్పుడు maximum punishment అని ఏదో తీసుకొస్తున్నారు. అది ఒక పెద్ద మార్పుగాదు. M. L. A. లకు అబద్ధం చెప్పవలసిన అవసరం లేదు. Day to day administration లో కలుగ జేసుకొనుట లేదు. మేము ఎప్పుడూకూడ ప్రజలకు వచ్చిన సమస్యలనుగురించి ఆలోచిస్తూ ఉంటాము. కుప్పలు తగులబెట్టినవిషయంలో సరియైన enquiry చేయండి. ఎవరైనా ఇటువంటి చెడ్డపనులుచేస్తే సరియైనపద్ధతిలో విచారించి శిక్షించాలి. మేము కొంతమందిని ప్రోత్సహించి "ఆ కుప్పలు తగులబెట్టండి, ఆపని సర్వనాశనం చేయండి" అని చెప్పినట్లుగాఉంటే రుజువుచేయండి. కుప్పలను తగులబెట్టినవారిని పట్టుకోడానికి మేముకూడా ప్రయత్నిస్తాము. అసలు ఈకుప్పలు తగులబెట్టేవారు ఎవరో తెల్సుకుందామని నేను చాలాసార్లు ప్రయత్నంచేశాను. అట్టిపనులు ఎవరు చేసినారో రుజువులేకుండా ఎవరిమీదనైనా నిందమోపి కేసుపెట్టడం న్యాయం కాదు. అన్నిపార్టీలు కలిసి వాడిని పట్టుకొనేందుకు ప్రయత్నంచేస్తే దొరకకుండా ఎక్కడకు పోగలడు ? అందరూ కలసి ఇటువంటి దుర్మార్గములను అరికట్టుటకు పూనుకొన్నప్పుడు ఒక్కగ్రామంలోకూడ ఇటువంటి దారుణకృత్యములు జరుగుటకు సావకాశంలేదు. కనుక ప్రభుత్వంవారు దీనిని నిష్పక్షపాతంగా ఆలోచించాలని కోరుతూ విరమిస్తున్నాను.

SRI IRAGADA KOTAIAH :—ఉపాధ్యక్షా ! ఇప్పుడు శంకరయ్యగారు చేనేత సహకార సంఘాలకు సంబంధించిన కొన్ని విషయములను చెప్పినారు. ఈ సందర్భంలో జరుగుతున్న వాస్తవపరిస్థితులను గురించి వారికి తెలియజెప్పడం అవసరమనుకుంటున్నాను. ఇప్పుడు చేనేత సహకారసంఘములలో ఎక్కువమందిని చేర్చుకొనుటకు అవకాశంలేదు. ఈ సెస్సు ఆందోళనగురించి రాష్ట్రం మొత్తంమీద కొత్తగా 5 వేలమందినిమాత్రమే సహకారసంఘాలలో చేర్చుకొనుటకు ప్రభుత్వం అనుమతి ఇస్తున్నది. ఈ 5 వేల మందిలోను రిజిష్ట్రారుగారు జిల్లాల వారీగా పంపకంచేస్తారు. తరువాత ఏయేప్రాంతాలలో చేనేత పారిశ్రామికులను క్రొత్తగా జేర్చుకొనుటకు అవకాశమున్నదో డిప్యూటి రిజిష్ట్రారుగారు పరిశీలించి ఆయాచోట్ల allotment చేస్తారు. నెల్లూరు, కోవూరు, బుచ్చిరెడ్డిపాలెం, యలమంచిలి మున్నగు గ్రామాలలో డిప్యూటి రిజిష్ట్రారుగారు అక్కడ ఉన్నటువంటి చేనేత పారిశ్రామికుల సంఖ్యను, సహకార సంఘాలసంఖ్యను చేరదలచుకొన్న వారిసంఖ్యను పరిశీలించి ఎంతమందిని చేర్చుకొనుటకు అవకాశముంటుందో అంతమందిని మాత్రమే allot చేస్తారు. ప్రస్తుతం కొంతమందిని మాత్రమే చేనేత పారిశ్రామికులను సహకార సంఘములలో చేర్చుకొనుటకు అవకాశమున్నది. అందువల్ల ఇప్పుడు శంకరయ్యగారు చెప్పినట్లుగా ఏ ఒక్కసంఘములోనుకూడ 50 మందికంటె ఎక్కువ చేర్చుకొనుటకు అవకాశం లేకపోయి ఉండవచ్చును అటువంటి విషయములను Deputy Registrar గారి దృష్టికి తెచ్చినట్లయితే తప్పకుండా పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. Deputy Registrar గారి వలన సరియైన న్యాయంజరగదనే అభిప్రాయంఉన్నట్లయితే ఆంధ్రరాష్ట్ర చేనేత సహకారసంఘంవారికి తెలియజేసినట్లయితే వారు తప్పకుండా పరిశీలిస్తారు. సాధ్యమైనంతవరకు చేనేత పారిశ్రామికులను సహకారసంఘాలలో చేర్చాలన్నదే ప్రభుత్వంయొక్క ప్రధానలక్ష్యం. ఈనాటి చేనేత పారిశ్రామికులయొక్క లక్ష్యం కూడ అదే. ఈనాడు పరపతిసౌకర్యములు హెచ్చుగా లేనందున హెచ్చుమంది పారిశ్రామికులను సంఘాలలో చేర్చుకొనలేకపోతున్నాము. ఈ చేనేత పారిశ్రామికులను విశేషంగా చేర్చుకొన్నట్లయితే వారికి పని కల్పించడం చాల కష్టమౌతుంది కాబట్టి ఈ విషయంలో జాగ్రతగా వ్యవహరించవలసిఉంటుందని మనవి చేస్తున్నాను.

SRI M. NAGI REDDI :—ఇప్పుడు అవకాశంలేదు కాబట్టి ఎక్కువ మందిని చేర్చుకొనుటకు వీలులేదు అంటున్నారు కోటయ్యగారు. అందువల్ల కొంతమందికి అభివృద్ధి చేకూరకని ప్రమాదపరిస్థితులున్నాయి. ఇప్పుడున్నటువంటి సౌకర్యములు అందరూ సమానంగా పొందుతూ "మాకు ఇవి చాలవు, ఇంకా కొన్ని సౌకర్యములను కలుగచేయమని ఎందుకు అడగకూడదు ?

SRI PRAGADA KOTAIAH :—వచ్చినదయావత్తు మొత్తమునకూడ ఖర్చుపెట్టుటకు చేనేత పారిశ్రామికులు సిద్ధంగాఉన్నారు. సహకారసంఘములు కూడ సంసిద్ధంగా ఉన్నాయి.

ఇండియా ప్రభుత్వంవారు హెచ్చుగా allotment ఇచ్చి, వెలుపల ఉన్నటువంటి లక్షలాది చేనేత పారిశ్రామికులను ఇవాళ చేనేత సహకార సంఘాలలో చేర్చమన్నట్లయితే దానికి ఎక్కువగా మేమే సంతోషిస్తాము. మధ్యవర్తుల నుండి ఏనాడైతే మనకు విముక్తి లభిస్తుందో ఆనాడు మనకు కొంచెము అవకాశముంటుంది. ఆ అవకాశమును ఆధారంగా పెట్టుకొని ఈ సహకార సంఘాలు నడుపుతున్నాము. కేంద్ర ప్రభుత్వంవారు చాలినంత interest free loans ఇవ్వలేక పోవటమే ఇవి సరిగా నడవలేక పోవుటకు ప్రధానమైన కారణం.

ప్రత్యేకమైన instance ఏదైనా ఉన్నప్పుడు Deputy Registrar గారికి తెలియజేయాలి. లేదా ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘంవారికి తెలియజేసినట్లయితే వారు తప్పని సరిగా సవరించడానికి ప్రయత్నించెస్తారు. కాని రాజకీయములను ముడిపెట్టుకొని వారు ప్రయత్నం చేసినప్పటికికూడ దానిని హర్షించుటకు చేనేత పారిశ్రామికులు సిద్ధంగా లేరని నేను మనవిచేస్తున్నాను రాజకీయాల కారణంగా చట్టాలను సహితం ధిక్కరించి రిజర్వు ఫండులను పంచుకున్నటువంటి కమ్యూనిస్టు ఉదంతం పెడనలోను, వేటపాలెంలోను, జాంద్రపేటలోను ఉన్నది రాజకీయ చట్టాలను ధిక్కరించి వాటా ధనం మాత్రమే కాకుండా, reserve funds ను, Central Bank వారు ఇచ్చినటువంటి అప్పులను సహితం అర్ధరాత్రి వేళ పంచుకొని, పుస్తకాలను మాయం చేసినటువంటి కమ్యూనిస్టు సోదరులను మళ్లీ చేనేత సహకార సంఘాలలో చేర్చుకొనుట సాధ్యంకాదు. వారి ప్రవర్తనలో మార్పు వచ్చినపుడు మాత్రమే వారిని గురించి ఆలోచించుటకు అవకాశంఉంటుందని మనవి చేస్తున్నాను. Madras hand-kerchie- ల విషయంలో మన ప్రభుత్వం ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొనుటలేదు. ఇది చాలా దురదృష్టకరమయిన విషయం. Madras hand-kerchiefs అనేవి ఒక్క West Africa లో మాత్రమే అమ్ముడు అవుతాయి.

కాని ఈ వ్యాపారమంతా మద్రాసులో ఉన్న 10 మంది వర్తకుల చేతులలో జరుగతున్నది. ఉత్పత్తి ఆంధ్ర దేశంలో సాగుతూవున్నది ఉత్పత్తి దారులందరూ కూడ మద్రాసు వర్తకుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసి ఉంటున్నది. West Africaలో ఒక depot పెట్టవలసిందని కేంద్ర ప్రభుత్వంవారిని అభ్యర్థిస్తే అక్కడ ఉన్నటువంటి T T, Krishnamachari గారు బహుశా మద్రాసు వర్తకుల

Sri Pragada Kotaiah] [24th March 1956

క్షేమాన్ని కాపాడడంకొరకు కాబోలు బర్మాలోను, సింగపూర్ లోను, సయాంలోను పెడతామంటున్నారు కాని West Africa లో ఒక దుకాణం పెట్టడానికికూడా వారు అంగీకరించడంలేదు. ఇక్కడ 30 వేల మగ్గాలున్నాయి వీటిమీద తయారైన వన్నీ West Africa లోనే అమ్ముడు కావాలి. కాబట్టి మద్రాసులో ఉన్నటు వంటి 10 మంది వర్తకుల దయాదాక్షిణ్యాలకు ఈ 30 వేల కుటుంబాలవారిని గురి చేయకుండా ఉండాలంటే ప్రత్యేకంగా ఒక deligation పంపించి ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘాల యాజమాన్యానగాని, ప్రభుత్వ యాజమాన్యానగాని West Africa లో ఒక దుకాణంపెట్టి చేనేత పారిశ్రామికులకు సహాయం చేయ వలసిన అవసరం ఉన్నది. దీనినిగురించి నేను ఆంధ్ర ప్రభుత్వానికి represent చేశాను. ఇంతవరకు సమాధానమేమీ రాలేదు. ఈ "రెడ్ టేపిజమ్" ను గురించి నేను అనేకసార్లు చెబుతున్నాను. కనీసం acknowledgment గాని, ప్రయత్నం చేస్తున్నామని గాని, ఈ విషయంలో మా ధోరణి ఫలాన అనిగాని ప్రభుత్వం చెప్పుటలేదు. ఇంతేకాకుండా నేను మొన్న ఆహారధాన్యాల విషయం చెబుతోంటే చాలా చులకనగా చూశారు. కాని సాధారణమైన కుసుమ ధాన్యం ఈనాడు బస్తా 1కి 24 రూపాయలు ఉన్నది.

మామూలు కార్మికజనం వృత్తిచేసుకొని బ్రతకవలసిన వారిజీవితంలో మార్పేమీ రాలేదు. వారికూలి ఏవిధంగాను పెరగలేదు. ఆహారధాన్యాల ధరలు ఆకాశాన్ని ముట్టుతున్నాయి. ఈ పరిస్థితులలో హైదరాబాద్ ప్రభుత్వము కొంత వివేకంతో వ్యవహరించింది. ఇండియా ప్రభుత్వం దగ్గర నిలవఉన్న ధాన్యాన్నంతని హైదరాబాద్ ప్రభుత్వం relief చేసి చౌకధరలకు పేదవారికి అందుబాటు చేయడానికి ప్రయత్నం చేస్తున్నది. ఇటువంటి విధానాన్ని మన ప్రభుత్వంకూడా అనుసరించాలని నేను విజ్ఞప్తిచేస్తున్నాను. కుసుమ ధాన్యం ధర పెరగడమేగాని తగ్గడంలేదు. రూపాయికి మానెడు సోలెడు చొప్పున అమ్మిన బియ్యం ఈరోజున్న మూడు సోలల కంటె కూడా తగ్గిపోయింది. ఈవిధంగా ధాన్యం ధర పెరిగిపోయినందువల్ల ఏర్పడిన పరిస్థితి ప్రభుత్వం తప్పనిసరిగా గ్రహించాలని విజ్ఞప్తిచేస్తున్నాను.

Services గురించి మాట్లాడేటప్పుడు, ఉదయం జరిగిన చర్చలనుబట్టి చూస్తే గోపాలరెడ్డిగారికి ఆగ్రహం వచ్చిందేమోననిపిస్తోంది. నేను ఒకటి రెండు instances వారి దృష్టికి తీసుకువస్తున్నాను. ఇప్పుడు Public Works Department ఉన్నది. అవసరాలకొద్దిగాని, పరిస్థితుల ప్రాబల్యమువల్లగాని non-Telugu వారిని మనం ఇక్కడికి తెచ్చుకొన్నాము. బహుశా మనం చేసుకొన్నటు వంటి ఒప్పందం ప్రకారం రెండు సంవత్సరాల అనంతరం వారిని తిరిగి పంపించ

వలసి ఉంది. అలా కాకుండా P.W.D. వారు తెలుగువారు కానివారిని ఇక్కడ permanent గా absorb చేస్తున్నారు. వాళ్లను permanent గా absorb చేయడమే కాకుండా తెలుగువారిలో deserving candidates కు promotions ఇవ్వడంలేదు ఇలాంటి ఉదాహరణ ఒక Manager విషయంలోనే జరిగింది. P.W.D. జనరల్ శాఖలో ఒక తెలుగువానికి Manager గా promotion కావడానికి అన్ని అర్హతలు ఉన్నప్పటికి తెలుగువారు కాని వారిని permanent చేసి ఇంకొకనికి ఆ promotion ఇచ్చి over look చేశారు. ఇలాంటి సందర్భాలు 2, 3 ఉంటే మేము 33 మంది సభ్యులము శాసనసభలోకి ఆ ప్రసక్తి తీసుకురాకుండా 4,5 మాసాలక్రితం దానికి సంబంధించిన మంత్రిగారికి ఒక విజ్ఞప్తినిచేస్తే దానిని విచారించడానికి ప్రభుత్వం పూనుకోలేదు సరిగదా మామూలు ఉద్యోగస్తులే దీనికి కారణమైఉంటారని వారిని ఆ Department నుండి మరొక Departmentకు మార్చడంకూడా జరిగింది కాబట్టి ఈ విధంగా అన్యాయము జరుగుతున్నప్పుడు ఇదేదో ఆ ఉద్యోగివచ్చి specific గా చెప్పాడు కాబట్టి మేము disciplinary action తీసుకుంటామనడం సరైనదికాదని నేను వారికి మనవి చేస్తున్నాను. అధికారులు సాగిస్తున్న అక్రమాలవల్ల సిబ్బంది ఏ విధంగా బాధ పడుతున్నదికూడా ప్రభుత్వం గమనించవలసిఉన్నది. P.W.D. లో L.C.Es ఉన్నారు. వారికికూడా promotion ఇవ్వాలి. B. E. లకుకూడా ఇవ్వాలి. కాని అక్కడ ఉన్నటువంటి అధికారి తన అల్లుడుకు promotion ఇచ్చుటకుగాను L.C.Es. అందరిని over look చేసి B. E. లకుమాత్రం promotion ఇవ్వగా వారందరుకలసి అడ్డుపెట్టగా జీతాలు ఇవ్వడం మానివేశారు. జీతాలు ఇవ్వకుంటే ఏ విధంగా బ్రతకాలి. 6,7 మాసాలనుంచి జీతాలులేకుండా T.A లు మాత్రం draw చేసుకోవచ్చునన్నారు. T.A. లు Draw చేసుకోవడానికి అనుమతించిన ప్రభుత్వం జీతాలు draw చేసుకోవడానికి అనుమతించకుండా ఉన్నది. 7,8 మాసాలనుంచి జీతాలులేకపోతే సాధారణమైనటువంటి A. E. లు ఏవిధంగా బ్రతకాలి ? అక్రమమార్గాలలో ప్రవేశించేదానికి ప్రభుత్వమే పరోక్షంగా ప్రోత్సాహము కల్పిస్తున్నదన్నమాట. P.W.D. లో ఉన్నటువంటి ఉన్నతోద్యోగి అక్రమంగా promotions ఇస్తున్నాడు అనేటటువంటి నిర్ణయానికి ప్రభుత్వం వచ్చినపుడు దానిని వెంటనే పరిశీలనచేయాలి. ఆ నిర్ణయాన్ని సవరించాలి. అలా సవరించని ఫలితంగా 7,8 మాసాలుగా జీతాలులేకుండా ఉన్నారు. ఈ విధంగా 7,8 మాసాలనుంచి జీతాలు లేకపోతే వారు contractors తో లాలోచిపడి ఏదో ఒకవిధంగా దొంగతనంగా బ్రతకడానికిగాను వారు ప్రయత్నించేయవలసిన ప్రత్యేకపరిస్థితులను ప్రభుత్వమే కావాలని తెచ్చిపెడుతున్నట్లు కల్పిస్తున్నది. సాధా

Sri Pragada Kotaiah] [24th March 1956

రణంగా ఉద్యోగ్యంమీదనే బ్రతకడానికి వచ్చినటువంటివాడికి ఏమి జరుగుతున్నదనే విషయాన్నికూడా ప్రభుత్వం ఆలోచించవలసిఉన్నది. Education and Endowment శాఖలో కులాలపేరుతో 7, 8 మందికి చాల అక్రమం జరిగిందనే విషయాన్ని ఈ రోజు శాసనసభలో ప్రశ్నరూపంగా ప్రభుత్వదృష్టికి తీసుకువస్తే అప్పుడే వారిమీద Service Rules ప్రకారం disciplinary action తీసుకొనడానికి అవకాశం ఉన్నదేమోనని Law department కు ఒక note పంపించి examine చేయిస్తున్నారు. ఇది సరైనదికాదని మనవిచేస్తున్నాను (Interruption ఎట్లా తెలిసినది.) కావలసినంతమంది చెపుతూఉంటారు అక్రమాలు జరిగినపుడు వారంతట వారే చెపుతూఉంటారు, Secretariat లో జరిగేటటువంటి విషయాలు అందరకు తెలుస్తూఉంటాయి. మంత్రులువేసే orders అన్నీకూడా ప్రజలదగ్గరకు రాకుండా ఉండడానికి అవకాశంలేదు Secretariat services కు సంబంధించిన G.O లు ఎన్నో pass అవుతున్నాయి. వీటన్నిటినిగూర్చి చెప్పాలంటే కావలసినన్ని సందర్భాలు మీ దృష్టికి తీసుకురావచ్చు.

District Munsiffs విషయంలో జరిగినటువంటి అన్యాయాన్ని 9 నెలల క్రితం ప్రభుత్వం దృష్టికి తీసుకువస్తే వాటిని సవరించడానికి ప్రభుత్వం ఏమి ప్రయత్నంచేసినదని అడుగుతున్నాను. Specific instances తీసుకువస్తే మేము సవరించేదానికి ప్రయత్నంచేస్తామని చెప్పినప్పుడు backward class కు rotation ప్రకారం 14 స్థానాలు రావలసిఉంటే 8 స్థానాలు ఇచ్చారు. Acting Munsiffs గా Service Commission చే selection అయిన వాళ్లు వచ్చినప్పటికి no suitable candidates అని అంటే మౌనం వహించడం జరుగుతోంది. Backward classes వారందరుకూడా acting Munsiffs గా May లోనే ధరఖాస్తులు అందజేసిఉన్నారు. ఈ 9 నెలలనుంచి 3, 4 reminders వ్రాసిన తరువాత "It is under consideration" అని reply వచ్చింది.

ఎంతకాలము ఈవిధంగా consideration లో ఉంటుంది ? జరిగిపోతున్న అన్యాయం జరిగిపోతున్నప్పుడు ఈ అన్యాయాన్ని అరికట్టడానికి వెంటనే చర్యలు తీసుకొనకపోయినట్లయితే మరికొంత అన్యాయం జరగడానికి దోహదమిచ్చినట్లు అవుతుంది. మనకు ఉన్న పెద్ద సిబ్బంది అంతా న్యాయంగానే వ్యవహారం చేస్తున్నారు. క్రింద ఉన్నటువంటి చిన్న ఉద్యోగస్తులే న్యాయంగా వ్యవహా[illegible] కొన్నికొన్ని సందర్భాలలో పెద్దవారుగా ఉన్నవారుకూడా

కావాలని కాకపోయినా కారణాంతరాలవల్ల పొరపాట్లు చేయవచ్చు. చిన్నవారికి కష్టం కలిగినపుడు కొంచెము సానుభూతితో ఆలోచించాలిగాని సర్వీసు rules కు విరుద్ధంగా శాసనసభ్యులకు చెప్పుకొన్నారు కాబట్టి disciplinary action తీసుకొంటామనడం సక్రమమైన మార్గంకాదు. జరుగుతున్న అన్యాయాన్ని తొలగించండి. ఇప్పుడు జీతాలు పెంచాలంటే సాధ్యమయ్యే విషయంకాదు అని మన అందరికి తెలిసినదే. వారు కూడా మనకు విశ్వాసపాత్రులైన సేవకులుగా వ్యవహరించడానికి ఎన్ని అవకాశాలున్నాయో వాటన్నిటిని పరిశీలించాలి. వారిలో కట్టుబాటు, క్రమశిక్షణ ఉన్నదని నేను చెప్పడంలేదు. వారంతా మేము 10 కాగితాలుకూడా చూడలేకుండా పోతున్నామని అంటున్నారు. కాగితాలన్నీకూడా pigeon hole లోనే పెట్టామని అంటారు. School Final వాళ్ళను, Ministerial service వాళ్లను Law graduates ను clerks గా పెడితే ప్రజలనుంచి వచ్చినకాగితాన్ని సరిగా అర్థంచేసుకోలేక, కొన్నికొన్ని పరిస్థితిలో ఏదో disposal ఇచ్చి మామూలుగా క్రిందికి పంపించివేస్తారు. A. S. కూడా చూచిచూడకుండా దానిమీద సంతకం చేస్తాడు. అది Deputy secretary level కి వెళ్లదు. Secretary level కి వెళ్ళదు. అవసరమైన కాగితా లేవో ప్రభుత్వం నిర్ణయంచేయనటువంటి సందర్భంలో కూడా ఏదో disposal ఇచ్చి క్రిందికి పంపించివేస్తే క్రింద lodge చేసిన సందర్భాలు ఎన్ని కావాలంటే అన్నీ మీదృష్టికి తీసుకురావడానికి నేను సంసిద్ధంగా ఉన్నాను. Service Rules ను అమలుజరిపేటప్పుడు సిబ్బందికూడా జాగ్రత్తగా పని చేస్తున్నదా లేదా అనేవిషయాన్ని మనం ఆలోచించవలసి ఉన్నది. సిబ్బందికూడా కట్టుబాటుగా పనిచేయాలి. Coffee hotel కు వెళ్లికూర్చుని రెండేసిగంటలు కాలక్షేపముచేస్తారు. వారుకూడా సరిగా పనిచేయడంలేదు. కాబట్టి సిబ్బంది విషయంలోకూడా చాల జాగ్రత్తపడవలసిన అవసరం ఉన్నది.

ప్రజలలోనుంచి వచ్చి, ప్రజలమంచికే చదువులు చదువుకొని, ఇక్కడే ఉద్యోగానికి వచ్చినతరువాత, ప్రజలకు నాకు సంబంధములేదు అనుకొనేటటువంటి ధోరణితోటి ఈ ఉద్యోగులు ప్రవర్తించడంవల్లనే ఈవేళ ప్రజలు ఇన్ని బాధలు పడవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. నేను clerk గా ఉండగా అక్కడ ఒక scheme అయినా అమలుజరిపి ఒక వంద మందికైనా ఒక వృత్తి కల్పిస్తాను అనేటటువంటి ఆలోచనతోటి, ఏ lower division clerk గాని, upper division clerk గాని పనిచేయవలసిన అవసరమున్నది. కాని వారికి ఈనాడు ఆ ధోరణి లేదు. వారి ధోరణిలో ఈ మార్పు రావాలి. వారి ధోరణిలో మార్పువస్తేతప్ప, వారికికూడ భవిష్యత్తు లేదని నేను మనవిచేస్తున్నాను. మీకేళ్లో

Sri Pragada Kotaiah] [24th March 1956

promotions వ్యవహారంలో అన్యాయం జరిగిందని ఏదోవిధంగా మాకు తెలిసి మేము ఆ విషయంగురించి నిజము చెప్పినంతమాత్రంచేత మీరు చేసే ప్రతిఒక్క పనిని మేము సవరిస్తామని అనుకోవడం చాలా పొరబాటు. అందువల్ల సిబ్బందిలో కూడ మార్పువచ్చి, మేము ఈ ప్రభుత్వానికి, ఈ ప్రజలకు సేవకులము అనేటటువంటి నీతి నిజాయితీలతోటి వారు ప్రవర్తించినప్పుడే ఈ రాష్ట్రములో ఉన్నటువంటి ప్రజలందరికిగాని, దేశము మొత్తంమీద ప్రజలందరికిగాని సహాయం జరుగుతుందేతప్ప లేకపోతే జరుగదు. Promotion విషయంలో మేము ఏదో చెప్పాము. కాబట్టి నాకు 10 రూపాయల జీతమువస్తే చాలును అనుకొనేటటువంటి ధోరణిమాత్రము దేశానికి క్షేమకరం కాదు. ఏ కులానికి చెందినా, ఏ వర్గానికి చెందినా, ఏ జాతికి చెందినా పదిమందికి promotion వచ్చినంతమాత్రంచేత, ఈవేళ దేశానికి ఏదో మంచి వస్తుందనేటటువంటి ఆలోచనకూడ నాకేమి లేదు. కాబట్టి ఎవరి ధర్మాన్ని వారు జాగ్రత్తగా నిర్వహించాలి. పరిపాలకులుగా ఉన్నంతకాలము, ముఖ్యమంత్రి గారు కూడ ఈ విషయాలు చాలా సానుభూతితోటి పరిశీలనచేయాలి గాని, ఏదో ఒక్కవిషయాన్ని వారిదృష్టికి తెచ్చినప్పుడు దాన్నిగురించి Secretariat లో వారు ఏమిచెప్పితే ఆవిధంగా దాన్ని చూచి చూడక అనుసరించే పద్ధతిమాత్రం సరియైనది కాదు. పరిపాలనావిధానాన్ని నిజమైనటువంటి ప్రజాస్వామికముగా రూపొందించ వలసియున్నదని అర్థిస్తూ సెలవుతీసుకొంటున్నాను.

SRI P. VENKATASUBBAYYA :—ఉపాధ్యక్షా, మహాశయా! మంత్రిగారు ప్రవేశపెట్టినటువంటి ఈ supplementary demands ను నేను బల పరుస్తూ కొన్ని సూచనలుమాత్రము చేస్తున్నాను. ప్రథమంలో ఆదాయవ్యయ పట్టిక తయారుచేసేటప్పుడు, ఆ సంవత్సరంలో రాబోయేటటువంటి ఆదాయమెంత, ఖర్చు ఎంత అని సరియైనటువంటి అంచనాలు వేసుకొన్నట్లయితే సంవత్సరాంతములో ఎక్కువ ఖర్చు జరగడంగాని, మిగులు ఉండడంగాని తటస్థించదు. ఒకొక్క సమయంలో అనివార్యమైన కొన్ని ఖర్చులు జరుగుతూవుంటాయి. అప్పుడు ఈ supplementary demands అసెంబ్లీముందుకు రాకుండానే ప్రభుత్వంవారు ఖర్చుపెట్టడానికి సాహసించి ఖర్చుపెడుతూ ఉంటారు. ఆ విధంగా ఖర్చుపెట్టిన దంతా తరువాత శాసనసభ ఆమోదాన్ని పొందవలసి యుంటుంది. కనుక ఈ ఖర్చులు supplementary demands రూపములో ఈ శాసనసభముందుకు తెస్తూ ఉంటారు. ఈదినము ప్రవేశపెట్టినటువంటి ఈ supplementary demands లో కొన్ని అనవసర ఖర్చులుకూడ చేర్చబడినాయని నేను మనవిచేస్తున్నాను. ముందు, Demand No IV Forests లో item (1) క్రింద revision of codes and manuals కొరకు రెండు additional section లు, ఒక Special Officer ను

చేయడం జరిగింది. ఈ codes and manuals ను సంవత్సరం మధ్యలో revision చేయకపోతే, మించుకు పోయేదేమిలేదు అని నా అభిప్రాయము. సంవత్సరం అయిపోయినతరువాత, ఇప్పుడు ప్రవేశపెట్టిన కొత్త సంవత్సరపు బడ్జటులోనే అదంతా కూడా చూపించి ఉండవలసింది. తరువాత Grant VII (general sales tax)లో, item (3) క్రింద, 'temporary establishment was sanctioned for three months to revise commercial taxes manuals' అని ఉన్నది. తరువాత Grant XII-Administration of Justiceలో items 3 and 4 క్రింద District Munsiffs కు training ఇచ్చారని ఉన్నది. ఈ training లో ఉన్నటువంటి అధికారులకు జవానులు ఇవ్వడం సబబే, అది ఒప్పుకోవచ్చు. కాని గుమాస్తాలను ఇవ్వవలసిన అవసరమేమి అంటాను? ఈ గుమాస్తాల ఖర్చులుగూడ ఇందులో పొందుపరచబడినవి. Grant XIV Police-లో, Prohibition శాఖను Police శాఖలో కలపడం 15—1—1956 తేదినుంచి అమలు పరచారు. ఈ విధంగా, సంవత్సరం మధ్యలో అది అమలుపరచడంద్వారా దానికి అయినటువంటి ఎక్కువ ఖర్చులు ఈ supplementary demands లో చూపించారు. అది ఆవిధంగా జనవరి మొదటి తేదినుండి అమలు జరుపకుండా ఏప్రెల్ మొదటి తేదినుంచి చేసివుంటే బాగుండేది. దానివల్ల కష్టమేమిలేదు. కనుక ముందు బడ్జెట్ లోనే సవ్యంగా అంచనాలు వేసుకోకుంటే, మధ్య మధ్యన ప్రభుత్వము తాము తలమకొన్నట్లు కొన్ని పనులు కల్పించి, శాసనసభముందు రాకుండానే ఆ పనులుచేస్తూ ఇప్పుడు శాసనసభ ఆమోదానికి వాటిని మా ముందుపెట్టడం ఉత్త farce అనిపించుకొంటుందే తప్ప మరేమికాదు. ఏదో అనివార్యమైన పరిస్థితులలో ఏదైనా మధ్యలో ఖర్చుపెట్టవలెనేగాని, శాసనసభలో చర్చ జరుగవలసినటువంటి ముఖ్యమైన విషయాలన్నీకూడ ఈ supplementary demands లో తీసుకు రావడం, అంత సమంజసంగా ఉండదని నా అభిప్రాయము. ఈ సందర్భంలో ముఖ్యంగా రెండు, మూడు విషయాలు మీదృష్టికి తీసుకొని వస్తున్నాను. మా నియోజకవర్గమైన రాజంపేట తాలూకాలో కోమూరుదగ్గర వాగేటికోన ప్రాజెక్టు అనేది ఉన్నది. దానికి పరిశీలనకూడ జరిగిపోయింది. అటువంటిది ఈ supplementary demands లో, నూరు రూపాయలు token grant క్రింద అయినా చూపించి దీన్ని మేము అమలు జరుపుతాము అనేటటువంటి సూచనచేసి ఉన్నట్లయితే చాలా సమంజసంగా ఉండేది. తరువాత బావనగడ్డి ప్రాజెక్టు అని ఇంకొకటి ఉన్నది. అది చెయ్యేరు Reservoir scheme అని ఇప్పుడు అమలు పెడుతున్నారు. ఈ చెయ్యేరు reservoir scheme అనేది Chief Engineer వరకు వెళ్ళి అక్కడ final-గా investigation కూడ అయిపోయింది. దానిని ఇప్పుడు అమలు

Sri P. Venkatasubbayya] [24th March 1956

పెట్టడానికి ఏమి ఆటంకములేదు. అక్కడ ఈ చెయ్యేరు reservoir scheme ద్వారా left canal అని, right canal అని రెండు కాలవలు వస్తున్నాయి. Right canal అనేది ఒంటిమిట్ట చెరువుకు చాలా అమూల్యమైనటువంటి జలాన్ని సేకరించడానికి ఉపకరిస్తుంది. ఆ ఒంటిమిట్ట చెరువు క్రింద ఉన్న రైతులందరు కూడా "అయ్యో రామచంద్రా" అంటూ, పైరులు పండక కరువు కాటకాలకు గురి అయి చాలా బాధలుపడుతున్నారు. ప్రభుత్వము దీనిని గుర్తించి ఒక నూరు రూపాయల token grant క్రిందైనా ఈ చెయ్యేరు reservoir scheme ను చూపించి ఉంటే చాలా సంతోషించి ఉండే వాళ్లము. ఇంకా minor investigation క్రింద అనేక జిల్లాలలోకూడ చెరువులు మరమ్మతు లేకుండాపోతూ ఉండడం, శాసనసభ చర్చలలో అనేక పర్యాయాలు సూచించబడింది. ఈ చెరువులు అక్కడక్కడ పాడైపోయి ఉండడం, అక్కడ ఉన్నటువంటి రైతులు నీటి సరఫరా లేకుండా, పైరులు పండక చాలా కష్టపడుతూ ఉండడం జరుగుతూ ఉన్నది. ఇది ప్రభుత్వానికి తెలుసు, కనుక అటువంటి వాటిని ఈ supplementary demandsలో ఏదో token grants క్రింద అయినా చూపించి, లేక అవసరమైనటువంటి చెరువులకు ఖర్చుపెట్టి మరమ్మత్తులు చేయించి, వాటికంతకు నీటిని కల్గించి, ప్రజలకందరికి సుఖము కలిగించేటట్లుగా, పైరులు పండేటట్లు ఏర్పాటుచేసి ఉంటే ఈ supplementary demands చాలా బాగుండేవి, కాని అటువంటిదేమి వీటిలో చూపించకుండా, ఇక్కడ కొన్ని అనివార్యమైన ఖర్చులు ఉన్నాయనుకోండి, కనుక వీటన్నిటిని ఆమోదించండి అనడం అంత సమంజసంగా లేదు. అనివార్యమైన ఖర్చులు అయితే, అవి చేయవలసిందే. ఇప్పుడు పోలీసు డిపార్టుమెంటులో కొన్ని అనివార్య ఖర్చులు క్రింద చూపించారు. తరువాత నాగార్జునసాగర్ ప్రాజెక్టుక్రింద, దిగువ కాలవక్రింద, దిగువసగిలేరు ప్రాజెక్టు క్రింద కొన్ని అనివార్యమైన ఖర్చులు ఈ Supplementary demands లో చూపించబడినాయి. అవన్నీ కూడ బలపరుస్తూ ఉన్నాము. వాటికేమి అక్షేపణలేదు, కాని అనివార్యముకాకుండా, అనవసరమైన ఖర్చులు కొన్నిచేసి ఈ శాసనసభముందు పెట్టి sanction చేయవలసిందని కోరడం అంత సబబుగా ఉండదు.

తరువాత సంవత్సరాంతములో Public Accounts Committee సమావేశం అయినపుడు, వారు ఇవన్నీ పరిశీలించి, excess గా ఖర్చు చేయబడినవి, final appropriations కు మించి ఖర్చుచేయబడినటువంటివి చూపించడం జరుగుతూ ఉంటుంది ఆ అక్షేపణలన్నీ సరిదిద్దుకోడానికి Accountant-General గారు 1948-49 సంవత్సరములో కొన్ని objectionable amounts ను ఏమి చేయాలో తోచక, వాటిని write off చేయవలసిందనికూడ ఈ supplementary

demands లో కడపటి పుటలో సూచించారు. అవన్నీ మద్రాసు ప్రభుత్వము write off చేసింది. ఇక్కడ మన ప్రభుత్వముకూడ write off చేయడానికి supplementary demands లో చూపబడింది ఇటువంటివన్నీ కలుగుతూ ఉంటాయి గనుక బడ్జెటును తయారుచేసేటప్పుడే, రాబోయే ఆదాయమెంత, ఖర్చు ఎంత అని Departmental Heads అందరు సవ్యంగా ఆలోచించి ఇంత ఖర్చు అవుతుందని ఖచ్చితంగా అంచనాలు పంపిస్తే, ఇక్కడ బడ్జెట్ అంతాగూడ సవ్యంగా తయారు కావడానికి అవకాశముంటుంది ఆవిధంగా కాకుండా వాళ్లకు తోచినట్లు వాళ్లు పంపడము, సంవత్సరం మధ్యలో కొన్ని ఖర్చు జరగడం, అవి ఈ విధంగా supplementary demands రూపములో రావడం సరియైనటువంటి పద్ధతికాదు. కనుక అటువంటి లోపాలు కలుగకుండా ఉత్తరోత్తరాఅయినా బడ్జెటును తయారుచేసేటప్పుడు, సరిగా అంచనాలు తెలుసుకొని సరిగా బడ్జెటును తయారు చేయవలసిన అవసరమున్నదనే విషయము మీ దృష్టికి తెస్తూ సెలవు తీసుకొంటున్నాను.

* Sri R. B. RAMAKRISHNA RAJU :—మహాశయా, ఈ Supplementary Demands మీద discuss చేయడం ఎంతవరకు ఉపయోగము, ఇది ఎందుకు ఇంత ఆలస్యంగా రావడం జరిగింది, ఎప్పుడు రావాలి అనే విషయం గురించి రెండుమాటలు చెప్పదలచుకున్నాను. ఈ supplementary demandsలో Revenue Account క్రింద 2,17,50,000 రూపాయలున్నూ, other expenditure క్రింద 6 కోట్లు, మొత్తం అంతాచేరి 8 కోట్లు చిల్లర రూపాయలు చూపబడింది. ఇవన్నీ ఖర్చు అయిపోయిన మొత్తాలుగాని ఇకముందు ఖర్చు కాబోయే మొత్తాలుకావు. ఈ సంవత్సరం అంటే 1955-56 లో ఈవిధంగా 8 కోట్ల రూపాయలు సభయొక్క అనుమతిలేకనే ఖర్చు అయిపోయింది. దీన్నిమీరు ఒప్పుకోండి అని మనలను అడుగుతున్నారు. దీనికి నిబంధన rules ఏమి ఉన్నాయి అనే విషయం మాత్రము మీ దృష్టికి తీసుకొనివస్తున్నాను. మన అసెంబ్లీ రూల్సులో, Rule 133 లో ఈవిధంగా ఉన్నది.

"The Governor may, at any time during the financial year, allot a day for the presentation of a statement of supplementary or additional expenditure, when

(i) the amount authorised by the Appropriation Act for a particular service for any financial year is

Sri R. B. Ramakrishna Raju] [24th March 1956

found to be insufficient for purposes of that year ; or

(ii) a need arises during the current financial year for expenditure upon some new service not contemplated in the budget of that year."

ఇప్పుడు బడ్జట్ లో వేసిన పద్దుమొత్తము చాలకపోయినా, లేకపోతే బడ్జెటులో లేనటువంటి కొత్త services ఏదైన వచ్చినట్లయితే దానికి కావలసిన మొత్తము supplementarys demands గా తీసుకురావచ్చును కాని ఇప్పుడు ఈ 31 తేదీలో ఈ financial year పూర్తికాబోతూ ఉంటే, ఈదినము, 24 వ తేది, ఈ ఖర్చుఅంతా తీసుకువచ్చి మాముందు పెట్టి దీన్ని discuss చేయండి అంటే, అది ఏమని discuss చేసేదో, ఈ discussion వల్ల ఏమి లాభముంటుందో అనే విషయాన్ని మీ దృష్టికి తెస్తున్నాను. ఇప్పుడు దీంట్లో excess expenditure అంటే, 1955-56 Budget లో వేసినటువంటి పద్దుకంటె జాస్తి అయినవి కొన్ని, తరువాత కొత్తగా, new services క్రింద, ఏర్పాటుచేసి ఉన్నారు.

మచ్చుకు రెండుమూడు ఉదాహరణలు చెబుతున్నాను. పోయిన జూలై నెలలో బడ్జటు సమావేశమైంది. ఇప్పుడు యింకొక బడ్జటు సమావేశము అయింది. పోయిన బడ్జటులోనే కొన్ని items చేర్చి ఉండవచ్చు. పోనీ, అప్పుడు కాకపోయినను యీ బడ్జటులోనైనా ఆ items చేర్చి ఉండవచ్చునుగదా. కాకపోతే పోయిన సంవత్సరాంతము లోపలనైనా కొన్ని అయిటములను ప్రత్యేకంగా తీసుకొనివచ్చి ఉండవచ్చు. ఇప్పుడు Demand No. X-State Legislature అని ఉన్నది. దీనిక్రింద 12,41,000 రూపాయలు యిప్పుడు supplementary demand అడిగి ఉన్నారు. దీనికి కారణము గా buildings కొన్ని కొత్తగా కట్టడానికి, furniture supply చేయడానికి, mikes వగైరాలు పెట్టటానికి, వీటి అన్నింటికిగూడ ఖర్చు అయింది, అది యిప్పుడు గ్రాంటు చేయమని అంటున్నారు. 1955 వ సంవత్సరములో మనకు elections జరిగినవి. ఆసందర్భములో కొంత మందికి T.A. ల క్రింద సుమారు ఆరు లక్షలవరకూ యివ్వవలసి యున్నది. అది అప్పుడు యివ్వకుండా April నెలలో యిచ్చామని చెబుతున్నారు, April నెల జరిగిన తరువాత 6,80 వేలు యిచ్చామనిచెప్పారు. April నెలలో యిచ్చిన పద్దు, జూలై నెలలో యిచ్చిన పద్దు, యివి రెండూకూడ జూలై నెలలో ప్రవేశపెట్టిన బడ్జటులో ఎందుకు చూపబడలేదు అని అడుగుతున్నాను. దీనికి సమాధానము ఆర్థిక మంత్రిగారు చెప్పగలరని అనుకుంటాను. ఆ items of expenditure అంతా Accountant General కు పోవాలి, అదిచేయాలి. యిదిగాక

24th March 1956] [Sri R. B. Ramakrishna Raju

వారి కాంక్షను కావాలి, వీరి కాంక్షను కావాలి, అనే యిటువంటివి ఏవో కొన్ని కారణములు చెప్పితే ప్రయోజనములేదు దాని క్రింద సుమారు యింత అవుతుందని ఒక అంచనా అయినా తెలుసుకొని చెప్పవచ్చును గదా! మన estimates ప్రకారము July నెలలో మన ముందుకు బడ్జటు వచ్చినప్పుడు, ఈ కారణంచేత, యింత సొమ్ము ఖర్చు కాలేదు దానికి యింత ఖర్చు చేయవలసియున్నది, యీపద్దులో యిప్పుడు మేము బడ్జటులో చేర్చిఉన్నాము అనికూడ చెప్పి ఉండవచ్చును గదా! ఆ విధముగా చెప్పకుండా, అవి అట్లాగే నిలిపిఉంచి, యిప్పుడు యీ మార్చి బడ్జటులో తీసుకొని వచ్చినట్టుగా ఏర్పడుతున్నది.

రెండవ విషయము ఏమిటంటే, Grant No. XXXI క్రింద 12 వ item చూడండి. Supplementary Demands చూపించే బుక్కులో 29 వ page లో కొన్ని items ఉన్నవి. అవి చదువుతున్నాను.

(1) Basic Agricultural School, Nandyal from 1—2—1955.

(2) Basic Agricultural School, Bapatla from 1—1—1955.

(3) Basic Agricultural School, Anakapalle from 1—8—1955.

(4) Double shift Extension Training Centre, Kalahasti from 1—8—1955.

(5) Basic Agricultural Wing, Kalahasti from 1—8—1955.

(6) Basic Agricultural Wing, Gopannapalem from 1—8—1955.

(7) Home Economics Wing, Samalkot from 4—8—1955.

(8) Workers group attached to Samalkot Centre from 1—9—1955.

(9) Group Level Workers Training Centre from 15—10—1955.

దీనిని బట్టి 1st January 1955 మొదలు 15th October 1955 వరకూ కొన్ని కొన్ని సంస్థలు ఏర్పాటు అయినవి కాబట్టి వాటి క్రింద ఖర్చుఅయిందని అంటున్నారు. 1st January లోపున అయిన ఖర్చుకూడ యింతవరకు

మాకు ఎందుకు చెప్పకూడదు? దానికి కావలసిన అంచనా "ఈ ప్రకారము మేము చేయబోతున్నాము. దీనికింత కావాలి, ఇన్ని training centres మేము పెట్టబోతున్నాము, దానికింత ఖర్చు అవుతుందని" July లోనో, August లోనో September లోనో December లోనో మాకు చెప్పియుండవచ్చునే! అలాంటిది ఏమిచేయలేదు. అసలు ఈ బడ్జెటుయొక్క revised estimates క్రింద ఖర్చుచేసిన మొత్తాలు new services క్రిందచేర్చియుండవచ్చును. కాబట్టి నేను మనవిచేసేది ఏమిటంటే, నిజముగా యిక్కడ మనము జరిపే చర్చఫలవంతము కావాలంటే దానికి ప్రయోజనం వుండాలిఅంటే, ఈ సొమ్ము ఖర్చుచేయక మునుపే మాకు చెప్పియుంటే మంచిదని నా అభిప్రాయము. ఇది యిప్పుడే కాదు. ఈ విషయము ప్రతి సంవత్సరము కూడా బడ్జెట్ సమయములోగాని, ఈ supplementary demands తీసుకొచ్చేటప్పుడుగాని, సంవత్సరాంతములోనే అవి చెప్పడం జరుగుతున్నది. ఇది సరియైన పద్ధతి కాదు. ఎప్పుడైతే మీకు new services క్రింద ఖర్చుచేయవలననివుంటుందో ఎప్పుడైతే excess expenditure అవసరం అని తోస్తుందో, అప్పటికప్పుడే ప్రత్యేకంగామాదృష్టికి తీసుకొని రావటానికి అక్షేపణలేదు. ఖర్చుచేసేముందుగానే అవి మా ముందుపెట్టి, దానికి ఆమోదము పొందితే బాగుంటుందని, ఈ ప్రభుత్వానికి క్రిందటి ప్రభుత్వానికికూడ అనేకసార్లు మేము చెప్పిఉన్నాము. కాబట్టి ప్రభుత్వానికి మేము చెప్పేది ఏమిటంటే, మన rules లోకూడ చివరవరకు ఆపివుంచి సంవత్సరాంతములో తీసుకొని రావటానికి అభ్యంతరమువుండేటట్లు నమోదుచెయ్యబడలేదు. ఎప్పుడైతే ప్రభుత్వానికి జాస్తిగ సొమ్ము కావలసివుంటుందో, ఎప్పుడైతే excess expenditure అవుతుందని తోస్తుందో అప్పటి కప్పుడు మాదృష్టికి తీసుకురావటానికి ఆక్షేపణ యేమీలేదు ఆమాదిరిగా తీసుకొని వచ్చినట్లయితే మేము వాటినిసాంగోపాంగముగ విమర్శించటానికి, ప్రభుత్వానికి మా అభిప్రాయము చెప్పటానికి, అవి ప్రభుత్వము అమలు జరపటానికి, ప్రయోజనకరముగ ఉంటుంది.

135-వ rule లో "If any money has been spent on any service during a financial year in excess of the amount granted for that service and for that year, the Governor shall cause to be presented to the Assembly a Demand for such excess." అని ఉంది.

అంటే అన్నికూడ సంవత్సరాంతమువరకు నిలిపివుంచితే అది దేనికో కూడ అర్థముకాదు. ప్రభుత్వానికి మా సలహా ఏమిటంటే పోయిన

సంవత్సరం Budget లో 8 కోట్ల రూపాయిలు revenue expenditure క్రింద బహుశ 15, 16 కోట్ల రూపాయిలు capital account క్రింద వచ్చింది. అంటే మొత్తముమీద 40 కోట్ల రూపాయలలో ఎంతో వచ్చింది. ఈ 40 కోట్లరూపాయలలో 8 కోట్ల రూపాయలు మనకు తెలియకుండానే excess గా ఖర్చు అయినది. ఇప్పుడు దీనిని గురించి చర్చించితే ప్రయోజనం ఏమి? ప్రభుత్వం యిదివరకే ఈ సొమ్మును ఖర్చుచేసింది కాబట్టి దీనిని మేమువిధిలేక ఆమోదించవలసి వచ్చింది. ఈ డబ్బు దుబారా గా ఖర్చుచేశారని మేము చెప్పినప్పటికినీ, అది నిజముగ దుబారా ఖర్చు అయినప్పటికినీ, అది ఎవరు యిచ్చుకుంటారు కాబట్టి ఈ ఖర్చులు supplementary demands ద్వారా చూపించటానికి నిలిపివుంచేబదులు ఈ ఖర్చులు main budget లోనే తీసుకొనివస్తే బాగుండేది అయితే దీనిలో రెండు విషయాలున్నవి మొదటి budget ను prepare చేసేటప్పుడు చక్కగా ఈ items అన్నీ చూపిస్తూ తయారుచేయుట, రెండవది new services క్రింద ఏవైనా అపాంతర ఖర్చులు వస్తే అటువంటివాటిని అప్పటికప్పుడు సభ్యులకు తెలియజేయడం మంచిది. ఆ విధంగాచేస్తే అవి పరిశీలించిమేము ఏవైనాసలహాలు చెప్పటానికి వీలు అవుతుంది అవి ప్రయోజనకరంగాగూడ వుంటాయి కాబట్టి యిటువంటి పద్ధతి యికముందు అయినా ప్రభుత్వం అవలంబిస్తే మంచిదని అంటున్నాను. వచ్చే సంవత్సరంనుంచి అయినా ఆ విధంగాచేస్తే సంతోషిస్తాము. అంతేగాని ప్రభుత్వము ముందుగానే సభయొక్క ఆమోదము పొందకుండా ఖర్చు చేసి, ఇప్పుడు అవి మాముందుపెట్టి ఆమోదించమని కోరినప్పుడు, మేము అఖర్చు ఆమోదించము అని చెప్పటానికి సాధ్యముగాకుండపోతున్నది. అదే నేను ఒకసారికి రెండుసార్లు ప్రభుత్వానికి చెపుతున్నాను. ఈ ప్రకారముగా ముందు ఖర్చుచేశాము, ఈఖర్చు ఆమోదించండి, అని చెబితే ప్రయోజనంలేదు. Police Demand లో గూడ new services క్రింద ప్రతిసంవత్సరము ఖర్చులు వస్తూనేవున్నవి. New services కావాలని కోరినప్పుడే ఎందుకు demand పెట్టగూడదు. ఇంత ఖర్చు అవుతుందని నిష్కర్షగా తెలియకపోయినా, అందాజాగా నైనా యింత అవుతుందని మాకు చెప్పవచ్చునుగదా! Financial resources వద్దు March Budget లో వస్తుంది. మార్చినెల పూర్తికాకముందే Revised Budget కూడ వస్తుంది. కాబట్టి ఈ తొమ్మిదిమాసములలో యిటువంటి excess ఖర్చులకు మాయొక్క అనుమతి తీసుకొనివుంటే, అవన్నీ revised budget లో రావచ్చును. దానికి మాకేమి ఆక్షేపణలేదు తరువాత రాబోయే సంవత్సరపు Budget ను యిప్పుడు చర్చిస్తున్నాము. State Legislature

Sri R. B. Ramakrishna Raju] [24th March 1956

క్రింద 12 లక్షల రూపాయలు, Police క్రింద 22 లక్షల రూపాయలు Co-operation క్రింద 7½ లక్షలు, Local administration and Prohibition క్రింద ఇంచు మించుగ 10 లక్షల రూపాయలు, Miscellaneous క్రింద 15 లక్షలు చూపించబడ్డవి. ఇవిగాక Planning క్రింద 1 కోటి 8 లక్షలు చూపించారు. ఇవన్నీ గూడ Revenue Account క్రిందనే వస్తూవున్నవి. ఇంక ఈ supplementary demands విషయంలో ఎక్కువగా నేను చెప్పదలచుకోలేదు. ప్రభుత్వమువారు యికముందు అయినా ఈ supplementary demands ద్వారా excess expenditure తీసుకొనివచ్చినప్పుడు ఆ సంవత్సరములో అవి ఖర్చుచేయకమునుపే ఎప్పటికప్పుడు మాదృష్టికి తీసుకొనివచ్చి, వాటికి మా ఆమోదమును ముందుగా పొందితేనే బాగుంటుంది అని ప్రభుత్వానికి సలహాచెపుతూ నేను యింతటితో విరమిస్తున్నాను.

Sri K.V. RAMANAIAH NAIDU:-ఉపాధ్యక్షమహాశయా! Supplementary demands ను గురించి గౌరవనీయులైన రామకృష్ణరాజుగారు చెప్పిన పద్ధతి యికముందునుంచి ప్రభుత్వము అవలంభిస్తే, అది అందరికీ శ్రేయస్కరముగా ఉంటుంది. ఈ డిమాండ్లను సంవత్సరాంతములో తీసుకువచ్చి, సభయొక్క ఆమోదము పొందటానికి ప్రవేశపెట్టుతున్నారు. ఇందులో ఖర్చుచేసిన మొత్తములకు ముందుగా సభయొక్క ఆమోదమును పొందలేదు. సభయొక్క ఆమోదమును పొందకుండా ఖర్చుచేయడము సరియైన పద్ధతికాదు. ఎలాగైనా యీ మొత్తము ఖర్చు చేయబడినది కాబట్టి, యిప్పుడు వీటినిసభ ఆమోదించవలసిన అవసరమువచ్చింది. అయితే రామకృష్ణరాజుగారు చెప్పినట్లుగా యిదివరకే యీ మొత్తములు అన్నికూడా ఖర్చు చేయకముందు, ఏనెలకు ఆనెల అవి Revised Budget లో వేయకపోవడమునకు కారణము సహేతుకముగా లేదు. Revised Budget లో వేసినట్లయితే, అప్పుడు ఆ ఖర్చులయొక్క అవసరాలనుగురించి మాట్లాడటానికి సభ్యులకు వీలుగా ఉండేది. అటువంటి అవకాశము లేకుండా పోయింది. ఇప్పుడు యీ ఖర్చులు అన్నీ supplementary demands ద్వారా యింతవరకు ప్రభుత్వము సంవత్సరము పొడుగునా సభయొక్క ఆమోదము లేకుండా ఖర్చుచేస్తూవచ్చారు. రామకృష్ణరాజుగారు చెప్పినట్లుగా యీఖర్చులు ఎప్పటికప్పుడు, వాటి అవసరాలనుగురించి తెలుపుతూ సభ యెదుటపెట్టి, సభవారి ఆమోదము పొందినట్లయితే, యిప్పుడు యీ డిమాండ్ల విషయములో యింతగా విమర్శించనవసరము లేకుండా పోయేది. వాటియొక్క అవసరములు సభ్యులు తెలుసుకోగలిగియుండేవారు. అటువంటి అవకాశము సభ్యులకు కలుగచేయకుండా ప్రభుత్వము యింత సొమ్ము ఖర్చుచేశారు ఈ ఖర్చును ఆమోదించమని అడగడము సబబుగాలేదు. ఈ సొమ్ము ఖర్చుచేయడము జరి

గింది గనుక, యీసారికి ఎట్లాగో అట్లా దీనిని ఆమోదించవలసిన అవసరము ఏర్పడ్డది. ఈ items అన్నీ ఆమోదించక తప్పలేదుగనుక ఆమోదిస్తున్నాము. వాస్తవముగా యింతసొమ్ము ప్రభుత్వము ఖర్చుచేయవలసిన అగత్యములేదు. ముందుగా ఖర్చుచేయడము, తరువాత ఆమోదించండి అని కోరడము సబబుగా లేదు. ఏఖర్చు అయినప్పటికినీ, ప్రతి ఒక్క item కుగూడ సభయొక్క ఆమోదము ముందుగా పొందడము ముఖ్యావశ్యకము అని అంటున్నారు. ఇకముందైనా ప్రభుత్వము యీ పాత పద్ధతిని విరమిస్తారని ఆశిస్తున్నాము ఈ విధముగా చేయడము సభయొక్క హక్కు తీసివేసినట్లే అగుచున్నది. ఈ ఖర్చులయొక్క అంచనాలు ముందుగా సభ ఎదుటపెట్టక పోవడమువల్ల, వేటికి ఎంతఖర్చో తెలియకుండా ఉన్నది. ఈ supplementary demands లో ముఖ్యంగా నేను చెప్పదలచుకొన్నది ఒక అయిటము ఉన్నది. అది "Separation of Judiciary from the Executive" అనేది. మన పొరుగురాష్ట్రములో యీ స్కీముకు అన్ని జిల్లాలలోనూ అమలులో పెట్టారు. అట్లాంటిది మన రాష్ట్రములో ఉన్న 11 జిల్లాలలోనూ మూడుజిల్లాలు అనగా తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలలో తప్ప మిగిలిన జిల్లాలన్నిటిలోనూ ప్రవేశపెట్టబడింది ఈమూడు జిల్లాలలోను ప్రభుత్వను ప్రవేశపెట్టలేదు. ప్రభుత్వాన్ని అడిగితే, ఆర్థికభావముఅని సమాధానము చెబుతున్నారు రాష్ట్రములో 8 జిల్లాలలో యీ స్కీములను ప్రవేశపెట్టి ముఖ్యమైన మూడుజిల్లాలలో లేకపోవడము శోచనీయము. దీని ఫలితము ఏమిటంటే తూర్పుగోదావరి జిల్లాకు ఈస్కీమును శాంక్షన్ చేశారు. సిబ్బందికొరకు members of the bar నుంచి కొంతమందిని Sub-magistrateగాను కొంతమందిని District Munsifsగాను ప్రభుత్వము సర్వీసుకమిషనుద్వారా మొత్తం 30 మందిని select చేసి training గూడ యిచ్చారు. Training అయినతరువాతగూడా వారిలో ఎవ్వరికీ ఉద్యోగాలు యింతవరకు యివ్వలేదు. అటు కోర్టులోనూ practice వదులుకున్నారు; అక్కడ ప్రభుత్వంలో పనిచేయడమునకు ఉద్యోగములు ఇవ్వలేదు. దీనివల్ల వారికి త్రిశంకుస్వర్గము ఏర్పడ్డది. ఇంకా ఎప్పుడో తప్పకుండా ఉద్యోగాలు వస్తవి అని దినములు లెక్కపెట్టుకుంటూ కాచుకుని ఉన్నారు. ఏదో శాశ్వతముగా ఉద్యోగము దొరుకుతుందనే ఆశతో పుస్తకాలుగూడ అమ్ముకున్నారు. Training అయిన తరువాతగూడా యింతకాలము వారికి ఉద్యోగాలు యివ్వకపోతే ఎట్లా? ఉద్యోగాలు యిచ్చినివారిని retrench చేశారు. అటు వారికి యిచ్చిన ఉద్యోగమూ పోయింది ఇటు training అయినవారికే ఉద్యోగాలు రాలేదు. ఈవిధముగా వుంటే, వారి పరిస్థితి ఏమి కావాలి అని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. కాబట్టి యీ మూడుజిల్లాలలోనూగూడ యీ

Sri K.V. Ramanaiah Naidu] [24th March 1956

“ Seperation of Judiciary form the Executive ” కు సంబంధించిన స్కీముమ అమలుపరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. Public Service Commission యిదివరకే 30 మందిని select చేసింది. Training యివ్వడముకూడ అయింది. ఈ విధముగా ప్రభుత్వపు ఆర్డర్లకొరకు నిరీక్షించుకుని కూర్చున్న candidates కు అందరికి త్వరలో ఉద్యోగాలుయిస్తే బాగుంటుంది. అటు practice లేకుండా, యిటు ఉద్యోగాలు రాకుండ మధ్య వ్రేలాడుతూ, వారియొక్క living కు చాలా ఆటంకము ఏర్పడిందిగనుక, ప్రభుత్వము వెంటనే వాళ్లందరికి ఆర్డర్సు ఇవ్వవలసిందిగా కోరుతున్నాను.

రాష్ట్రం మొత్తంమీద 8 జిల్లాలలో ఈ separation of Judiciary from the Executive అనేది అమలులోపెట్టి మిగతా మూడుజిల్లాలలో పెట్టక పోవడానికి కారణాలేమిటో ఎవరికీ తెలియదు. దాని విషయమై ఎప్పుడూకూడా గవర్నమెంటువారు ఈ సభలో తెలియజేసిఉండలేదు. అందుచేత అది ముఖ్యంగా అమలులోపెట్టి, ఇప్పుడు త్రిశంకుస్వర్గంలో యున్నటువంటి ఈ Judicial Magistrates అందరికీకూడా తిరిగి ఉద్యోగం కల్గేటట్లు చూస్తారని భావిస్తున్నాను. Irrigation grants మీద discussion లో చాలామంది సభ్యులు మాట్లాడినారు. అందులో ముఖ్యంగా Krishna District కు సంబంధించినటువంటిది బుడమేరు project అని, బుడమేరుకు ఒక reservoir కట్టాలని, diversion canal పెట్టాలని, flood works క్రింద ఆ బుడమేరుయొక్క కట్టలు బలపరచాలనిచెప్పి Chief Engineer, తక్కిన Engineers sanction చేసినటువంటిది దానికి పునాదికూడా వేస్తామనిచెప్పి ముహూర్తంకూడా నిశ్చయించి చివరకి ఆ ముహూర్తాన్ని cancel చేసి పునాది వెయ్యకుండా చేశారు. దానికి కావలసినడబ్బు యావత్తూకూడా Government of India దగ్గరనుంచి వస్తుంది. డబ్బు Government of India దగ్గరనుంచి వస్తున్నప్పుడు, Chief Engineers, experts అంతాకూడా సుమారు 17, 18 ఏళ్ళనుంచి బుడమేరు project అవసరమని చెబుతూయున్నా, అది అమలులో పెట్టడానికి కావలసినభూములనుకూడా తీసుకోడానికి ఎంతడబ్బవుతుందని 1938 వ సంవత్సరంనుంచి లెఖ్కలువేసి, అప్పటినుంచీ దీన్నిగురించి ఆలోచిస్తూ చేయున్నారు. చివరకి అది అవసరమేననిచెప్పి దీనికి estimates తయారుచేసి, sanction చేసి ముహూర్తంపెట్టి, దాన్నిమానేసి, flood works క్రింద దానికట్టలను బలపరచడంమానేసి, ఒక diversion channel క్రింద 37 లక్షలుమట్టుకు ఖర్చుపెట్టారు. ఈ బుడమేరు ప్రమాదంఅనేది, కృష్ణాజిల్లాలోఉన్న రైతులకే తెలుసును. [illegible]లువచ్చినప్పుడు వేలకొలదీ ఎకరాలు మునిగిపోయి, పంట నష్టమై

పోవడమే కాకుండా రోడ్లన్నీ పాడవడమే కాకుండా, చివరకు కైకలూరు తాలూకా యావత్తూకూడా ఈ బుడమేరువరదనష్టానికి గురికావడమే కాకుండా, గుడివాడ తాలూకాలోనూ, గన్నవరంతాలూకాలోనూకూడా వేలకొలది ఎకరాలలో పంట నష్టమైపోయింది. ఈ Diversion channel కట్టినంతమాత్రాన వరద ప్రమాదంతగ్గి నీరంతా కృష్ణానదిలోనికి వెడుతుందని చెప్పడానికి వీలులేదు. Expert engineers అంతా ఈ resorvior అవసరమని చెబుతున్నారు. ఎవరో ఒక Secretary గారు మాత్రం ఈ Diversion channel చాలునని చెప్పినందువల్ల అది ఒకటేచేయడం సమంజసంకాదు. Secretary గారి opinion, Expert opinion అని చెప్పడానికి వీలులేదు. Engineers అందరూ experts secretary గారు expert ఎప్పుడూకాడు. ఈ Project కు అయ్యేఖర్చు Government of india వారు ఇస్తూంటే ఆ డబ్బును పోగొట్టుకోవడం చాలా శోచనీయం. మొదట వేసుకున్న scheme ప్రకారం దీన్ని అమలులో పెట్టినట్లయితే రెండువిధాల లాభం ఉంటుంది. ఈ Reservoir కట్టినట్లయితే ఈ flood protection కాకుండా Reservoir లో నిలవఉన్న నీళ్లవల్ల అనేకవేల ఎకరాలు సాగులోకి తీసుకురావడానికి వీలవుతుంది. ఆహారధాన్యాలు అధికంగా ఉత్పత్తి అవుతాయి. దేశంమొత్తానికే లాభిస్తుంది. మన ముఖ్యమంత్రిగారు మనకున్న Establishment కొంత తగ్గించి 100 కి 10 రూపాయిలైనా ఈ wasteful expenditure తగ్గించాలని చెబుతున్నారు. కొన్ని wasteful departments ఉన్నాయి. కొన్ని departmentsలో చాలా excess staff ఉన్నది. ఈరెండూ కూడా తగ్గించినట్లయితే 10% expenditure ఐనా మనకు కలిసివస్తుందని చెప్పారు. ఇప్పటికికూడా ఇటువంటి ప్రయత్నాలు ఏమీ చేసినట్లు కనిపించడంలేదు. Wasteful departmentsను తగ్గించి, కొన్ని departmentsలోయున్న excess staffను తగ్గించినట్లయితే మనలోటు బడ్జటును కొంతవరకూ భర్తీచేసుకోడానికి వీలవుతుంది. ఈ పనులన్నీ చేస్తే రైతులమీద అదనంగా పన్ను వేయవలసిన అవసరం ఉండదు. అల్లా కాకుండా ఇంకా కొత్త కొత్త departments ను create చేసి, staff ను పెంచుతున్నారు. అందువల్ల మనకు ఆదాయం రావాలంటే రెండే మార్గాలు మనకు కనబడతాయి. భూమిమీద పన్ను, Seles Tax. మనము ప్రజలకు మేలుచేస్తామని శాసన సభకు ఎన్నికై వచ్చాం. నూటికి 85 మంది రైతులే ఉన్నారు. ఎన్ని పన్నులువేసినా వాళ్లమీదే మనం వేస్తున్నాం. అందుచేత ఈ క్రొత్త మార్గాలు జాగ్రతగా ఆలోచించి రామకృష్ణ రాజుగారు చెప్పిన సూచనలనుకూడా గమనించి అదనపు ఖర్చు కావలసివస్తే అప్పటికప్పుడే శాసన సభలో పెట్టి ఆమోదం

Sri K. V. Ramanaiah Naidu] [24th March 1956

పొంది అమలులో పెడితే బాగుంటుంది. కాని అంతా ఖర్చు పెట్టిన తరువాత ఇది sanction చెయ్యండి అంటే, మేము sanction చెయ్యం అనడం సమంజసం కాదు. ఖర్చు పెట్టిన తరువాత గవర్నమెంటువారు ఈ ఖర్చు అవసరం అనుకున్నారంటే, అవసరం ఉన్నదా, లేదా అని ఆలోచించుటకు శాసన సభ్యులకు అవకాశం లేకుండా చేస్తున్నారు. అందుచేత ఈ ఖర్చులను వెంటనే శాసన సభలో పెట్టి మంజూరు ఐన తరువాత వాటిని ఖర్చు పెడదారని ఆశిస్తున్నాను.

Sri A. BAPINEEDU :—ఉపాధ్యక్షా! ఈ Supplementary grants 8 కోట్ల 25 లక్షలు బడ్జటులో షుమారు సగం ఉన్నట్టు కనిపిస్తోంది. ఏదైనా emergency అంటే famine గాని, floods గాని, sudden గావచ్చి దానికేమైనా ఖర్చు పెట్టారా అంటే అదేమీ కనిపించడం లేదు. రోజురోజూ ఈ establishment, చలికంటే ఆవకాయ ఎక్కువన్నట్లు, పెరిగిపోతోంది. ఒక్క department కే ముగ్గురేసి Chief Engineers ని పెంచడం, Superintending Engineers ని పెంచడం జరుగుతోంది. Work మూడు రూపాయిల ఖరీదు కలదైనా establishment 9 రూపాయిల ఖర్చుతో ఆంధ్ర రాష్ట్రం వచ్చిన తరువాత ఖర్చు ఏవిధంగా పెరిగిపోయిందో అందరకూ తెలిసిన విషయమే. ఇదివరకున్న దినదిన గండం నూరేళ్ల ఆయుష్షు ప్రభుత్వం పోయింది. స్థిరమైన ప్రభుత్వం వచ్చింది ఇక ఈ Westeful expenditure అంతా పోతుందని ఆశించాం. కాని ఈ సంవత్సరంలో ఆ ఆశలన్నీ నిరాశలైపోయినవి.

అయితే ఈ సంవత్సరంలో కూడా officialdom bureaucracy, అధికారాలను చలాయించడం ఎక్కువయినదని చెప్పడానికి చింతిస్తున్నాను. ఈ సంవత్సరంలో మన elected representative కాని వారిచేత ఎన్నుకోబడిన మంత్రులు కాని పరిపాలనచేస్తున్నట్లు గుర్తించబడడం లేదని చెప్పడానికి చింతిస్తున్నాను. ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత 13 నెలలు మనం పరిపాలన చేశాము. దినదిన గండం నూరేండ్ల ఆయుస్సుతో M.L.As. ను బ్రతిమాలడమే సరిపోయింది ఇప్పుడు సరిఅయిన ప్రభుత్వం ఏర్పడిందికదా అనుకుంటే ప్రజల సౌకర్యాలను చూడడానికే అవకాశం లేకుండా పోతోంది. ఒక explanation మాత్రం చెబుతున్నారు. బ్రిటిషు గవర్నమెంటు హయాములో recruit అయి బ్రిటిషు officialdom జీర్ణించిపోయిన ఉద్యోగస్థులు మనలను పరిపాలిస్తున్నారు. వారికి ఏమి చెప్పడానికి వీలులేదు అంటున్నారు. పోనీ క్రొత్తగా recruit అయిన I.A.S I.Ps, ఉద్యోగస్థులయినా ప్రజలచేత ఎనుకోబడిన ప్రతినిధులను [illegible] లేకుండా చూస్తున్నారని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను.

ప్రజలచేత ఎన్నుకోబడివచ్చిన మనచేత ఎన్నుకోబడిన మంత్రులు పరిపాలన చేస్తున్నారు. కాని వారు officials చేతుల్లో ఉంటున్నారు. Policy ని dictate చేసే విషయాలు ఏమిటా గాలేవని చెప్పడానికి సందేహంలేదు. Community development blocks వస్తే officers నే వేస్తున్నారు. గవర్నరుగారు వస్తే ఎన్నుకోబడిన ప్రతినిధులకు ఏమి స్థానంలేదని వారికి తెలుసు. ప్రజలచేత ఎన్నుకోబడిన మంత్రులు వస్తే వారికి officers సౌకర్యాలు కలుగచేసి ప్రజలలో తామే ముందున్నామనే అభిప్రాయం కలుగచేస్తున్నారు. వీటన్నింటివల్ల ఎన్నుకోబడినవారు ప్రజలదృష్టిలో చాలా లోకువైపోయారు. District administration లో public works, irrigation లో highways లో జరిగే లోట్లనుగురించి అందరికి తెలుసు. ఎప్పుడూ complaints వస్తూనే ఉన్నాయి. చాలా safeguards ఉన్నాయి; ఏమి చేయడానికిలేదు; writs ఉన్నాయి; పైన ఉన్నాయి; క్రింద ఉన్నాయి అని ఏదో explanation చెబుతున్నారు. రమణయ్యనాయుడుగారు చెప్పినట్లు 85% agriculturists గల దేశంలో వారిచేత ఎన్నుకోబడి ఇక్కడకువచ్చిన తరువాత చేసిన ఘనకార్యం ఏమిటి? Direct పన్నులు వేస్తున్నామని చెప్పవలసియున్నది. ఈ రెండుకోట్ల రూపాయలు పన్నులుగా తీసుకుని రైతులకు ఏమిసౌకర్యాలు కలుగచేశాము? నీటి సంబంధమైన సౌకర్యాలు ఏమి జరుగలేదు. పశ్చిమగోదావరిజిల్లానుంచి 16 మంది వచ్చాము. కాని పశ్చిమగోదావరిజిల్లాకు బడ్జెటులోకాని supplementary budget లో కాని ప్రజాసౌకర్యాలనిమిత్తమై ఒక్కరూపాయి అయినా కేటాయించలేదని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. 16 గురు M. L. As లో 12 గురి Constituencies కి సంబంధించిన ఎర్రకాలువ ముంపు నివారణగురించి ఏమీ చేయలేదు. 70,80 లక్షలు రూపాయలు మాత్రమే ఖర్చు అవుతుంది, లక్షా 50 వేల టన్నులవరకు ఆహారధాన్యాలు వస్తాయని పదేపదే Deputy Chief Minister గారికి Chief Minister గారికి మనవిచేసుకున్నాము. Estimates అవుతున్నాయని చెప్పటంతప్ప token grant అయినా ఇవ్వడానికి ఖాతరుచేయలేదు. రోడ్ల విషయంలోకూడా డెల్టా areas లో చాలా విలంబన జరుగుతోందనికూడా మనవి చేశాము. War time లో emergency works క్రింద కట్టేవారు కొబట్టి మరునాటిసాయంత్రానికే work తయారుకావాలి కొబట్టి 10%, 15% వరకు exemption ఇచ్చేవారు. కాని permanent works కు కూడా ఇదే rule apply చేస్తున్నారు. ఇలా అయితే చాలా అన్యాయం జరుగుతుందని మనవి చేస్తున్నాను. Highways, P.W.D విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలని

కోరుతున్నాను. మనరాష్ట్రాన్ని improve చేయాలని, సౌకర్యాలు కలిగించాలనే భావం ఏ ఉద్యోగస్థుడికి ఇంతవరకు కలుగలేదని చెప్పడానికి సందేహంలేదు. కోట్ల కొలది రూపాయలు ఖర్చు అవుతున్నాయని చెబుతున్నారు. ఎర్రకాలువ స్కీము లేదు సరికదా గోదావరిగట్లు గురించి కూడా ఏమి చేయలేదు. గోదావరిగట్లను గురించి ఒక కమిటీ వేశారు. రెండుకోట్లరూపాయలు Central grants వచ్చినప్పటికి వారు చెప్పినట్లు ఆనకట్టదిగువ గట్లువేస్తే డబ్బు అంతా గోదావరిలో పోసినట్లే. ఒకకోటి ఉద్యోగస్థులకు పోతుంది. ఒకకోటి పని అవుతుంది. మూడవ కోటి కంట్రాక్టరుకు వెళ్లుతుంది. దీనిని emergency work గా కాకుండా మామూలు work గా చేయించాలని ఆనకట్ట ఎగువన కొంత రోడ్డువేసి దిగువ flood relief క్రింద 12 అడుగుల రోడ్డు వేయాలని ఒక రిపోర్టు పంపించాము. ఆపని వెనుకటిప్రభుత్వం ఆపుచేసారు. ఆ రిపోర్టు సంగతి ఆలోచిస్తున్నాము అని ప్రభుత్వంవారు చెబుతున్నారు. కొన్నికోట్ల రూపాయలు తూర్పు పశ్చిమగోదావరి జిల్లా రైతులు ఇస్తున్నారు. ఆ డబ్బును ఇరరచోట్ల ఖర్చుచేయడానికి మాకు ఏమీ అభ్యంతరంలేదు. కాని అవసరమయిన సౌకర్యాలను వరదభీభత్సాన్ని అరికట్టడానికి స్థానికప్రజలకు రోడ్డుసౌకర్యాలు కలుగడానికి చేయవలసియున్నది. ఆ రిపోర్టు ఏమైనదో తెలియటంలేదు. Electricity విషయంలో ఎవరికి నోరుకలదో, స్థోమతు కలదో వారే తీసుకుపోతున్నారనేది ఈ రాజ్యంలో establish అయినది. నోరులేని Members కొంతమంది అసెంబ్లీలో ఉండవచ్చును. వారిరోదనం అరణ్యరోదనమే కాని మరొకటికాదు. పల్లపుతాలూకాలో electricity ఇస్తే fans పెట్టుకోడానికి దీపాలకుతప్ప వేరే ఉపయోగపడవు. మెట్టతాలూకాలలో electricity ఇస్తే బావులనుంచి నీళ్లుతీసుకొని పండ్లు, పొగాకు మొదలయినవి పండించుకొనడానికి ఉపయోగిస్తుంది. ఈ విషయాన్ని గుర్తించి మెట్టతాలూకాలలో electricity ఇచ్చే విషయం మొదట్లో తీసుకోవాలని కోరుతున్నాను. కోయంబత్తూరుజిల్లాలో 350, 400 అడుగులు క్రిందనుంచి నీళ్లు తీసుకువస్తున్నారు electricity సహాయంతో electricity ఇస్తే బావులలోనుంచి నీళ్లుతోడుకుంటారు. West Godavari District లో ఈ సౌకర్యాలు కలుగచేయాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

SRI G. NARASIMHAMURTY :— మాననీయ ఉపాధ్యక్షా ! ఈ సందర్భములో పలువురు సోదరసభ్యులు ఈ budget లో కేటాయించిన మొత్తములు ఆ పద్దులకు చాలవు అని మనవిచేసినారు. వారితో నేను ఏకీభవిస్తున్నాను. ముఖ్యంగా ప్రభుత్వములో జరుగుతున్నటువంటి అదనపు వ్యయము, అనవసరవ్యయము, అన్యాయమైన పన్ను వసూలు విషయా [illegible] ప్రభుత్వము జాగ్రత్తగా గమనించి సరిచేసినట్లయితే బాగుంటుందని

అభిప్రాయపడుతున్నాను. ముఖ్యంగా ప్రభుత్వముకూడా అన్యాయమైన వసూలు చేస్తుందా ? అన ఎవరన్నా సంశయము వెలిబుచ్చవచ్చును. ఉదాహరణకు గోదావరి లంకలలో అన్యాయంగా పన్ను వసూలుచేస్తునట్టి విషయాల్ని నేను తమద్వారా ప్రభుత్వదృష్టికి తేదలచుకొన్నాను. వందలాది సంవత్సరాలనుండి గోదావరినదీ గర్భములో వందలు వేలాది ఎకరముల లంకభూములుకలిసి జలమయమైపోయి ఉన్నప్పటికి వాటికి ఎకరము ఒకటింటికి 5 రూపాయల లాగాయతు 35 రూపాయలవరకు పన్ను విధించి అంతకు పూర్వము భూమిగాఉన్నపుడు ఆ భూమికి స్వంతదారు లెవరో ఆ రైతులదగ్గరనుండి వసూలుచేస్తూఉన్నారు. ఈ విధానాన్ని చిరకాలము నుంచికూడా అనుసరించుతున్నారు. నాకు తెలిసినంతవరకు, తూర్పుగోదావరి జిల్లాకు సంబంధించినంతవరకు, జలమయమయిన లంకభూములపై వసూలుచేసే మొత్తము రెండులక్షల రూపాయలవరకు ఉంటుంది. ఆదేవిధంగా పశ్చిమగోదావరీజిల్లా హద్దులలోగల నదీప్రాంతపు లంకలనుండి రెండులక్షలరూపాయలు సాలీనా ప్రభుత్వము వసూలుచేస్తునట్లు వింటున్నాను. అంటే మన ఆంధ్రదేశములో నదీ గర్భములోనికిపోయి జలమయమైపోయినటువంటి లంకభూములనుండి కనీసము సంవత్సరమునకు ఒక 5 లక్షలరూపాయలనైనా ప్రభుత్వము వసూలువేస్తుంది అన్న మాట అక్కడ భూమిదున్నేదానికి ఏమీ ఆస్కారములేదు. మనుష్యులువెళ్ళితే మునిగిపోతారు. వరదలకాలవలలో ఓడలు నడుస్తాయి. మామూలురోజులలో పడవలు నడుస్తాయి. ఎక్కడో జలానికి అట్టడుగున ఉన్నటువంటి ఈ భూమికి పన్ను వసూలుచేయడంలో ఉన్నటువంటి న్యాయమేమిటో నాకేమి బోధపడటం లేదు. శ్రీ గోపాలరెడ్డిగారు మద్రాసు ప్రభుత్వంలో ఆర్థికమంత్రిగా ఉన్నపుడు మేము అందరము లంక రైతుల తరపున ఈవిషయమై ఒక memorandum సమర్పించాము. "మీ గోదావరిలంకలు, మీ కోనసీమఅంతా ఒక నందనోద్యానవనము అని మేము అనుకొంటుంటాము. అలాంటప్పుడు మీరుకూడా పన్నులు ఇవ్వమంటుంటే ఏలా కుదురుతుంది" అని వారు సెలవిచ్చారు. అదికాక ఈనదీ ప్రాంతపు లంకలకు పన్నులు తీసివేయాలిఅంటే ఏవో G.O లు అడ్డుఉన్నవని వారు సెలవిచ్చారు. ఎప్పుడో British Government వారు తమ సామ్రాజ్యవాదపు ఆర్థికతత్వాన్ని నిలబెట్టుకొనేందుకు 18 వ శతాబ్దములోనేక 19 వ శతాబ్దములోనో ఏర్పాటు చేసినటువంటి G.O లను ఇప్పటివరకు మనము ఎందుకు శిరసావహించాలి ? దానికి ఎందుకు మనము తలవాల్చాలి ? అని నేను ముఖ్యమంత్రిగారిని ప్రశ్నించుతున్నాను. అనేకమంది సభ్యులు ఈ విషయాలనుగురించి అనేకసార్లు చెప్పినప్పటికీ ఆ రైతుల నుండి అనేక రాయబారవర్గాలువచ్చి వారికి నివేదించుకొన్నప్పటికీ ప్రభుత్వంవారు వినడంలేదు. ఇది రైతుల దురదృష్టము అని అనుకోవాలి. నదీగర్భానకలిసిన

Sri G. Narasimhamurthy] [24th March 1956

భూములకు పన్నులిచ్చుకోలేక రైతులెన్ని అగచాట్లకు గురిఅవుతున్నారో చెప్ప నవసరంలేదు. ఒకకుటుంబములో తనముత్తాతనాటినుంచి నేటివరకు అతని మునిమనమడు నదిలో కలిసిపోయినటువంటి 65 ఎకరాలభూమికి పన్నులిచ్చుకోవడం కోసం డెల్టామాగాణిలో ఉన్నట్టి 50, 60 ఎకరాలభూమిని అమ్మి. కూలీవాడై అవస్థలుపడుతున్నాడు. ఇది ఒక కుటుంబసంగతే చెప్పాను.

ఈవిషయాలనుగురించి ఎన్నిసార్లు చెప్పినా ఇదివరలో శ్రీగోపాలరెడ్డిగారు చర్య తీసుకోలేదు. కనుక ఈవిధంగా చేసే వసూలు అంతా అన్యాయమైనవసూలు అనిన్ని, అవసరమైతే G. O. లను మార్చి రైతులకు నష్టాన్ని తగ్గించడంకోసం ముఖ్యమంత్రిగారు తప్పకుండా ఇప్పుడైనా ప్రయత్నముచేస్తారని ఆశిస్తున్నాను.

ఇక అధిక వ్యయాన్నిగురించిన విషయము. Irrigation కు సంబంధించినంత వరకు ప్రభుత్వము కేటాయించినటువంటి మొత్తము ఎంతవరకు irrigation కార్యకలాపాల నిర్వహణలో ఖర్చుపెట్టబడుతుందని ఆలోచించాలి. నా అనుభవాన్నిబట్టి, ప్రత్యక్షంగా నేను చూస్తున్నదాన్నిబట్టి delta irrigation areaలో పుట్టి స్వయముగా రైతునై 20 సంవత్సరాలనుండి నాకు సేద్యంలో ఉన్న అనుభవాన్నిబట్టి నేను చెప్పాల్సివచ్చినట్టయితే మనకు స్వరాజ్యము రాకపూర్వము బ్రిటిషువారి హాయాములో ఏవిధంగా P. W. D ఉద్యోగస్థులు దురధికారం చలాయించేవారో ఆవిధంగానే పరిస్థితులు నేడుకూడా ఉన్నాయి; అంతకంటే మెరుగైన పరిస్థితులు ఏవీ రాలేదని మనవిచేస్తున్నాను. Irrigationకై అయ్యే మొత్తముఖర్చులో నూటికి ఇరవై అయిదు రూపాయలే రైతులు ఉపయోగంకోసం ఖర్చుపెట్టబడుతుందనీ అనేకపద్ధతులుగా మిగతా 75 రూపాయలు పోతుందని చెప్పడంలో నాకేమి సంశయంలేదు. దాన్నిగురించి విచారణచేసినట్లయితే నేను బుజావు చేయడానికి సిద్ధంగా ఉన్నానని మనవి చేస్తున్నాను. Tail-end irrigation ను improve చేయడంకోసమని కొన్నిలక్షలుపోలీనా ప్రభుత్వంవారు ఖర్చుపెట్టుతున్నారు. మా Central deltaలో tail-end irrigation improvement కోసం P.W.D.వారుచేసేదేమిటి ? ఒక కాలువ పదిమైళ్ళ పొడవు ఉంటుంది. ఆ పదిమైళ్ళలోను పన్నెండుచోట్లో, ఇరవైచోట్లో పుంతలో మార్గాలో ఉంటాయి. అలాంటి ప్రదేశాలలో కాలువ మెరకపడిపోయివుంటుంది. అక్కడ ఒకపది Units, తుళ్లా మూడుమైళ్లు వెళ్ళినతర్వాత ఇంకో మూడుUnits ఇంకో రెండుమైళ్లు పైకొచ్చి పద్నాలుగు units ఈ విధంగా ఆ కాలువమీద ఒక నాలుగువేలో, ఐదువేలో, పదివేలో ఖర్చుపెట్టుతున్నారు. కాలువ మొదల్లోగాని, చివరలోగాని త్రవ్వరు. [illegible] '[illegible]' గారు Superintending Engineer గా పనిచేస్తూ

"డవులీ స్కీము" అనే పేరుతో ఒక మహోత్కృష్టమైనటువంటి స్కీమును ప్రకటన పెట్టారట! దాని ప్రకారం కాలువల్లో silt clearance చేయకూడదట. ఎందుచేతనంటే ఈ సంవత్సరము silt clear చేస్తే కాలువప్రవాహం వల్ల silt వచ్చేస్తుంది గనక ఈ silt తీయడం ఎందుకు అని వారి అభిప్రాయమట! ఆయనకు అంతవరకే తెలుసు. ఐతే వారి అభిప్రాయంతో మనము ఏకీభవించడంలో న్యాయము ఏమున్నదో నాకు అర్థంకావడంలేదు. నేను రైతును. నాకు తెలుసును. Silt clear చేయకపోతే ప్రతికాలువలోను కాలువ head నుంచి ఒకమైలు లేదా రెండుమైళ్లుదూరమువరకు నీరువస్తుంది. కాలువ bed level highlevel లో ఉండటంచేత ఆవరిసే ఉన్నటువంటి పల్లపుభూములకు ఏదో కొంతనీరు వస్తుంది. మిగతా tail-end మూడుమైళ్లు ఎండిపోతుంది. Silt clearance మానడమనేపద్ధతి మంచిదికాదు. Irrigation Department లో engineers ను అడిగితే ఆస్కీము అలాగేవుంది, ఇదే మంచిపద్ధతి అని చెబుతారు. మధ్యమధ్య నిరుపయోగముగా ఈ ధనాన్ని ఎందుకు వ్యయపరుస్తున్నారో, దీనిపై ఎందుకు విచారణలేదో నాకేమీ బోధపడడంలేదు దీన్నిగురించి ప్రభుత్వము అనవసర వ్యయాలను తగ్గించుకోడంకోసం కట్టుదిట్టమైన ఏర్పాట్లను తప్పకుండా చేయవలసినదని తమద్వారా నేను ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను. అనవసర వ్యయానికి సంబంధించినంతవరకు Prohibition అన్నదొకటి వున్నది. Prohibition ను ఎత్తేస్తే మన Prohibition Minister గారు ఉపవాసాలుచేసి వెళ్ళిపోతారు. ఆసంగతి నాకు తెలుసు. అందుచేత ఎత్తివేయమని అనేవాణ్నికాదు. దానిని ఉంచాలి అనేవాడనే ఇప్పుడు ఉన్న విధానముమాత్రము చాలా లోపభూయిష్టము అని చెప్పడానికి నాకేమి సంశయములేదు. అది సర్వజనులు ఎరిగినటువంటి విషయమే. మన మంత్రిగారు ఇక్కడ మంత్రిగా ఉండి ఒప్పుకోరుగానీ రోడ్డుమీదికి తీసుకువెళ్ళి ఏమండీ నాగేశ్వరరావుగారూ, మన Prohibition వ్యవహారం ఏలావుంది, నిజంగా చెప్పండి అంటే "సమర్థనీయంగా లేదు నరసింహమూర్తి" అని తప్పకుండా చెప్తారు అని నాకు ధైర్యముంది. నిజంగా ముఖస్తుతికోసం చెప్పను. ఎవరిని, స్తోత్రంచేయటంగానీ ద్వేషించడంగాని నాకు అలవాటులేదు. Subject matter నుగురించే చెప్పుతున్నాను. ఇప్పుడీ Minister గారు వచ్చారుగదా, ఇది చాల సమర్థనీయంగా జరుగుతుందని ఆశించాము. కానీ ఇంతవరకు ఏమి అభివృద్ధి కనిపించలేదు. మామూలుగా ఉన్నట్టుగానే భావించుతున్నాను. ఇదివరకు ఈ prohibition issue మీదే గత ప్రభుత్వాన్ని కూలదోసి మళ్ళా అధికారంలోకి వచ్చారు. ఈయన సమర్థనీయంగా చేస్తారని ఆశించాము. వారుకూడ ఇందుకు తగినచర్యలు తీసుకోలేదని నేను మనవి చేస్తున్నాను.

Sri G. Narasimhamurthy] [24th March 1956

భగవంతరావుగారు యిందాకా ex-tappers విషయమై సెలవిచ్చినట్లు ex-tappers కు తగినటువంటి సౌకర్యం కల్పించడం ప్రభుత్వంయొక్క విధి. ఎందుచేతనంటే ఒకవృత్తి రాజ్యాంగ కారణాలవల్ల పోయినప్పుడు ఆ వృత్తిదారులకు వేరేవృత్తి కల్పించి జీవనోపాధిమార్గం చూపించడం న్యాయమైనది. అది ప్రభుత్వం యొక్క విద్యుక్తధర్మం. కాని నాకున్న సంశయము ఏమిటంటే Prohibition Department లో యిప్పుడు నీరా ఏర్పాటుచేశారు. అది నిజంగా నీరాఏనా ? నీరా అనే ఖర్చుపడుతున్నదా ? నీరాగానే ఉత్పత్తిఅవుతుందా ? దానివిషయంలో ఏదయినా తనిఖీగాని నిఘా గాని ఉన్నదా అని ప్రశ్నిస్తున్నాను. ఇది నీరా కాదు. శుభ్రముగా మానవులందరు అలవాటుపడిన అవసరమైనటువంటి కల్లు. ప్రతిచోట నిర్భయముగా నేను ప్రొద్దున్న పొలంవెళ్ళేదారిలో తాటిచెట్లప్రక్కనే అమ్ముతుంటున్నారు. అందరూ త్రాగుతారు. దానికోసం 40 లక్షలు వ్యయం సవ్యమైనదా ? ఈవిధంగా చేయడంలో న్యాయం ఏమిటని అడుగుతున్నాను. అందుచేత prohibition సక్రమంగాలేదని నా నమ్మకము. ఆంధ్రదేశంలో prohibition సక్రమంగా అమలుచేయడానికి సమర్థనీయంగా చేయడానికి చేసినప్రయత్నాలు ఏమిటి ? అని అడుగుతున్నాను. మనుధర్మశాస్త్రం లగాయతు మన ధర్మశాస్త్రం వరకు అంటే గోపాలరెడ్డిగారి నాయకత్వంక్రింద నడుస్తున్న యీ శాసనంలో వ్యక్తులు దొంగతనంచేసిన తప్పు అని ఒక నిర్ణయం జరిగింది. కాని నాటి లగాయతు నేటివరకు దొంగతనాలు జరుగుతూనే ఉన్నాయి. అందుచేత దొంగతనం చేయడం కోసం కట్టుదిట్టం సడలింపు చేయమంటామా ? చేయమనం. కట్టుదిట్టం చేస్తూంటాం. చేసుకురాగా రాగా కొంతకాలానికి పరిస్థితులు అభివృద్ధిచెందుతవి. అందుచేత ఒకనాడే యిదంతా జరిగితీరాలనేవాడిని కాను. గాంధీమహాత్ముడు కల్లుసంఘాన్ని పీడించి పిప్పిచేస్తూ సంఘాన్ని నిర్వీర్యం చేస్తున్నదని చెబితే ముఖ్యమంత్రిగారు, కళా వెంకట్రావుగారు, నాగేశ్వరరావుగారు, శాసనసభ్యులు, అనేకమంది పెద్దలు నాయకత్వంక్రింద picketing చేయించి సారాగాని కల్లుగాని దేశంలో ఎక్కడా లేకుండా నిర్మూలం చేయాలని కోట్లాదిప్రజలు, అనేకమంది సామాన్య కార్యకర్తలు ఉత్సాహంతో పనిచేసి గాంధీమహాత్ముని మూలసిద్ధాంతప్రకారం మద్యపాన పిశాచాన్ని నిర్మూలించడానికి కంకణంకట్టుకున్న మనం కల్లుగీయడం ధర్మ సమ్మతమని ఎలా ఆమోదించారో నాకు తెలియడంలేదు. సంఘానికి నష్టదాయక మైనట్టి సారా, కల్లు తయారుచేయడం ఒక మంచి వృత్తి అని గాంధీమహాత్ముని అనుచరులు ఎలా ఆమోదించారో నాకు ఆశ్చర్యంగా ఉన్నది. దానిని గురించి ప్రసంగించి ప్రయోజనంలేదు. అందుచేత యిటువంటిదానికోసం ఆ Department కట్టుదిట్టం చేయడానికి కూడా మార్గాలు లేకపోలేదు అని నేటికీ నా విశ్వాసం.

దానిని కట్టుదిట్టంగా నిర్వర్తించవలసినదని అందుకు తగినవిధంగా కృషిచేయవలసినదని మనవిచేస్తున్నాను. అవసరమైతే సూచన లివ్వగలిగిన సభ్యులు, అనేకమంది పెద్ద లున్నారు. కనుక వారితో ఒక Committee అయినా ఏర్పాటుచేసి Police లోకి యీ Prohibition Department మార్చినతరువాత వచ్చిన మంచిచెడ్డలు కూడా చర్చించి యింకా దానిని సరిగా చేయడంకోసం అవసరమైన కార్యక్రమంను కడంగ వలసినదని చెబుతూ వీటిని ఆమోదిస్తున్నాను.

SRI S. NARAYANAPPA :—అధ్యక్షా, ఆర్థిక మంత్రిగారైన మన ముఖ్య మంత్రిగారు Supplementary Demand గా తెచ్చినటువంటి పద్దును బల పరుస్తూ కొన్ని సూచనలు, సలహాలు ప్రభుత్వ దృష్టికి తీసుకునివస్తున్నాను. ఇది మామూలుగా ప్రతి సంవత్సరం మార్చి ఆఖరులో Supplementary Demand sanction కు శాసన సభ్యులను ఒత్తిడి పెట్టే సాంప్రదాయం. కొంతమంది సభ్యులు అనుభవజ్ఞులు సూచించినట్టు యిటువంటి పద్ధతిని మానిపించాలి ప్రజా స్వామ్యంలో నిజముగా యీనాడు ప్రభుత్వ అధ్వర్యంక్రింద పనిచేస్తున్న స్థానిక సంస్థలయిన పంచాయతీలు, మునిసిపాలిటీలు అత్యవసరమైనట్టి పద్దులను గురించి ఖర్చు పెట్టాల్సిన సమయంవస్తే "in anticipation sanction" చేసి కలరా, అంటు జాడ్యంవల్ల చాలా ప్రాణాపాయకరమైన పరిస్థితులు ఏర్పడినప్పుడు అటువంటి సందర్భంలో యిటువంటి మంజూర్లు పొందడానికి అవసరం కనపడుతుంది. తరువాత sanction తీసుకోడం జరుగుతుంది. అయితే మన క్రింద నున్నటువంటి చిన్న సంస్థలకు ఆ విధమైన ఆదేశం మనంయిస్తూ, నిర్బంధంగా నిర్వహిస్తూ దాదాపు 8 కోట్ల చిల్లర పద్దులను శాసన సభ్యులముందు తెచ్చిపెట్టడం న్యాయంకాదు. అటు వంటి పద్ధతిని అటువంటి సాంప్రదాయాన్ని మాన్పించి ఎప్పుడు ఏసమయానికి ఎంత అవసరమో ఎంత ఖర్చు పెట్టాల్సిన ఆగత్యం ఉన్నదో ప్రజావసరాలను గమనించి ప్రభుత్వంలో నున్నటువంటి వివిధ శాఖలలో నిర్వహిస్తున్నటువంటి మంత్రులు ఆ పద్దులక్రింద అప్పుడు శాసనసభ్యుల సమక్షంలో తీసుకునివచ్చి మంజూరు తీసుకొంటే అది ఉత్తమంగా ప్రజామోదకరంగా పరిపాలన సాగేదానికి వీలుంటుంది. అటు వంటి సూచనలను ముందుముందు ఆచరణలో తీసుకునివచ్చి ప్రజామోదాన్ని పొందడానికి శాసన సభ్యులందరకు సంతృప్తికరంగా ఉంటుందని నేను ఆశిస్తున్నాను. ప్రభుత్వం క్రింద అట్టడుగున పనిచేస్తున్న గ్రామాధికార్లున్నారు. రెడ్లు, మున సబుల పరిస్థితి అర్ధనారీశ్వరత్వం మాదిరివున్నది. వీరు అటు ఉద్యోగులుకారు యిటు ఉద్యోగేతరులుకారు. గౌరవవేతనం తీసుకుంటూ రంటున్నాము. వారికి వంశ పారంపర్యంగా వచ్చే హక్కులను తొలగించి కనీసం N.G.O. లకు యిచ్చే సౌకర్యం, లేక జీత భత్యాలు service నిర్దుష్టంగా ఏర్పాటుచేసి

Sri S. Narayanappa] [24th March 1956

ఉద్యోగాలు కల్పించి, జీతాలు పెంచాలని మనవిచేస్తున్నాను. ఇది చాలా సంవత్సరాలుగా, మనం స్వరాజ్యం సంపాదించుకొనుటకు పూర్వం రోజులలోగూడ ప్రచారంలో ఉన్నది. ప్రజా ప్రభుత్వంలో, ప్రజాస్వామ్యం నెలకొల్పుకు నేఈ దినాలలో గ్రామ మునసబులకు కరణాలకుతగిన జీతాలు కల్పించడంలో ఖచ్చితమైన policy ఏర్పాటు చేసుకుంటేతప్ప వారిస్థితి చాలా హీనంగా వుంటుంది. కనుక వారిలోగల అసంతృప్తిని తొలగించే ప్రయత్నం చేయాలని నేను మనవిచేస్తున్నాను. రాష్ట్రంలో అక్కడక్కడ independent sub-taluka లున్నాయి. Sub-taluk లలోని Revenueఉద్యోగస్థులకు houserent allowance యివ్వడంలేదు. జిల్లాకార్యాలయంలో Revenue శాఖకు house rent allowance యిస్తారు. అక్కడమంచి సదుపాయాలు సినిమాలుండడంవల్ల గుమస్తాలు అక్కడ పనిచేయడానికి ఇష్టపడతారు. అదేవిధంగా Independent sub-taluk లోనున్న Staff కు Rent allowance యివ్వాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. దీనిని 4,5 సంవత్సరాలనుంచి మేము ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చినాం. ఇంతవరకు ఏ విధమైన సౌకర్యంజరుగలేదు. ఇకనైనా ప్రయత్నంచేస్తారని ఆశిస్తున్నాను ఇది కాకుండా వెనుకబడిన జాతులవారు దాదాపు 40% రాష్ట్రం మొత్తంమీదఉన్నారు. వారికి ప్రభుత్వం విద్యావేతనములు కల్పించి విద్యాసౌకర్యం కల్పిస్తున్నారు. ఇది చాలా ప్రశంసనీయం. ప్రభుత్వం దాదాపు 4,5 సంవత్సరాలక్రిందట యిస్తున్నటువంటి grant కంటె అదనంగా యీనాడు ఎక్కువ grants యిస్తున్నారు. అందుకు ప్రభుత్వం చర్యను అభినందిస్తున్నాను. వెనుకబడ్డ జాతులవారు arts college లో March ఆఖరున విద్యావేతనం చెల్లించే సౌకర్యంలేక hostel భోజనానికి చెల్లించవలసిన అప్పులుకూడా చెల్లించలేక చాలా అవస్థపడుతున్నారు. ఇది చాలా తడవలు ప్రభుత్వదృష్టికి తెచ్చినాము. అక్కడున్న విద్యార్థులు పరీక్షలకు వెళ్లలేక పాట్లుపడుతున్నారు. దీనికి యింతకుముందే ఈ Supplementary demandలో కొన్నివేలు sanction చేసిఉంటే ఆ బీదవిద్యార్థుల కష్టాలుతీరిఉండేవి, ఇప్పుడైనా వెంటనే వారి కష్టాలను గమనించి విద్యార్థులకు విద్యావేతనములు grant చేసి పంపిస్తే సహాయంగా వుంటుంది. అందుచేత కొంత కేటాయించి సహాయం చేస్తారని నేను ఆశిస్తున్నాను.

మన ముఖ్యమంత్రిగారికి వెనుకబడిన జాతులుఅంటే చాలా ఇష్టము. వారు ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఆర్థికమంత్రిగా యుండగానే, వెనుకబడిన జాతులకు ఒకసలహాసంఘం నియమించడం, ఒకలక్షరూపాయిలు కేటాయించడం, [illegible] వారిని 5 [illegible] పెంచడముజరిగింది, ఆ విషయంవారికి జ్ఞాపకముయుండియే

ఉండును. ఈనాడు ఆంధ్రరాష్ట్రములో వెనుకబడినజాతుల విద్యార్థులు అనేకమంది అనేకయిబ్బందులు పడుతున్నారు. అందువల్ల వారు మద్రాసు రాష్ట్రములో వెనుకబడినజాతులయందు చూపించిన ఆదరణను, దయను, వీరియందు చూపిస్తారని నా విశ్వాసము వెంటనే వెనుకబడిన విద్యార్థుల విద్యావేతనములకొరకు కొంత మొత్తాన్ని కేటాయించి, వారికి సౌకర్యములు కలుగజేస్తారని నేను ఆశిస్తున్నాను.

చేనేత పారిశ్రామికులకు సెస్సుఫండు చాలా ద్వార సహాయంచేస్తున్నాము అంటున్నారు. ఈ విషయం ఇంతకుముందు కోటయ్యగారు చెప్పారు. నేను వివరములలోకి పోదలచుకోలేదు. వాస్తవముగా చేనేత పారిశ్రామికులకు చేస్తున్నటువంటి సహాయము అత్యల్పము. ఈనాడు societyలు అన్నీ, Rural banks అన్నీ, Credit society లు అన్నీ, Weavers society లు అన్నీ కలగూరగంపగాచేర్చి, Central banks కు attach చేసినారు. Central banks లో పలుకుబడికలిగినవారికి మాత్రమే అప్పుమంజూరు అవుతుంది. నోరులేని చేనేతపారిశ్రామికుల సొసైటీలో ప్రాతినిధ్యం వహించినవాళ్ళకు అప్పులు, మంజూరుకావడములేదు. తెచ్చిన అప్పులు తీర్చే అవకాశము ఆ సొసైటీలకు లేకపోతున్నది. దేశంలో ఉన్నటువంటి 160 సొసైటీలలో 7 సొసైటీలుమాత్రమే, ఆర్థికసోమతులు కలిగిఉన్నాయి. ఆర్థికంగా వెనుకబడిఉన్న సొసైటీలకు ఈ సెస్సునిధినుంచి అప్పును వడ్డీలేకుండా ఇచ్చి, క్రమంగా సెంట్రలుబాంక్సు, బాధలనుంచి తప్పించి, ప్రత్యేకంగా, ఒక corporation finance ఏర్పాటుచేసి, చేనేతసొసైటీలకు తగిన సౌకర్యములు చేస్తే, Weavers society లకు ఆర్థికసోమతు కలుగచేస్తే, వారందరికి చేతినిండా పనికల్పించి ఆర్థికంగా వారికి సహాయం జేయడానికి వీలవుతుంది. అప్పటికిగాని ఈ చేనేత సొసైటీలు బాగా పని చేయడానికి వీలుకాదు. బయట ఉన్న చేనేత కార్మికులను మనము ఆహ్వానించి, Co-operatice Society లు ఏర్పరచి సంస్థలద్వారా వారికి సర్వ సౌకర్యములు, సర్వ సుఖములు ఏర్పాటు చేయాలి. కాని Co-operative Commonhealth యొక్క సిద్ధాంతాన్ని మనము అమలుపరచడానికి వీలులేకుండా పోతుంది. కాబట్టి ఆ విధమైన పద్ధతి అవలంబిస్తే, చాలా సంతోషంగా ఉంటుంది. మా జిల్లాలో నాగసముద్రము ఫిర్కా ఉన్నది. అది చాలా వెనుకబడినటువంటిది. ఆ ఫిర్కాలో రోడ్ల సౌకర్యము లేక దాదాపు 20 సంవత్సరముల నుంచి వెనుకబడిఉన్నాయి. 15 సంవత్సరముల క్రింద వేసిన famine రోడ్లు, ఈ నాటికికూడా తిరిగి ప్రభుత్వం వారు మరమ్మతుచేసిన పాపానపోలేదు. ఇప్పుడైనా ఆ విషయము గమనించి సప్లిమెంటరీ డిమాండులో అయినా, దానికిగాను 20 వేలు కేటాయించ కోరుతున్నాను. ఆ రోడ్డు మరమ్మతులు జరిగి, సౌకర్యములు ఏర్పడడము జరుగుతుంది. అది కావున్ండా

మామడూరు అనే గ్రామము ఉన్నది. అక్కడ చెరువును నిర్మిస్తే దాదాపు 600 ఎకరములు భూమి సాగుచేసేదానికి అవకాశమున్నది. దానిని నిర్మించమని ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చాము. ప్లానులు ఎస్టిమేట్లు తయారు అయినా ఇంతవరకు దాని నిర్మాణం ప్రారంభం కాలేదు. ఆ విషయము ఏమైనాదో కూడా ఇంతవరకు తెలియదు. మా మడూరు చెరువును నిర్మించి, దేశంలో, క్షామ ప్రాంతాలను వెనుకబడిన ప్రాంతాలను దృష్టిలో ఉంచుకొని, రైతాంగమునకు ప్రభుత్వం వెంటనే తగిన సౌకర్యములు కలుగచేస్తుందని నేను విశ్వసిస్తున్నాను. అధ్యక్షులవారు ఈ అవకాశము కల్పించినందుకు కృతజ్ఞత తెలుపుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI M. RAJESWARA RAO :— ఉపాధ్యక్షా, గత సంవత్సరము అప్రాప్రియేషన్ బిల్లుమీద మాట్లాడుతూ, ఈ సంవత్సరం అయినా ప్రభుత్వం సప్లిమెంటరీ డిమాండులకు చాలా తక్కువ డబ్బును ఖర్చుపెడుతుందని ఆశించాము. అదే సూచనచేశాము. 8 కోట్లపై చిల్లర సప్లిమెంటరీ డిమాండులు మనవద్దకు వచ్చినాయంటే, దాదాపు బడ్జటులో 8 వంతులు, మరల సప్లిమెంటరీ డిమాండుల రూపంలో మన ముందుకు వచ్చినట్లు కన్పిస్తున్నది. ఇది ప్రభుత్వం ఎక్కువగా పని చేస్తుందని చెప్పడానికి నిదర్శనము అయినప్పటికి, శాసనసభా అనుమతి పొందనిదే, బడ్జటును స్వ్యాసుచేయకూడదు అనే సాంప్రదాయము మనకు ఉన్నప్పుడు, మొత్తం డబ్బును అంతా ఖర్చుపెట్టి, తరువాత మీరు approve చేయండి అని ఇక్కడకు వచ్చేదానికి బదులు, అసలు Vote of confidence తీసుకొని బడ్జటును pass చేసుకుంటే అసలు చిక్కులు లేకుండా పోతుందేమో అని మనం ఇక్కడకు రావలసిన అవసరం లేకుండా పోతుందేమో అని అనుకొంటున్నాను. బడ్జటు ఉపన్యాసములో ప్రభుత్వానికి అనేక సూచనలు చేశాను. దానిని మరల వారికి జ్ఞాపకము చేస్తున్నాను. ఎస్టిమేట్సు కమిటీని మనం స్థాపించుకుంటే బాగుంటుంది అనుకున్నాను. కాని ప్రభుత్వంవారు దానిని పరిశీలించినట్లు కన్పించడములేదు ప్రధానమంత్రిగారు ఆర్థిక మంత్రిగారు ఒక్కరే కాబట్టి, వారు చాలా అనుభవము ఉన్నవారు కాబట్టి ఈ ఎస్టిమేట్సు కమిటీని గురించి ఆలోచించమని వారికి మనవిచేస్తున్నాను.

కుప్పస్వామి కమిటీసిఫారుల్సను అనుసరించి, ప్రభుత్వము వారు కొన్ని ప్రాథమిక పాఠశాలల స్వాధీనము చేసుకున్నారు. చాలా సంతోషం. ఏ విధంగా స్వాధీనం చేసుకోవాలిఅనె దాంట్లో భేదాభిప్రాయాలు ఉన్నాయి, కొన్ని జిల్లాలు తీసుకుంటారు అనుకొన్నాము. కాని ఒక్క నెల్లూరు జిల్లాను మాత్రమే తీసుకుంటున్నట్లు వారు ప్రకటన చూచినట్లయితే చాలా ఆశ్చర్యము

కలిగినది. పెద్ద పెద్ద పట్టణాలలో ప్రయివేటు పాఠశాలల ఉపాధ్యాయులకు 46 రూపాయలు జీతం ఇస్తుంటె. అందులో 16 రూపాయలు cut చేసుకొని ఇస్తున్నారు. ఈ కర్నూలులోనే అటువంటి కేసులు ఎన్నో ఉన్నాయి. ప్రధానమంత్రిగారు ఇక్కడ కొంచెము ప్రయత్నంచేసి తెలుసుకొంటే ఈవిషయములన్నీ బోధపడుతాయి. ఇది పల్లెప్రాంతములలో లేదు పట్టణ ప్రాంతములలోనే ఎక్కువగాయున్నవి. అందువల్ల మనకుడబ్బు లేనికారణంచేత, అన్నిజిల్లాలలో ఇది సరిగా లేకపోయినా, కనీసం మునిసిపాలిటీ ఏరియాలలో జిల్లా headquarters లో ఉన్నటువంటి ఒక్కొక్క తాలూకా headquarters లో ఉన్నటువంటి అన్ని జిల్లాలన్నిటిలోనూ తీసుకుంటే బాగుంటుంది. నెల్లూరు జిల్లాలో ఉన్న 7, 8, తాలూకాలలో తీసుకోవాలిగదా, అటువంటప్పుడు, ఏలూరు town తో కలసిఉన్న తాలూకా ఏరియాలోను కృష్ణాజిల్లాలో బందరుతో కలసిఉన్న బందరు తాలూకా ఏరియాలో ఉన్నవాటిని తీసుకుంటే, బాగుంటుంది. అట్లచేస్తే దానివల్ల మనకు ఎంతవరకు ఉపయోగం ఉన్నదో తెలుస్తుంది. అందువల్ల దానిని మరల పునరాలోచన చేయవలసిన్నదిగా ప్రభుత్వం వారికి మనవిచేస్తున్నాను. సెపరేషన్ జ్యుడిషియరీనిగురించి రమణయ్య నాయుడుగారు చెప్పారు. దీనికి ఎక్కువ డబ్బు ఖర్చుఅవుతుందని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది ఎక్కువడబ్బు ఖర్చుఅవదని నేను మనవిచేస్తున్నాను.

ప్రస్తుతం West Godavari District లో జరుగుతున్న కోర్టులు పరిశీలిస్తే, maintenance లో అధిక ధనమును, fines ద్వారా సంపాదించి పెట్టుతున్నారనిపిస్తున్నది. ఎంత ఖర్చు అవుతున్నది. ఎంత రాబడిప స్తున్నది. ఒకసారి పరిశీలన చేసి, దానిని అన్ని జిల్లాలోనూ ప్రవేశపెట్టినట్లయితే, ట్రైయినింగుఅయినవారికి కొంతమందికి ఇబందులు తగ్గుతాయని మనవిచేస్తున్నాను.

ముఖ్యంగా బార్ అసోషియేషన్‌కు కట్టించిన భవనం చూస్తే చాలా అధ్వానంగా ఉన్నాయి. మరమ్మతులులేవు లైట్లులేవు, ఫాన్సులేవు చాలా అధ్వాన్నంగా ఉన్నాయని మనవి చేస్తున్నాను. ప్రతిజిల్లాకు head quarters లో ఉన్నటువంటి, బార్ అసోసియేషన్‌వారికి కనీసం అన్ని సౌకర్యాలు, కల్పించడానికి ప్రభుత్వంవారు ప్రయత్నంచేయాలని మనవిచేస్తున్నాను. Expenditure ను reduce చేయడమే కాకుండా ఇంకొక విషయమును ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ముగ్గురు మెంబర్లు ఉన్న ఎస్టేటు ట్రిబ్యునల్సును రద్దుచేసి, ఒక జడ్జీ ఉండేటట్లుగా మనం ఒక బిల్లును ప్యాసుచేశాము. అది చట్టముకూడా అయింది. ఇది చాలా మంచివిషయమే. ఇంకొంతకాలం పోయినతరువాత, మిగిలిన అన్ని ట్రిబ్యు

నల్సుకు కూడా దానిని వర్తింపజేస్తే బాగుంటుంది అని నేను అభిప్రాయపడుతున్నాను.

జిల్లా మేజిస్ట్రేటులను రద్దుచేసి, జిల్లా అడిషనల్ జడ్జీలను వేస్తున్నాము. వారికి జిల్లాజడ్జీలకు ఉండే అధికారాలు అన్నీ ఉన్నాయి. ఈ Estate Tribunals ను constitute చేసినచోట, ఆ బాధ్యతలన్నీ అడిషనల్ జిల్లాజడ్జీలకు వస్తాయి. అందులో పెద్ద ఇబ్బందిలేదు. అదేవిధంగా మనకు ఇప్పుడు సేల్సుటాక్సు ట్రిబ్యునల్సు ఉన్నాయి. ఆ ట్రిబ్యునల్సుకూడా సింగిలు మెంబరు ట్రిబ్యునల్సుగా constitute చేసి, ఆ బాధ్యతలను అడిషనల్ జిల్లా జడ్జీలకు అప్పగించినట్లయితే బాగుంటుంది. వారు ఈ duties ను నిర్వహించడానికి వీలుంటుందని మనవి చేస్తున్నాను. దీనివల్ల clients కు కొంత బాధకలుగుతుంది. అన్ని జిల్లాలవారు కూడా ఒక్కచోటకు వెళ్లడం, కొంచెం బాధపడవలసివస్తుంది. ఈ విషయం ప్రభుత్వంవారు ఆలోచించవలసినదని మనవిచేస్తున్నాను.

(At this stage Mr. Speaker resumed the chair).

Central Road Traffic Board ను కూడ reconstitute చేయవలసిన అవసరం ఉన్నదనుకుంటాను. దీనినిగురించి ఈమధ్య మద్రాసు ప్రభుత్వమువారు ఆలోచిస్తున్నారు. ఈ Central Road Traffic Board కు కూడ 11 జిల్లాలలో ఉన్నవారు అక్కడకుపోవడం, చాలా బాధలుపడడం, ఇప్పుడున్నటువంటి procedure వేరుగా ఉందని judicial procedure follow కావడంలేదని క్రిందటినెలలో ఆంధ్ర హైకోర్టువారు ఇచ్చిన తీర్పువలన మనకు తెలుస్తున్నది. judicial functions నిర్వహించాలని Act లో చెప్పినప్పటికీకూడ వీరు judicial functions లేకుండా చేస్తున్నారు. ప్రజలకు సరియైన న్యాయం కలుగుటలేదు. హైకోర్టులో రిట్ వేసుకోడానికి మనం ఏవిధంగా proceed అవ్వవలెనో అర్థంకాకుండా ఉన్నది. రెండువారాలక్రితం హైకోర్టునుండి law report వచ్చినది. అందుచేత ఈ Road Traffic Board ను reconstitute చేసి ఆయా జిల్లాలలో ఉన్నటువంటి Judges కు అప్పగించుటకు అనుకూలంగా Act ను సవరించుటకు మనకు అధికారంలేక పోయినట్లయితే మనం కేంద్రప్రభుత్వంవారికి సూచనచేయవచ్చును. ఇందులో పెద్ద బ్రహ్మాండమైన విషయమేమీలేదు. మద్రాసు ప్రభుత్వంవారు తలపెట్టినారు. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం వారుకూడ దీనినిగురించి ఆలోచించాలని మనవిచేస్తున్నాను. నేను ఈ బడ్జెట్ మీద ఇదే మొదటిసారి మాట్లాడుతున్నానని భగవంతరావుగారు చెప్పారు. మనం ఏ కార్యక్రమాన్ని రూపొందించాలనుకున్నా మనకు ఉన్నటువంటి administrative set-up సక్రమంగా ఉంటేనేకాని జరగదని మనం [illegible] అనుకుంటూనే వున్నాము. ఒకవైపున expenditure పెరిగిపోతు

న్నది. Work లో efficiency తగ్గిపోతున్నది. పరిస్థితి ఇంత చిత్రంగా ఉంటున్నప్పుడు ప్రభుత్వం ఎందుకు గమనించుటలేదో నాకు అర్థంకావడం లేదు. ఇప్పుడు మనం ఇదమిద్ధంగా ఒక నిర్ణయమునకు రాలేకపోయినప్పటికీ పరిపాలనావిధానంలో ఈ కార్యక్రమం ఎంతవరకు కుంటుపడిందో సక్రమంగా ఆలోచించాలని మొన్ననే ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశాను.

క్రిందటసారి నేను మాట్లాడినప్పుడు services ను re-organisation చేయడంకోసం సూచించినటువంటి పంచశీల విషయములను మళ్ళీ ఒకసారి పరిశీలన చేయాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. అసలు పరిపాలనా విధానం ఎట్లా వున్నప్పటికీ village administration విషయంలో బహుశ్రద్ధ తీసుకోవలసియున్నది. వారసత్వపు పద్ధతిని రద్దుచేయాలని నేను చెప్పడం సాహసమే అయినప్పటికినీ దీనివిషయంలో ఎవ్వరికీకూడ భేదాభిప్రాయములేదు. ఒక్కొక్కసారి ఒక మార్పు అవసరమైతే మనం ప్రయత్నం చేయాలి Revenue boardను abolish చేయాలని శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు పెద్ద argument చెప్పారు. రాజగోపాలాచారిగారు దానితో convince అయ్యారు. దానిని ఎప్పుడో abolish చేయాలని, దానివల్ల ఉపయోగం లేదనీ అనుకున్నాము. ఎప్పుడో military administration లో ప్రభుత్వం వున్నప్పుడు రెవిన్యూబోర్డు పెట్టుకున్నాము. అయితే ఇప్పుడు ఈ ప్రభుత్వానికి military కార్యక్రమాలులేవు.

రాజగోపాలాచారిగారు బ్రహ్మాండమైన ఉపన్యాసం ఇస్తే నిజంగా abolish చేయడానికి decision తీసుకుంటున్నారేమో అనుకున్నాము. ఆయన "నాకు సాహసంలేదు, మీరుపడుచువారు కావాలంటే తీసుకోండి, నేను ముసలివాడినైపోయినాను. అందరిచేత నేను ఎందుకు తిట్టించుకోవాలి." అన్నారు. ఈనాడు యువకులు, ధైర్యంగలవారు ఇంకా రాజకీయాలలో వుండగలిగినవారు పరిపాలనలో సాహసమైన కార్యములు చేయాలి. అట్లు చేసినట్లయితే మనకు ఉపయోగపడుతుందనే అభిప్రాయమున్నప్పుడు కొంతమంది దానిని విమర్శించినప్పటికీకూడ, వాటిని లెక్కచేయకుండ administration చట్టములను బాగుచేయుటకు మనం ప్రయత్నించాలి ఈనాడు మనం పంచవర్ష ప్రణాళికను అమలుజరుపుకొంటున్నాము. 5 సంవత్సరముల పరిపాలనావిధానంవల్ల మన కార్యక్రమాలు ఎంతవరకు కుంటుపడినాయో ఒకసారి సభ్యులయొక్క అభిప్రాయములనన్నింటినీ సేకరించాలి. Services కు సంబంధించినంతవరకు సభ్యులందరితోను ఆలోచించి శాశ్వతమైన విధానాన్ని రూపొందించవలసి ఉంటుంది. లేనిచో మనం పురోగమించలేము. దీనిని ప్రభుత్వమువారు జాగ్రతగా ఆలోచించాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, నెల్లూరు జిల్లాలో token grant క్రింద నిర్వహింపబడేటటువంటి ప్రాథమిక విద్యాసంస్థలను ప్రభుత్వంవారు స్వాధీనము చేసుకునే ఉద్దేశ్యములో ఉన్నందులకు ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. కాని యిదేమాదిరిగా రాష్ట్రవ్యాప్తముగా అన్ని జిల్లాలలోనూ యీ పద్ధతిని అవలంబించవలసిందిగా 500 సంతకములు చేసిన పిటిషను వచ్చినది. అది మీద్వారా అందజేయగోరుతున్నాను.

MR. SPEAKER :—ఆ సంతకములు ఎందును గురించి ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఆ పద్ధతిని రాష్ట్రవ్యాప్తముగా అన్ని జిల్లాలలోనూ అమలుజరుపమని విజ్ఞప్తి.

SRI S. BRAHMAYYA :—On a point of information, Sir.

ఏవైనా యిటువంటి పిటిషనలుగాని, మెమొరాండములుగాని వచ్చినట్లయితే అవి మంత్రిగారికి తీసుకొని వెళ్ళి యివ్వడం జరుగవలెనా ? లేకపోతే, యిక్కడ అసెంబ్లీలో సభ్యులు ఉపన్యాసముచేస్తూ, దానితోబాటు వాటిని అందజేస్తారా?

MR. SPEAKER :—Subject matter ను explain చేస్తూ ఎసెంబ్లీలో ఆవిధంగా యివ్వవచ్చునని రూల్సులో ఉన్నది

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఆ పిటిషను తమకు తరువాత అందజేస్తాను. కాని బ్రహ్మయ్యగారు చెప్పినదిచూస్తే యీ విషయములో యింకా అనుమానముగా ఉన్నట్లున్నది. ఒక్కసారి రూల్సు చదువుకొంటారనుకుంటాను. ఆ మాట అధ్యక్షులవారుకూడా చెప్పారు.

MR. SPEAKER :—210 వ రూలులో ఉన్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఈ రోజున తీసుకు వచ్చినటువంటి బడ్జెటులోని estimates ను చూస్తే, చాలా ఆశ్చర్యము వేస్తున్నది.

MR. SPEAKER :—Rule No. 210 (e) లో "must not propose expenditure of public monies or the imposition of any charge taxed on public revenues." అని వ్రాసి ఉన్నది. కాబట్టి ఆ limitation ఉన్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఉన్నదనుకోండి. Implement చేయమని గట్టిగా అడిగితేగాని, అప్పీలుకు ఏమీ పని ఉండదు.

SRI S. BRAHMAYYA :—ఆ సంతకములన్నీ teachers చేసినవేనా, లేక పబ్లికులో నుంచి వచ్చినవా ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—బ్రహ్మయ్యగారు ఆ ప్రశ్నను అధ్యక్షులవారికే సరాసరివేస్తే మంచిది. నేను తరువాత జవాబు చెబుతాను. గౌరవసభ్యులు నన్ను డైరెక్టుగా అడిగితే నేను సమాధానము చెప్పటానికి మనకు రూల్సులో ఏర్పాటులేదు. ఈ సంతకములు నిజముగా యిప్పుడు ఉద్యోగము చేస్తున్న teachers వే. బ్రహ్మయ్యగారికి యింకా అనుమానముగా ఉంటే, వాటిని గురించి refer చేసుకోవచ్చు.

ఇందాక రాజేశ్వరరావుగారు మాట్లాడుతూ ఒక విషయము చెప్పారు. దానిలో 1/3 additional budget గా తీసుకునివచ్చారు. అసలు Revised Budget ను తీసుకునివచ్చేటప్పుడు చాలా emergent గా ఉండే చిన్న మొత్తాల కొరకు తీసుకునివస్తారు. పెద్ద మొత్తాలకొరకు తీసుకునిరావడము న్యాయముకాదని రామకృష్ణరాజుగారుకూడ చెప్పారు. ఇందులో కనబడేవిఅన్నీ "New Services" క్రింద నే కనబడుతున్నవి. ఇంత డబ్బు అయితే, అవి "New Services" క్రిందకు వస్తాయి అని ఎందులో define చేశారు? అసలు "New Services" అనేవి ఎప్పుడు వస్తాయి? ఒక ఉదహరణ, నాగార్జునసాగర్ తీసుకుందాము. దానికి యిదివరకు ఒక account ఉన్నది. ఇరవైవేల రూపాయలు అదనముగా ఖర్చు చేస్తామని చెప్పి, దానిక్రింద ఇంకా "New Services" అని ప్రారంభించారు. "New Services" కు సంబంధించిన రూల్సును చదువుకుంటే దానికి అదనముగా చేయవలసిన పనిగాని, లేకపోతే ప్రమాదంవల్ల ఆటంకము కలిగితే, దానిని సర్దుబాటు చేసుకొనుటకు తప్ప, వేరే మొత్తాలను "New Services" క్రిందకు తీసుకుని రానక్కరలేదు, అని clear గా ఉన్నది. కాని ఇక్కడ "New Services" అని ఎందుకు తీసుకుని వచ్చారో నాకు అర్థము కావడములేదు. మనము ఈ accounts అన్నీ చూస్తే, ప్రతి దానిలోకూడ "New Services" అని ఉండనే ఉన్నది. ఈ విధముగా ప్రతి దానిలోనూ "New Services" అని వ్రాయడము యిది ఒక fashion వలె యీ term ను వాడుతున్నారా అన్నట్లున్నది. ఏవైనా లోపాలు ఉంటే, అవి సర్దుబాటు చేసుకోటానికి తప్పించుకోటానికి "New Services" వీలుగా కనబడుతున్నది. ఆ విధముగా తప్పించుకోటానికి యీ పద్ధతిని అవలంభించవద్దని

అంటున్నాను. ప్రతి account లోనూ యిదివరకటికంటె పెద్ద మొత్తాలను పెట్టారు. గనుక అవి New Services అయినవి. మేము దానిని బడ్జటులో additional demands గా తీసుకొనివచ్చాము అని చెప్పటానికి ఆధారమైన వాదనగా వస్తుంది. అది సరియైన పద్ధతికాదంటున్నాను. అందులో ఏదైనా "New Services" క్రిందకు తీసుకుని వచ్చినప్పుడు ప్రత్యక్షంగా ప్రత్యేకంగా క్రొత్త services యేవైనా ఉంటే, వాటిని మాత్రమే తీసుకుని రావలసి ఉంటుందంటున్నాను.

రెండవది సామాన్యపు యక్కౌంట్సులోకూడా ఎప్పుడైనా తీసుకోవచ్చును. ఖర్చుకూడా కావచ్చును. అవి కొన్ని పెద్ద పెద్ద మొత్తాలే అయి ఉండవచ్చును. కాని అసలు ప్రభుత్వమునకు చెల్లించవలసిన ఋణము ఏదిఅయితే ఉన్నదో, ఆ ఋణమును additional grant క్రిందకు తీసుకొనిరావడం అన్నిటికంటె ఆశ్చర్యంగా ఉన్నది. అది ఒక రూపాయ కాదు, రెండు రూపాయలు కాదు. చిన్న మొత్తము కూడ కాదు. తొమ్మిది కోట్ల రూపాయలు Charged item క్రింద తీసుకొనివచ్చామంటే, అది చిన్న మొత్తమా? అంత పెద్దసొమ్మును Charged item క్రిందకు తీసుకొని రావడానికి యింతవరకు దాని సంగతి మరచిపోయినారా? మనము వాళ్లకు చెల్లించవలసిన సొమ్మంతా మరచిపోతూ మనుకున్నారా? మరచిపోయినా మనుకుంటే, ఎక్కౌంటు పొరబాటు అయినట్లే. కాబట్టి దాని సంగతి మరచిపోయినాము అని అనరు. ఎప్పుడైనా తీసుకోవచ్చును గనుక పెట్టవచ్చుననుకున్నారు. ఇవిగాక యింకా యితర details ను గురించి మాట్లాడతాను.

తరువాత Forest Department లో ఖర్చు అవసరముగా తీసుకుని వచ్చామన్నారు. ఎందుకు తీసుకొనివచ్చారు అని ఆలోచిస్తే, District Manuals తయారు చేయటానికి Additional Conservators ను వేయటానికి అన్నారు. అలాంటప్పుడు యీ రోజున అసలు ఎంతమంది Conservators ఉన్నారు? వారిని తీసుకొని వచ్చినప్పుడు ఎంత ఖర్చు అవుతుంది? Manuals తయారుచేసే విషయములో నేను ప్రభుత్వంతో ఏకీభవిస్తున్నాను. ఈ రోజున చూస్తే Revenue Board లో ఒక్క Manual యేకాదు, యింకా దేనికికూడ లేదా. అందువల్ల అది తయారు చేయటానికి వెంటనే Conservators ను వేయడము చాలా అవసరము. ఇప్పుడు ఒక విషయము తెలుస్తున్నది. ఒక Conservator సెలవులో వెళ్ళారట. ఇంకొకరిని ప్రత్యేకంగా యింకొకపనికి వేశారట. అందువల్ల మొత్తము Conservatorsను వేరే వేరే పనులకు వేస్తే యీ పనులు చేయటానికి ఎవరూకూడ లేకుండా పోతారు. [illegible] యీ బడ్జటు చూస్తే Conservators ఎవరూకూడ లేరని తెలుస్తున్నది.

24th March 1956] [Sri Vavilala Gopalakrishnayya

ఈ విధముగా చేసేటట్లయితే administration దెబ్బతింటుంది. అది సబబుగా నడిపించటానికి ప్రయత్నముచేయండి అంటున్నాను.

Sterling నిలవలలో నుంచి మనము కొంత amount adjust చేయవలసి వస్తుంది గనుక మొత్తము Superannuation amount ను ఒక్కసారే మొత్తము అంతా కడుతున్నామంటున్నారు. నాకు జ్ఞాపకము ఉన్నంత వరకు చెబుతున్నాను. నాభావములో తప్పుఉంటే నన్ను correct చేయమని ఆర్థిక మంత్రిగారిని కోరుతున్నాను. 1947 సంవత్సరము 15 వ తేదిన బ్రిటిషువారి నుంచి మనము విడిపోయినప్పుడు బ్రిటిష్ సామ్రాజ్య ఉద్యోగస్థులు యిక్కడ ఎంత మంది ఉన్నారో వారికి services క్రిందగాని, పెన్షను క్రిందగాని ఎంత డబ్బు అవుతుందో, ఆ డబ్బు అంతాగూడ లెఖ్ఖకట్టి ఒక దమ్మిడీకూడ అదనముగా చెల్లించవలసిన అవసరము లేకుండా మొత్తము లెఖ్ఖకట్టి యిచ్చామని Central Governmentవారు publish చేసిన White Paperలో sterling balancesను గురించి వ్రాసినదానిలో clear గా ఉన్నది. కాని యీ రోజున చూస్తే అది superannuation amount కానివ్వండి, లేకపోతే commutation amount కానివ్వండి, యీ విషయము మరల ఎందుకు వచ్చింది ? దానినిగురించి clarify చేయవలసిందిగా కోరుతున్నాను. అది correct అయితే, యిప్పుడు పొరబాటుగా తెచ్చారని చెప్పవలసివుంటుంది. లేకపోతే, యిది ఏ position లో ఉన్నదో తెలియజేయగోర్తాను.

మూడవ విషయం: ఉద్యోగస్థుల జీతాలలో చాలా తేడాలు ఉంటున్నవి. మనము మద్రాసు గవర్నమెంటు నుంచి విడిపోయివచ్చినప్పుడు ఇక్కడ మన గవర్నమెంటులో పనిచేయటానికి వచ్చినవారికి యిచ్చిన మొత్తములలో కొన్ని పొరపాట్లు ఉన్నవి. కొంతసొమ్ము అదనముగా ఖర్చు అయినది. ఈ అదనపు ఖర్చులు "New Services" క్రిందనో మరి యింకొక దానిక్రిందనో కనబర్చబడినవి. అందువల్ల assets and liabilities విషయములో మన ఆంధ్రగవర్నమెంటుకు వచ్చే మొత్తముకంటె, యీ ఖర్చులే ఎక్కువగా అయ్యేటట్లు కన్పిస్తున్నది. ఈరోజున నిజంగా లెఖ్ఖచూస్తే ఎంత తేడావుంటుందో గూడ తేలుతుంది. ఈ తేడా Miscellaneous క్రింద ఖర్చుచేస్తున్నట్లు చెప్పారు. మనము ఉమ్మడి మద్రాసురాష్ట్రమునుంచి విడిపోయివచ్చి యిప్పటికి రెండుసంవత్సరములు దాటిపోయింది. మూడవసంవత్సరములోగూడ ప్రవేశించాము. కొద్దినెలలలో విశాలాంధ్రకు పోబోతున్నాము. మద్రాసు ప్రభుత్వమునుంచి వచ్చినతరువాత, వారికి మనకు ఉన్న assets and liabilities ఏమిటో, యీనాటివరకైనా పరిష్కారము చేశారా ? అవి తేల్చుకోకపోతే, మరల విశాలాంధ్రకు వెళ్ళినప్పుడు

మరాట్వాడావి, కర్నాటకమువి assets and liabilities వచ్చి మన ప్రభుత్వం నెత్తిన పడడములేదా? ఇప్పుడు అవి తేల్చకపోతే, అవి అన్ని అసామతులెక్కలుగా నిలిచిపోయి, చివరకు మన గవర్నమెంటుయొక్క position ఏ స్థితిలో ఉన్నదో అంతులేకుండా అగమ్యగోచరములో పడుతుంది కాబట్టి, అవి యిప్పుడే తేల్చమని అంటున్నాను. అవి తేల్చకుండా ఆలశ్యముచేస్తే, ముందుముందు ప్రభుత్వముయొక్క పరిస్థితి చిక్కులోకి పడిపోతుందని హెచ్చరిస్తున్నాను. ఈ assets and liabilities కు సంబంధించిన accounts ను Accountant General తయారు చేస్తాడో, లేకపోతే Auditor-General తయారుచేస్తాడో, అవి ముందు తయారు చేయించాలంటున్నాను. ఈవిషయమును గురించి మేము శాసనసభ సమావేశము అయినప్పుడల్లా అడుగుతూనే ఉన్నాము. కాని ప్రభుత్వము దానికి సమాధానము చెప్పకుండా evade చేస్తూనస్తున్నారు. దీనికి కారణము యేమిటో చెప్పవలసిన బాధ్యత ప్రభుత్వముపైన ఉన్నదని తెలియదా? సమాధానము చెప్పటానికి ప్రభుత్వము evade చేస్తున్నదని నేను అంటూంటే, ప్రభుత్వము ఉద్దేశ పూర్వకముగా evade చేస్తున్నదని నేను అనడముకాదు. అందులో ఏదైనా ఇబ్బంది ఉండవచ్చు. అంటే, ఆ ఇబ్బంది యేమిటో చెప్పండి. అలాంటి ఇబ్బంది ఉంటే, మనకు దానివల్ల నష్టము వస్తున్నది గదా! కాబట్టి ఈ assets and liabilities త్వరలో తయారుచేయించి శాసనసభ ఎదుట పెట్టవలసిందిగా కోరుతున్నాను.

తరువాత Broadcasting ను గురించి యిందులో కొంత amount ను చూపించారు. మనకు ఆంధ్రరాష్ట్రము రావడమేగాకుండా, విశాలాంధ్రకూడా వచ్చింది. అది వచ్చిందని హైదరాబాదురాష్ట్రములో వున్న ఆంధ్రులే కాకుండా, యితర రాష్ట్రములలో వున్న ఆంధ్రులుకూడ ఎంతో ఆనందిస్తున్నారు. కారణమేమిటంటే, మన ఆంధ్రసంస్కృతిని నిలబ్రొక్కకోడానికి అవకాశము కలిగిందని సంబరపడుతున్నారు. Broadcasting చేసే పద్ధతిచూస్తే. ఒక్క బెజవాడ-సెంటరులోనే తెలుగుభాష నడుస్తున్నది. తక్కిన సెంటర్లలో నడవడములేదు. మనకు యిక్కడ కర్నూలుకే రావడములేదు. వినబడదు. ఇప్పుడు యీ broadcasting ను విస్తరింపజేయబోతున్నారు. ఇతర రాష్ట్రములలోగాని, విదేశాలలోగాని ఉంటే ఆంధ్రులయొక్క మనవి యేమిటంటే, మనతెలుగుభాష, అక్కడ వారికికూడా వినబడాలని అంటున్నారు. వారికి వినబడేటట్లుగా చేయుటానికి ఈ broadcasting ను 70 K.V capacity తో ఏర్పాటుచేస్తే, చాలా బాగాఉంటుంది. ఆంధ్రులు ఎక్కడ ఉన్నా [illegible] అందరికీ వినిపిస్తుంది. అవిధంగా చేయుమని విదేశ ఆంధ్రసోదరులు

కోరుతున్నారు. ఈ విషయములో మనము కేంద్రప్రభుత్వాన్ని ఒత్తిడిచేయవలసిందిగా మిత్రులు చాలామంది కోరుతున్నారు. కొత్తగాపెట్టే broadcasting centres లో ఆవిధముగా ఏర్పాటుచేస్తే, ఆంధ్రులందరు, తెనుగుభాషను దగ్గరకు తెచ్చుకున్నట్లుగా తలంచి, సంతోషిస్తారు. కొత్త centres తయారయ్యేలోగా, యిప్పుడు ఉన్న centres లోనైనా 70 K. V. capacity తో broadcasting చేయిస్తే, ఆంధ్రులకు ఎక్కువ programmes రావటానికి అవకాశము కలుగుతుంది. ఆ అవకాశము కలుగజేయవని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

Administration విషయము ఉన్నది. ఇది యిప్పటికే చాలా heavy load తో నడుపబడుతున్నది. దీనిని తగ్గించాల్సి వున్నది. ఈ విషయము ప్రతిసారి శాసనసభ సమావేశమయినప్పుడు చెబుతూనే ఉన్నాము. Administration లో పెద్ద అధికారులు ఎక్కువైనారు. చిన్న అధికారులు తగ్గిపోయారు. గ్రామాధికారులయొక్క బాధ్యతలుచూస్తే అంతులేకుండా పెంచారు. కాని వారికియిచ్చే జీతాలుచూస్తే, అందులో పెంపుదల జరుగలేదు. బాధ్యతలు పెంచినప్పుడు, జీతాలు, భత్యములు పెంచాలిగదా! అది ఎందుకు చేయలేదు? పైగా వారిపై పెత్తనంచేయటానికి అధికారులు పెరిగారు. ఇదే పరిస్థితి తాలూకా ఆఫీసులలో వున్నది. తాలూకా ఆఫీసులలో పనిచేసేసిబ్బందికి సౌకర్యాలు తక్కువగా ఉన్నవి. బాధ్యతలు పెంచారు. ఈవిధముగావుంటే, సిబ్బందిలో efficiency ఉండాలంటే, ఎట్లా ఉంటుంది? సౌకర్యాలు లేనప్పుడు efficient work నడవనే నడవదు. ప్రభుత్వముయొక్క కార్యక్రమము efficient గా, నిర్వహించబడాలంటే, తాలూకా ఆఫీసు సిబ్బందికిగాని, గ్రామాధికార్లకు, సౌకర్లకు, సౌకర్యాలు పెంచాలంటున్నాను. సౌకర్యాలుపెంచితే, దానికి తగిన ప్రతిఫలము దానివెంట ఉండనే ఉంటుంది. ఇక జిల్లా పరిపాలన చూస్తే, జిల్లాలలో కలెక్టర్లే సర్వాధికారులుగా ఉంటున్నారు. గవర్నరుకూడ అంత అధికారము చలాయించడు. గవర్నరుకులేని powers కూడా కలెక్టరుకు ఇచ్చారు. Constitutional గా అంత power కలెక్టరుకు లేకపోయిననూ, జిల్లాలో executive authority అంతా కలెక్టరిదే. ఈనాడు మనము ఏర్పరచుకున్న democratic set up కు తగిన ప్రాతిపదికనుచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఇంకను జిల్లాబోర్డులు, ప్లానింగు, యితర సలహాసంఘాలుఉన్నవి. వీటి అన్నింటినిచేర్చి జిల్లాకు ఒకటే సలహాసంఘముగాచేసి, జిల్లాపరిపాలన జరగటానికి యీ సంఘానికి కలెక్టరును కార్యదర్శిగాను, Executive Head గాను ఏర్పాటు చేయాలి. ఇకపోతే పరిపాలన నిర్వహణకు పాలిసీలను decide చేయటానికి శాసన

సభ్యులకు అధికారమివ్వాలి. ఆ విధముగాచేస్తే, యీ democratic set-up లో అన్ని levels లోనూ న్యాయముగా పరిపాలన సాగటానికి అనువుగా ఉంటుందంటున్నాను. ఇలాంటిపద్ధతిని జిల్లాపరిపాలనలో ఏర్పాటుచేస్తే ప్రభుత్వము మీదను ఒత్తిడిరాకుండా చిన్న చిన్న సమస్యలుఅన్నీ జిల్లాలోనే పరిష్కారింపజేయవచ్చు.

దేశములో యీనాడు తిండిపదార్థాలకు విపరీతముగా ధరలు పెరిగిపోతున్నవి. ధరలు పెరిగినప్పుడు ఉద్యోగములలో నుండేవారు ఎదో విధముగా అవి కొనుక్కొని జీవించవచ్చునేమోగాని, నిరుద్యోగులుగా ఉండేవారి పరిస్థితి యేమవుతుందో ఆలోచించమంటున్నాను. ఉద్యోగములో ఉండేవారు వారికి వచ్చే నెలజీతములో చాలినా, చాలకపోయినా, కొంతకష్టముతోనైనా కొనుక్కొని జీవించగలుగుతారు. నిరుద్యోగులకు యింత విపరీతధరలుపెట్టి కొనుక్కొనటానికి డబ్బు ఎక్కడినుంచివస్తుంది ? ప్రగడకోటయ్యగారుగూడ ధాన్యమునకు ధరలు పెరిగిపోతున్నవని చెప్పారు. ధర పెరిగింది ఒక్క ధాన్యమునకే కాదు. ఇతర ఆహారపదార్థాలకుకూడ ధరలు పెరిగినవి. ప్రభుత్వమువద్ద ధాన్యమునకు reserves ఉన్నాయంటున్నారు. ధాన్యము నిలవలు రాష్ట్రప్రభుత్వమువద్దలేవు. అవి కేంద్రప్రభుత్వమువద్ద ఎంతవరకు నిలవచేయుబడిఉన్నవో తెలియదు. ఇతర రాష్ట్రాల వారుకూడ నిలవజేసియున్నట్లు తెలుస్తున్నది. అట్లాఅయితే మన ప్రభుత్వంకూడ, అదేపద్ధతిని అవలంబించి, ధాన్యపుధరలు పెరగకుండాచేసి, consumer interests ను కాపాడటానికి ప్రభుత్వము దృష్టిలోపెట్టుకొని తగినచర్యలు తీసుకోవలసిన తరుణము యిప్పుడు ఏర్పడ్డది. కేంద్రప్రభుత్వము ఎంతవరకు సహాయపడగలదో తెలియదుగాని, రాష్ట్రప్రభుత్వమే, ధాన్యమును నిలవజేయాలని అంటున్నాను. ఏది ఎట్లైయిననూ రాష్ట్రప్రభుత్వము యీ విషయములో ఒక సక్రమమైన పద్ధతిని అవలంభించమని కోరుతున్నాను.

పోలీసుల విషయములోచూస్తే, Constitutional గా Changes, వచ్చాయి. ఆ మార్పుల ప్రకారము వారికి యివ్వవలసిన ఉత్తరువులు మేము యిక్కడ ప్రభుత్వమువారే యిస్తున్నామని చెప్పారు. అందుకు చాలా సంతోషమేకాని, ఉత్తరువులు యివ్వడములో యిక్కడ కర్నూలు హెడ్‌క్వార్టర్సుకు తెప్పించి యిక్కడినుంచి సప్లైయిచేసేబదులు, యీ ఉత్తరువులు అక్కడ జిల్లాకేంద్రములలోనే యిస్తేమించిది అలశ్యమునకు దోహదమివ్వకుండాపోతుంది. ఆ విధముగా చేయాలంటే జిల్లాకేంద్రములలో typewriters ను సప్లయిచేయవలసిఉంటుంది. అందువల్ల ఫీలుకావడములేదనే సమస్య బయలుదేరింది. (Interruption) జిల్లాల

లో నే యిచ్చేటట్లు ఏర్పాటుచేశామని మంత్రిగారు అంటున్నారు. కాని నాకు తెలిసినంతమటుకు మా జిల్లాలోమాత్రము అలాంటి సౌకర్యము ఏర్పడలేదు రాష్ట్ర ప్రభుత్వము యికమీదట చేయబోతారేమో నాకు తెలియదు.

P. W. D. లో ప్రమోషన్సు విషయములో ఒక విషయము మనవి చేయదలచాను. ఇంతకుముందు ఉద్యోగస్థులకు జీతాలురాలేదా అని ముఖ్యమంత్రి గారు అన్నారు. జీతాలురానిది అందరికీ కాదు. డిపార్టుమెంటులో ఎవరినైతే promote చేశారో, వారు యింతకుముందు Supervisors గాఉండి. యిప్పుడు Assitant Engineers గా ప్రమోటుచేయబడితే, ఆ promotions ను మేము అంగీకరించము అని ప్రభుత్వం అంటున్నది అవి యింతవరకు accept చేయలేదు కాబట్టి, ఆ promotions అన్నీ withhold చేశామని చెప్పారు. ఈ ప్రమోషన్సు ఎవరుచేశారో ప్రభుత్వానికి తెలియకపోలేదు. ఈ విషయము నేనే స్పష్టము చేస్తున్నాను. ఈ ప్రమోషన్సుచేసింది మన ప్రభుత్వంలోఉన్న చీఫ్ యింజనీయరే, ఆ చేయడములోకూడా ఆయన కుమారునికో, అల్లునికో అవతల 'కాల్టాక్సు'లో ఉద్యోగము యిస్తామనిఅంటే, యిక్కడ కాల్టాక్సులో సంధించినవారికి ప్రమోటుచేస్తా గ్రేడుయిచ్చారు. ఈ విధముగా చేయడమువల్ల తక్కిన senior ఉద్యోగస్థులకు అన్యాయము జరిగింది. ఒక ఉద్యోగి విషయంలో ఇదియేమి అన్యాయము ? నిజముగా efficiency ఉన్నప్పుడు, కొందరికి Grade యివ్వడము అవసరమే ! కాని efficiency కొరకు కాకుండా మరొకచోట ఉద్యోగములో Grade సంపాదించటానికి out of the way గావెళ్ళి ప్రమోషనుయిచ్చినందుకు సెక్రటరీఅడ్డుపెట్టారు. అట్లా అడ్డుపెట్టినందులకు సెక్రటరీని అభినందించవలసినదే. ప్రభుత్వమువిడిచి ఆయన బైటికి పోతున్నప్పుడు, ఆయనయొక్క సర్వీసును terminate చేసి పంపివేసినట్లయితే, యిది యితం ఉద్యోగస్థులకుకూడ గుణపాఠముగా ఉండేది. కాని అట్లాచేయలేదు.

**MR. SPEAKER** .—Mr. Pillalamarri Venkateswarlu suggested to me that cut motions will not be moved and we can continue the general discussion on 26th at the end of which the Hon. Leader of the House will give final reply. And I will put all Demands one after another. If it is the pleasure of the House, we will adopt that procedure.

**SRI R. B. RAMAKRISHNA RAJU** :—I have no objection, Sir.

**SRI P. SUNDARAYYA** :—We have no objection, Sir.

THE HON DR. B GOPALA REDDI :—That means that at the end of the debate, all the Demands will be guillotined and passed.

MR. SPEAKER :—Yes.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—తరువాత Local Development Works Grant అనేది ఉన్నది. ఇది యీబడ్జెటులోనిది కాబట్టి యీవిషయము యిప్పుడు మనవిచేస్తున్నాను. దీనిక్రింద allot చేసినటువంటి మొత్తము చూస్తే, యీ works రాష్ట్రములోగాని, దేశములోగాని ఎన్నడూ జరగనంత త్వరగా చాలా ప్రజాఉత్సాహముతో స్థానికాభివృద్ధి ప్రణాళికలు అమలు జరుగుతున్నవి. మనమందరము కూడ గర్వించదగ్గ విషయమే. ఇందుకు ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. కాని యిందులో administrative difficulty ఒకటి వచ్చింది. పని ఉండడమువల్ల Overseers ను supervisors ను కొంతమందిని మాత్రమే appoint చేశారు. కాని works చూస్తే, చాలా ఉన్నవి. ఈ పనులన్నీ terminate అయ్యేసమయము బహుశా యీ నెలాఖరుకు వస్తుంది. అవి అన్నీ supervise చేయాలంటే supervisory staff చాలా తక్కువగా ఉన్నది. అందువల్ల clerical staff చాలా తక్కువగా ఉండినందువల్ల చిక్కు వచ్చింది. కాబట్టి వీరందరికి యీ నెలాఖరులోగానే డబ్బుయిచ్చే ఏర్పాటుచేస్తే, ప్రభుత్వానికి ఎంతో కలిసివస్తుంది. లేకపోతే ముందుసంవత్సరము 30 లక్షలు allotment ఉన్నది గనుక దానిలో యీఖర్చు కలిపితే మనకు డబ్బు తగ్గిపోతుంది. ప్రమాదము, నష్టము ఏర్పడుతుంది. అందువల్ల ఆడబ్బు ఈనెలలో వచ్చేటట్లు చేసినట్లయితే, మనకు spill over లో చాలా తక్కువఖర్చు ఉంటుంది. Central Government నుంచి తీసుకువచ్చిన grant లో మనము ఎక్కువ వాడుకోడానికి వీలుంటుంది. అందువల్ల మన అభివృద్ధిప్రణాళికలలో ప్రజలను ముందుకు తీసుకొని వచ్చినట్టు అవుతుంది. అందువల్ల ఈ మొత్తాన్ని సరిచేయమని నేను మనవి చేస్తున్నాను. తరువాత ఇంకొకవిషయము చెప్పి ముగిస్తాను. సభ్యులు ప్రభుత్వానికి వ్రాసే ఉత్తరములకు జవాబు వచ్చే విధానము గురించి ఆలోచించకపోతే, వ్రాసిన ఉత్తరాలన్నీ వృథా అయిపోతాయి. నేను ఈ సందర్భంలో ఒక ఉదాహరణ చెప్పుతాను. మా ఊళ్లో ఒక చిన్న Womens' Co-operative Society ఉన్నది. దానికి grant ఏమి ఇవ్వరు. ఎన్నిసార్లు వ్రాసినా జవాబు రాదు. నేనైనా వ్రాస్తే జవాబు వస్తుందేమోనని నన్ను ఉత్తరం వ్రాయమన్నారు. [illegible] వ్రాసిన సంవత్సరానికి సరిగా అదేరోజున మీరు వ్రాసిన

ఉత్తరము మాకు చేరింది అని జవాబు వచ్చింది. వచ్చినటువంటి జవాబు అది. నా ఉత్తరం చేరిందని చెప్పడానికి కూడ ఒక సంవత్సరం పట్టింది. అంతమట్టుకైనా బదులు ఇచ్చినందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసియున్నది.

THE HON. DR. B. GOPALA REDDI.—ఇంతకూ grant ఏమైనా వచ్చిందా!

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అసలు మేము సంతోషించింది జవాబు వచ్చినందుకే. జవాబు వస్తే చాలనుకొంటిమి. అందువల్ల ఈవిధంగా నడిపితే, administration జరుగదు అని చెప్పుతున్నాను.

*SRI S VEMAYYA :—అధ్యక్షా, మొట్టమొదట, ఈ supplementary demands ను ప్రభుత్వానికి మంజూరుచేయడానికి నేను ఒప్పుకోవడంలేదు. ఎందువల్లనంటే, ఈ విధంగా Legislature యొక్క sanction లేకుండా ఎంత మాత్రము ఖర్చుపెట్టడానికి వీలులేదని audit reports లో చెప్పుతున్నప్పటికినీ. ఈ సభలో కూడ ఈ విషయాన్ని మేము పదేపదే చెప్పుతున్నప్పటికినీ, ఈవిధంగా ఇంత ఖర్చుపెట్టాము, ఇది pass చేయండి అని ఈ supplementary demands తీసుకురావడం ఏమాత్రం సబబుగాలేదు అని మనవిచేస్తున్నాను.

తరువాత, ముఖ్యంగా N. G. Os గురించి కొన్నివిషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నాను. ఈ ఉదయం, ప్రశ్నల సందర్భంలో, ఒకప్రశ్న చాలాదూరం తీసింది. దీన్నిగురించి ముఖ్యమంత్రిగారికి ఒక సూచనచేస్తున్నాను. ప్రతి department లోను, ఇలాంటి irregularities, promotions విషయంలో గాని, service commission కు సంబంధించిన విషయాలలో గాని, ఇతర విషయాలలో గాని, ఏమేమి irregularities జరుగుతున్నాయో అవన్నీ పరిశీలించి check చేయడానికి, ఒక నిష్పాక్షికమైన ఉద్యోగిని ప్రత్యేకంగా నియమించి ఒక్కొక్క డిపార్టుమెంటులో ఒక్కొక్కవారమురోజులు check చేయవలసిందిగా ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఇప్పుడు మనందరికి తెలిసినట్లు P. W. D. లో అనేక అక్రమాలు జరుగుతున్నాయి. అట్లాగే ఇతర departments లో గూడ ఏవేవో irregularities ఉండవచ్చు. కనుక ఏయే department లో ఏయే irregularities ఉన్నాయో విచారించడానికిగాను ఒక వుద్యోగిని నియమించవలసిందని సూచిస్తున్నాను. ఈ విధంగా చేసేదానికి ప్రభుత్వము సిద్ధంగా ఉన్నదా? అని నేను అడుగుతున్నాను. ఉన్నట్లయితే, ఇటువంటి irregularities అన్నీ వారి దృష్టికి తీసుకువచ్చేదానికి వీలవుతుంది.ఒక ప్రశ్నకు జవాబు చెప్పుతూ, అటువంటిదేమీ

Sri S. Vemayya] [24th March 1956

జరగలేదని ముఖ్యమంత్రిగారు చెప్పారు. ఆ సమాధానము చాలా incorrect అని చెప్పుతున్నాను. ఇది బాధ్యతవహించే చెప్పుతున్నారా అని అడుగుతున్నాను? ఏదైనా ఒక విషయము ప్రభుత్వదృష్టికి తెచ్చినప్పుడు, ఆ information ఎవరు ఇచ్చారు అని, ఇచ్చినవారిమీద charges frame చేసేదానికంటె, దీనికి ఎవరు responsible, ఏ విధంగా ఈ irregularity జరిగింది అనేది తెలుసుకోవాలి అని చెప్పుతున్నాను. ఇక్కడ service rules మొదలైనవి వున్నాయి. అవన్నీ చూస్తూఉంటాము. మాకు ఎట్లా తెలుసును అంటె, ఈ service rules మొదలైనవి library లో చదువుకొంటూ ఉంటాము. లేక వేరేవిధముగా తెలుసుకోవచ్చు. వారి తల్లిదండ్రులు చెప్పవచ్చు. లేక ఎవరో మాట్లాడుతూవుంటే విన వచ్చు. ఈకాలములో గోడకుకూడ చెవులు వుంటాయని ఎవరికైనా తెలియదా? కనుక మాకు ఏదోవిధముగా తెలిసి అది మీదృష్టికి తీసుకువచ్చినప్పుడు, ఉద్యోగస్థులమీద వీరు కోపపడి, మీరు leak out చేశారు, మీమీద charges frame చేస్తామని వారిని అనడం సబబుకాదు. ఇది నిజంగా జరిగిందా, లేదా అని దర్యాప్తు చేసి, ఎవరికి అన్యాయం జరిగిందో చూచి వారికి న్యాయం కలిగించవలసి యుంటుంది. కనుక ప్రతి department లోను ఏయే irregularities ఉన్నాయో తెలుసుకొని అవిసరిదిద్దడానికిగాను వెంటనే ఒక ఉద్యోగిని నియమించి, ఒక్కొక్క department లో ఒక్కొక్క వారమురోజులు దర్యాప్తు చేయించేటట్లు చేయవలెనని ముఖ్య మంత్రిగారికి మనవిచేస్తున్నాను. తరువాత ఈ bureaucratic officialdom అని అందరిమీద ఒక blame వేయడం అనేదానితో నేను అంగీకరించలేకుండా ఉన్నాను. అందరి వుద్యోగస్థులు చెడ్డగా వుంటారని, corrupt గా వుంటారనేది నేనుమాత్రము ఒప్పుకోను. అనేకమంది ఉద్యోగస్తులు న్యాయంగాను, సత్ప్రివర్తనతోను బాగా వుద్యోగము చేయవలెనని, ప్రజలకు బాగా సేవచేయవలెనని పనిచేస్తున్నారు. అందరు ఈ విధంగానే ఉంటే బాగుండును. కాని అనేక మందిలో లోపము వున్నది. దానిమీద check లేకుండాపోతున్నదానికి నేను విచారిస్తున్నాను. పోతే, ఈ వుద్యోగస్థులక్రింద expenditure ఎక్కువగా జరుగుతున్నది. ముఖ్యంగా gazetted staff ను అన్ని departments లోను అమితంగా పెంచుకుంటున్నారు. Non-gazetted ఉద్యోగస్థులుమాత్రము చాలా తక్కువగా వుంటున్నారు. ఇక ఈ ఆఫీసులలో పనిచూచుకొన్నట్లయితే, క్రింద తాలూకా ఆఫీసులో చాలా పనివుంటుంది. కలెక్టరు ఆఫీసులో అంతకంటె కొంచెము తక్కువగా ఉంటుంది. Heads of Departments యొక్క ఆఫీసులలో ఇంకా తక్కువగా వుంటుంది. Secretariat లో ఇంకా light గా [illegible] అనేకమంది పనిలేకుండా తిరుగుతూ ఉంటారు. [illegible]

ఎక్కువగా కష్టపడి పనిచేస్తారు. Office hours లో నే కాకుండా, తక్కినప్పుడు కూడ, holidays లో కూడ పనిచేస్తూవుంటారు. కనుక ఏ ఆఫీసులో ఎంత work ఉన్నది ? distribution సరిగా ఉన్నదా లేదా ? ఏయే department లో wastage జరుగుతున్నది, ఏయేచోట్ల ఎక్కువ కష్టంగా వున్నది, ఇదంతా విచారించవలసిన అవసరమున్నది. మన రాష్ట్రంలో 70 వేలమంది N.G.Os ఉన్నారు. ఈ 70 వేలమందిలో ముఖ్యంగా attenders. peons మొదలగు చిన్న చిన్న ఉద్యోగస్తులు చాలామంది ఉన్నారు. దాదాపు 54 వేలకు పైగా ఈ చిన్న ఉద్యోగస్తులు ఉన్నారు. వాళ్లుమాత్రము ఎక్కువగా రాత్రి పగలు పనిచేస్తున్నారు. ఆఫీసు time అనేది లేకుండా వాళ్లజీతాలు గురించి పదే పదే చెప్పినకూడ దిక్కులేదు వాళ్లు బయటికిపోతే, వాళ్ళకు ఇచ్చేటటువంటి బత్తా ఒకపూట భోజనానికికూడ సరిపోదు. కనుక వాళ్లకు కనీసం భోజనానికైనా సరిపోయేటట్లు వాళ్లబత్తాలు పెంచాలని నేను మనవిచేస్తున్నాను. ఉద్యోగస్తుల transfers విషయమై మన ముఖ్యమంత్రిగారు జవాబుచెప్పతూ, Statewide transfers లేకుండా చేస్తామని చెప్పారు. Gazetted officers ను ఎక్కడ transfer చేసినా పరవాలేదుగాని, N. G. Os. గా ఉండేవారిని, Health Inspectors, Co-operative Inspectors ఇటువంటివారిని దూరము transfer చేయకుండా దగ్గర దగ్గరనే వేసేటట్లు ఉత్తరువులుచేసి వెంటనే దానిని అమలు జరుపవలెనని మనవి చేస్తున్నాను.

లోగడ బడ్జెట్ సమావేశములో ముఖ్యమంత్రిగారు peons మొదలైనవారిని regularise చేసే విషయములో తప్పకుండా regularise చేస్తామని assurance ఇచ్చారు. నాకు తెలిసినట్టి Revenue department లో అనేకమంది 10, 15 సంవత్సరములనుంచి పనిచేస్తూ ఇప్పటివరకుకూడ temporary గానే ఉండిపోతున్నారు. అయితే Police department లో, Special Armed Police, Constables వేలకొలది సంఖ్యలలో temporary గా ఉంటున్నారు. అదే విధముగా కొన్ని Departments temporary గా వస్తున్నాయి. అందరినీ permanent చేయమని చెప్పడం సబబుకాదు. కాని అవసరమైన దానికి Department లో ఖాయపర్చవలెను. Work charge departments ఉన్నాయి. High ways maistries ఉన్నారు. High ways coolies ఉన్నారు. అట్లాగే Electricity department ను పెంచుకొంటూ పోతున్నాము. కాని ఈ ఉద్యోగస్థులను, nominal muster roll క్రిందనే temporary గా చూపుతున్నారు.

కాబట్టి కొంతమందినైనా, అనసరమైనటువంటి staff ను ఇప్పటికైనాసరే regularise చేసేదానికి పూనుకోవలెనని మనవిచేస్తున్నాను.

ఇక, చిన్న ఉద్యోగస్థులకు జీతాలు increase చేసే విషయములో, ఇన్నివేల మంది ఉద్యోగస్థులున్నారు, ఇది ఎట్లు సాధ్యమవుతుందని అనవచ్చు. ఇప్పుడు చిన్న ఉద్యోగస్థులలో, ఎక్కువ responsible గా పనిచేసేవాళ్ళలో, ఈ గ్రామాధికారులు, రైత్వారీగ్రామాలలో ఉన్నటువంటివారు 29 వేలదాకాను Proprietory గ్రామాలలో ఉన్నవారు 20 వేలదాకా ఉన్నారు. Agency లో 4 వందలువరకు ఉన్నారు వీరికి వంశ పారంపర్యంగా ఈ ఉద్యోగము ఇచ్చేటటువంటి పద్ధతిని abolish చేసి, కొన్ని కొన్ని గ్రామాలు ఒక group గాచేసి, వీరిజీతాలు పెంచినట్లయితే ప్రభుత్వానికి నష్టము ఎంతమాత్రము ఉండదని మనవిచేస్తున్నాను. ఇప్పుడు Revenue లో ప్రతిగ్రామములోను చాలా leakage జరుగుతూఉంది. ఈ గ్రామాధికారులు పట్టుపట్టి పనిచేసినట్లయితే, వాళ్లకు సరిపోయేటటువంటి జీతాలు ఇవ్వడానికి వీలవుతుంది. కనుక వెంటనే ఈ పద్ధతిని అమలుజరిపి, ఈ గ్రామాధికారులను N. G. O. లకు సమానంగా చేయవలెనని మనవి చేస్తున్నా.

THE HON. DR. B. GOPALA REDDI :—ఒక సంవత్సరం ఆ leakage లేకుండా చేయమనండి, వచ్చేసంవత్సరంనుంచి వారి జీతాలు ఎక్కువ చేస్తాము.

SRI. S. VEMAYYA :—మీరు ఆ విధంగా, ఈ ఉద్యోగాలకు వంశ పారంపర్య హక్కును తీసివేస్తామని, ఈ ఉద్యోగులని regularise చేసి N. G. Os. మాదిరిగా చేస్తామని గనుక ఒక నిర్దుష్టమైన circular పంపించినట్లయితే, అన్నిచోట్ల గాకపోయినా, కొన్నిచోట్లయినా మీకు చక్కని లెక్కలు వస్తాయని నేను మనవిచేస్తున్నాను.

ఇక జీతాలుపెంచమని అడిగితే, అది చేయటానికి వీలులేదని చెబుతున్నపుడు, దీన్ని ప్రభుత్వము ఏవిధముగా పరిష్కరించగలదు ? N.G.O లకు కనీసకోరికలనైనా మన్నించకుండా ఉండడము సబబుకాదు. తరువాత Leave rules ఒకటి పెట్టారు. Leave rules 1933 వ సంవత్సరము పూర్వమునుంచి పనిచేస్తున్నవారికి apply అవుతాయని, new leave rules అనేవి 1933, ఆదరిమిలానుంచి సర్వీసులో చేరినవారికి apply అవుతాయనిచెప్పి ప్రవేశపెట్టారు, కొంతమందికి ఒక రూలు, మరికొంతమందికి ఇంకొకరూలు పెట్టడము సబబుగాలేదు, ముఖ్యంగా

leave accumulate చేసుకునేటప్పుడే యీ రూల్సులో difference వస్తున్నది. పాతవారికి leave ఎంతఅయినా accumulate చేసుకో వచ్చు. కొత్తవారికి 3 నెలలకంటె accumulate చేయటానికి వీలులేదు. పాతవారు ఎప్పుడైనా, ఆ leave తీసుకోవచ్చు, ఇక యీ కొత్తవారు ఆ మూడు సంవత్సరాలలోగా తీసుకోకపోతే, ఆ మూడు నెలలుపైన మురిగిపోతుందని అంటున్నారు. ఆఫీసరు మంచివాడు కాకపోతే, అతనికి leave యివ్వకపోతే, యిక ఆ leave మురిగిపోయినట్లేగదా. మరల యితను leave accumulation ఒక సంవత్సరము పనిచేస్తేనే గాని ఒక నెల leave credit రాదు. ఈలోగా ఏ జబ్బుఅయినా చేస్తే జీతము నష్టముమీద పోవలసిందే. కాబట్టి కొత్తవారికి యీ leave విషయమై చాలా యిబ్బంది వస్తున్నది మేము ఎన్నోసార్లు ప్రభుత్వము దృష్టికి తీసుకునిరాగా, గోపాలరెడ్డి గారు వచ్చినతరువాత, మూడు నెలలకు బదులు నాలుగు నెలలు అని మార్చారు అయినప్పటికినీ యీ రూల్సును liberalise చేస్తేగూడ ప్రభుత్వానికి వచ్చేనష్టము యేమీలేదు ఎవరైనా దీర్ఘవ్యాధితో యిబ్బందిపడుతూ, యీ నాలుగు నెలల కన్నా ఎక్కువగా అవసరమువస్తే, అప్పుడు leave ఉండదు జీతము నష్టమే కలుగుతుంది.

THE HON. DR. B GOPALA REDDI :—ఇప్పుడు వేమయ్యగారు చెప్పేది leave on average pay సంగతి. ఇదిగాక వాళ్లకు medical leave వేరే ఉన్నది. జబ్బుచేసినప్పుడు madical leave వేరే తీసుకోనవచ్చు.

SRI S. VEMAYYA :—ఏమైనప్పటికినీ, leave rules లో ఒకరికి ఒకవిధముగాను, యింకొకరికి యింకొక విధముగాను ఉండడము సబబుగాలేదు. ఒకరు leave తీసుకుని enjoy చేస్తూంటే, యింకొకరు leave లేకుండా జబ్బుచేసినా ఆఫీసుకు పోవలసిన పరిస్థితులు ఉంటాయి. కాబట్టి యీ disparity పోవాలి అంటున్నాను. ప్రభుత్వోద్యోగి అని ఉంటే, అతనికి అందరితో బాటు ఒక leave rule ఉండాలి, కాబట్టి యీ leave rule విషయము పునఃపరిశీలనచేయమని మంత్రిగారిని కోరుతున్నాను.

తరువాత medical aid విషయముఉన్నది. ఇది కొంతమంది ఉద్యోగస్థులకు అందుతున్నది. కొంతమందికి అందడములేదు. మన జాతీయవైద్యాన్ని గూడ encourage చేస్తున్నాము, కొంతమంది డాక్టర్లనుగూడ వేస్తున్నాము, వారికిగూడ మందులు సప్లయి చేస్తున్నాము ఆ, అని గోపాలరెడ్డి గారు చెబుతున్నారు. అయితే ఏ ఉద్యోగి అయినా madical leave

Sri S. Vemayya] [24th March 1956

కావాలంటే, అతను జాతీయ వైద్యుని వద్దనుంచి సర్టిఫికేటు తీసుకొని వెళ్ళితే అది పనికిరాదు, M. B. B. S. నుంచి కావాలంటారే ఎందుకు? గెజెటెడ్ ఉద్యోగస్థులుకూడా యీ జాతీయ వైద్యుని certificate తీసుకొని వెళ్లినాగూడ, అవి చెల్లేటట్లుగా చేయాలి గాని, అది పనికిరాదని పట్టుపట్టడము సబబుగాలేదు. ప్రభుత్వము జాతీయ వైద్యమును encourage చేస్తామని అంటున్నప్పుడు, వారి certificates మాత్రము ఎందుకు పనికిరావు? Treatment ఏమో దేశీయవైద్యులవద్ద తీసుకోవచ్చునా? అయితే సర్టిఫికేటు మాత్రము M. B. B. S. వారిదా? ఇది ఒకదానికొకటి పరస్పర విరుద్ధముగా ఉన్నది. దీనికి స్వస్తి చెప్పాల్సిఉంటుంది.

తరువాత ఉద్యోగస్థులకు confidential files అనేది పెట్టారు. వీటిని తీసివేయమని నేను ఎన్నోసార్లుగా చెబుతున్నాను. కాదు ఇవి ఉండవలసిందేనని ప్రభుత్వం అంటున్నారు. అవి ఉండాలి అంటే, ప్రస్తుతము అమలులో ఉన్న రూల్సును మార్చవలసిఉంటుంది. Board Standing Orders లో నాల్గవ volume లో ఉన్న రూలు ఏమని అంటె, ఏ ఉద్యోగస్థుని మీదనైనా పై ఉద్యోగస్థుడు adverse remarks వ్రాసినట్లయితే, అవి confidential files లో వ్రాయకముందు, అవి అతనికి communicate చేయాలి. ఆ remarks ఏమిటో, దాని కారణములతో సహా అతనికి తెలియజేయాలి అని ఉన్నది. ఇది అందరికీ వర్తిస్తుంది. గెజెటెడ్‌వారికిగూడ వర్తిస్తుంది. కాని యిటువంటివి ఆ ఉద్యోగస్థునికి తెలియజేయుడములేదు. చివరికి promotions సంగతి వచ్చేసరికి, యీ remarks అడ్డమువస్తున్నవి. ఏమో! యీ లోపుగా, ఆ ఉద్యోగస్థుడు తన conduct ను మార్చుకుని మంచిదారిలోకి వస్తాడేమో! అతనికి ఆ chance ఎందుకు యివ్వకూడదు? కాబట్టి అటువంటి remarks communicate చేయటానికి, ఆ Board Standing Order violate చేయకుండా అమలు పరచేటట్లు చేయాలి. ఈ విషయము నేను యిదివరకు ప్రభుత్వము దృష్టికి తెచ్చాను. కాని యింతవరకుచర్య ఎందుకు తీసుకోలేదో తెలియలేదు. ఇకముందు అయినా చర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను. ఈ విషయములో ప్రభుత్వము వెంటనే ఎక్కడెక్కడ communicate చేయలేదో, అవి చేయించటానికి దర్యాప్తు చేయించి తగు చర్య వెంటనే తీసుకోవలసిందిగా కోరుతున్నాను.

ఇకపోతే ఉద్యోగస్థులకు medical treatment, యివ్వడము, వ్యవహారము ఉన్నది. ఏ ఉద్యోగస్థుడైనను సర్వీసులో ఉండగా, అకస్మాత్తుగా చనిపోతే, యిక అతనికి ఏ ఆధారము ఉండదు? అతని పిల్లల సంగతి ప్రభుత్వము ఆలోచించింది? [illegible] ఉంటుంది, పిల్లలు ఉంటారు. Pension లో proportionate

pension కూడ రాజాలని కదు బీదవాడుగాఉంటే, ఆ బిడ్డలు చదువుకుని పైకి మరల వాళ్లు ఉద్యోగములోనికి వచ్చేదాకా ప్రభుత్వము శ్రద్ధ తీసుకోవలెనని అంటున్నాను. కారణమేమిటంటే, సంపాదించే వ్యక్తి, యింటికి ఖామందు, చనిపోతే, అతని భార్య పిల్లలను బ్రతికించే బాధ్యత ప్రభుత్వముమీద వేసుకోవాలి అంటున్నాను. భార్య బ్రతికి ఉన్నంతవరకు అతనికి రావలసిన pension భార్యకు యిస్తే మంచిదని నా అభిప్రాయము. ఇక తక్కిన విద్య వైద్య సౌకర్యాలు యితర ప్రభుత్వోద్యోగస్థులతో బాటు అందజేయాలి. కాబట్టి యీ విధముగా అనాదిగా ఉండి అగస్మాత్తుగా చనిపోయినవారి విషయములో ప్రభుత్వము శ్రద్ధవహించాలని అంటున్నాను.

తరువాత ఉద్యోగస్థులలో ప్రమోషనులు యిచ్చే విషయము ఉన్నది. ఏ ఉద్యోగికైనా promotion యిచ్చే విషయము వచ్చేసరికి కొందరికి యివ్వడము, కొందరిని త్రొక్కిపెట్టి యివ్వకపోవడము జరుగుతున్నది. ఇదేమాదిరిగా సామాన్యముగా అన్ని డిపార్టుమెంట్లలోనూ జరుగుతున్నది. అటువంటివి జరగడములేదని ముఖ్యమంత్రిగారు చెబుతున్నారుగాని, యీ విషయము దర్యాప్తు చేయించమని వారిని కోరుతున్నాను. దర్యాప్తు చేయిస్తే వాస్తవ పరిస్థితులు బైటకు రాగలవు కాబట్టి దర్యాప్తు చేయిస్తారని ఆశిస్తున్నాను

తరువాత provident fund cum-Insurance scheme అమలు తెచ్చారని చెబుతున్నారుగాని, అవి సరిగా అమలు జరుగుతున్నట్లులేదు. ఏ వ్యక్తికైనా Provident Fund ఉన్నప్పుడు, అది అత్యంత అవసరము వచ్చినప్పుడైనను, దాని మీద అప్పు యివ్వమని అడిగితే, అది యివ్వటానికి వీలులేదని refuse చేయడము కూడ జరుగుచున్నది. ఈ విధముగా refuse చేయడము పరిపాటుఅయింది. Provident Fund మీద అప్పులు యివ్వడము, తిరిగి అది recover చేయడము విషయములో ఏదైనా circulars గాని, rules గాని ఉన్నవా అంటే, అవి యేమీ కనబడవు. పై ఆఫీసర్లకు యిష్టము లేకపోతే, యీ అప్పులు యివ్వకుండా refuse చేయడము జరుగుతున్నది. అలాంటప్పుడు యీ Provident Fund పెట్టిన ప్రయోజనము యేమిటి? ఇలాంటి పరిస్థితులు ఉంటున్నప్పుడు, N.G.Os. చాలా యిబ్బందులు పడుతూఉంటున్నారు. అలాంటివి జరగకుండా, వారికి అప్పు అవసరమని దరఖాస్తు చేసుకుంటే, అది శాంక్షను అయ్యేటట్లు చూడాలని అంటున్నాను.

తరువాత promotions యిచ్చే విషయములో మరొక విషయముగూడ చెప్పదలచాను. Revenue Department సంగతి నాకు బాగా తెలుసు. డిప్యూటీ

Sri S. Vemayya] [24th March 1956

ఏ గ్రేడు ప్యాసుఅయినా, పనిమాత్రము అంతా ఒకటే. సాధారణముగా ఒక క్లార్కు పనిచేసేటంతపని యీ Lower grade ప్యాసు అయిన Typists చేత చేయిస్తున్నారు. పని అంతా ఒకటైనప్పుడు, చిన్న గ్రేడు ప్యాసు అయినంత మాత్రాన, తక్కువజీతము యివ్వడము అన్యాయము. Lower Grade pass అయిన typist గూడ వారితోబాటు పనిచేస్తున్నారుగనుక, వీరికి వారికి జీతాలలో ఏమాత్రము తేడాలేకుండా, అందరికి సమానజీతము యివ్వాలని కోరుతున్నాను.

తరువాత కొన్ని డిపార్టుమెంట్లు ఎంతో పెరిగిపోయినవి. ప్రభుత్వానికి ఖర్చులుకూడా జాస్తిగా ఉన్నవన్న సంగతిగూడ మనకు తెలుసు. కాని ప్రభుత్వముయొక్క డిపార్టుమెంట్సులో కేవలము original work చేయకుండా, post office work మాదిరి చేసేవారు కొందరు ఉన్నారు. ఉదహారణకు Revenue Board, Revenue Divisional Officer, Deputy Super-intendent of Police, వీరు ఉన్నారు. ఇటువంటి intermediaries గా పనిచేసేవారిని తగ్గిస్తే, ప్రభుత్వానికి కొంతడబ్బు మిగులుతుంది. Retrenchment అనేది ప్రభుత్వము తలపెట్టి ముందు యీ posts అన్నీ abolish చేయాలని నేను మనవిచేస్తున్నాను. ప్రతిసంవత్సరము వచ్చే బడ్జటు చర్చలలో యీ విషయమును గురించి ప్రభుత్వానికి చెప్పుతూనే ఉన్నాము. కాని ప్రభుత్వము ఎలాంటిశ్రద్ధ తీసుకున్నట్లు కనబడదు. సభ్యులుకూడ చాలామంది యీ విషయమును గురించి అనేక సార్లు చెప్పారు. మనది లోటుబడ్జటు అంటున్నప్పుడు, ప్రభుత్వము ఈ posts ను abolish చేస్తే, లోటు కొంత అయినా పూడ్చటానికి వీలు అవుతుంది.

తరువాత Co-operative Department విషయము ఉన్నది. ఈ డిపార్టు మెంటుకు ప్రభుత్వములో యితరడిపార్టుమెంట్లకు, ముఖ్యంగా రెవిన్యూ డిపార్టు మెంటుకు, Fisheries Department కు, co-operation ఉండాల్సి ఉన్నది. Co-operation గాని, co-ordination గాని ఏమాత్రము జరగడములేదు. ఎందుకంటే Co-operative Department ద్వారా తప్ప ప్రభుత్వము ఏ సంస్థగాని, ఏ Society గాని, స్థాపించడములేదు. ఇప్పుడు fishing in the village tanks ను Fisherman Co-operative Society కి తప్ప యివ్వము అని అంటున్నారు. వేలమువేయటానికి Revenue Department వారు ఎక్కువసొమ్ము రావలెనని Fisheries Department వారు, సొసైటికి యివ్వాలని Co-operative Department. వారు పరస్పరవిరుద్ధముగా చెప్పుతారు. వారు ఇవిగాక లంక భూములు, దేవస్థానపుభూములు ఉంటున్నవి. ఇవి lease యివ్వవలసివస్తే, Field Labour Co-operative Society కి తప్ప యివ్వము అని అంటున్నారు. Society register చేయించుకునివస్తే, అప్పుడు ఆలోచిస్తామని దేవస్థానము

డిపార్టు మెంటువారు అంటున్నారు దేవస్థానపు భూములు మీకు యిస్తామని దేవస్థానంఅంటే, సొసైటి రిజిష్టరుచేస్తామని అంటారు కో ఆపరేటివ్ డిపార్టు మెంటు వారు. దీనినిబట్టి ఇక్కడ సొసైటీ రిజిష్టరుచేయరు. అక్కడ భూములు ఇవ్వరు. ఈవిధమైన పరిస్థితులు ఉండడమువల్ల departments మధ్య co-ordination వుంటుందని చెప్పటానికి వీలులేదు.

Fishing in the tanks విషయముచూస్తే చేపలు వేలమువేసేది రెవెన్యూ డిపార్టుమెంటువారు వారు ఒక రేటు fix చేస్తే, దానిని ratify చేయటానికో, consultationకో Fisheries Department కు పంపుతారు. దానిమీద వారు మరొకరేటు fix చేస్తారు. తరువాత Co-operative Department కు ఆ కాగితము వెళ్లుతుంది. ఈ విషయము అంతా dispose of అయ్యేటప్పటికి పుణ్యకాలము కాస్తా అయిపోతుంది. ఇంతలోకి చెరువులు ఎండిపోయి చేపలుచచ్చిపోయి, ఇంకా ఏదో జరిగిపోతుంది. Society వాళ్లు నష్టపడడము జరుగుతుంది. కాబట్టి యీ డిపార్టుమెంట్సులో చేసేదంతా ఒకదానికి యింకొకదానికి మధ్య పరస్పర విరుద్ధముగా ఉంటున్నది. పనులుకావు. పైగా కాలయాపన జరగడము కన్పిస్తున్నది. కాబట్టి యీవిషయము యింతమందిచేతులలో నలిగి కాలయాపన జరగకుండా, ఈ అధికారము ఎవరికో ఒకరికి అప్పజెప్పితే, కాలయాపన, నష్టములు జరగకుండా వ్యవహారము నడుస్తుందికాని, యిన్ని డిపార్టుమెంట్లుచూస్తాంటే, యిది అయ్యే వ్యవహారము కానేకాదు. సొసైటీని రిజిష్టరు చేయమంటే, భూములు మీ పేర తెచ్చుకోండి అని చెప్పడం, భూములు ఇవ్వమని అంటే, సొసైటి రిజిష్టరు చేయించుకోండి అని చెప్పడం,ఒక పనిగూడ కాకుండా జరుగుతున్నది. ఈవిధముగా పరిస్థితులు జరుగుతూవుంటే, యిది అయ్యే వ్యవహారమేనా అని అడుగుతున్నాను. ఇప్పుడు ఏదో planning నడుస్తున్నది. ఇప్పుడిప్పుడు ఏవేవో మీటింగులు జరుపుతున్నారు. మొత్తముమీదచూస్తే co-operation, co-ordination అనేది departments మధ్య చాలా అవసరము అని అంటున్నాను.

ఉద్యోగస్థుల విషయములో యింకా పాతపద్ధతులలోనే ఆఫీసుపనులు జరుపుతున్నారు. వీరికి ఒక time limit అనేది కనబడడములేదు. ఆఫీసులో పనిచేయడానికిగూడ కొంత time limit పెట్టి, అది నిర్బంధము చేయాలంటున్నాను. ఈపాతపద్ధతులు అనేది, అంటే రాత్రిళ్లుకూడ ఆఫీసులలో దీపాలుపెట్టుకుని పనిచేయడము మాన్పించాలని అంటున్నాను. ఈ విషయములో మార్పురావాల్సి వున్నది.

ఈ Heads of Departments యొక్క office లలో జరుగుతూ ఉన్నటువంటి ఈ delays ఎక్కడా జరగడంలేదని మాత్రం మనవిచేస్తున్నాను.

Secretariat లోగాని, Heads of the Departments యొక్క office లలో గాని, జిల్లా, తాలూకా level లో కంటేకూడా ఎక్కువగా delays జరుగుతున్నాయని చెప్పి నేను మనవిచేస్తున్నాను. నాదగ్గర అనేకమైన references ఉన్నవి. నేను కొన్ని విషయాలనుగురించి వ్రాస్తే అక్కడనుంచి acknowledgement రాలేదు 1952 లో acknowledge చేసి మీరు ఫలానాఫలానా తేదీలలో వ్రాసిన petitions మాకు చేరినాయి, we are examining అని చెప్పి, ఇప్పటి వరకూ final orders ఏమీరాలేదు. ఎన్నో reminders లు వ్రాశాను వాటికి జవాబురాని అనేకమైన నిదర్శనాలు assignments endowments departments లో గాని educational qualifications వగైరా విషయాలలో గాని నా దగ్గర చాలా references ఉన్నాయి. దానివిషయమైఎవరూ ఏమీ పట్టించుకోకుండా ఉండడంవల్ల ఏమిఫలితం కల్గుతుందంటే, మేము పదేపదే గవర్నమెంటును ప్రశ్నలు వెయ్యడం Department లలో ఇక్కడ లగాయతు క్రిందదాకా అందరికీకూడా బాధ కలుగుతుంది. మన కోటయ్యగారు చెప్పినట్లు ఒక M.L.A. వ్రాసినట్లయితే District Collector ఆఫీసులో N. Dis లోనో, N.R.C లోనో పెట్టేస్తే ఇంక బైటికి ఏమివస్తుంది. ఎక్కడో District Collector ల ఆఫీసులో చేయవలసినపని జిల్లాదాటి Heads of departeents offices లోనో, లేక మంత్రిగారిదగ్గర disposal కు రావడం సబబుకాదు. ఎక్కడ చేయవలసినపని అక్కడ చేసినట్లయితే బాగుంటుంది కాని ఎక్కడో district level లోనో, Taluk level లోనో చేయవలసినపని మంత్రిగారికి తీసుకువచ్చిఇస్తే సబబుకాదు. నేను దానిని అంగీకరించను. వారు జవాబుఇచ్చినట్లయితే ఇంతదూరం మాకు ప్రశ్నలురావు. Cut motions రావు. వాళ్లు సరిగాచేస్తే మనకు పనితగ్గుతుంది. ఈ delays జరగకుండా ఒక Secretary ని ప్రతి department కూ వెళ్ళి ఒకవారంరోజులు ప్రతి file తెప్పించిచూచి ఏమి Irregularities జరిగాయని పరిశీలించి, ఏమిలోట్లున్నాయో ఒక report పంపితే, ఎన్నివిషయాలు బైటకువస్తాయో మీకే తెలుస్తుంది. ఈ విషయం తప్పకుండా ఆలోచిస్తారని ఆశిస్తున్నాను.

SRI P. BAPAYYA :—అధ్యక్షా మహాశయా! ఈ Supplementary Demands బలపరచడానికి ఏ మాత్రం సందేహంలేదు. ఎందుచేతనంటే మన ముఖ్యమంత్రిగారు, ఆర్థికమంత్రిగారు ఖర్చులు ఎంతతగ్గించడానికి వీలుంటే అంత తగ్గించి పరిపాలన జరుపుతూఉన్నప్పుడు, ఈ Supplementary Budget ఆక్షేపించడానికి అవకాశమేముంటుది ? ఐతే ఈ సందర్భములో పరిపాలనలో జరిగిన కొన్నిలోపాలుచెప్పితే ముందు ముందువాటిని సరిచేసుకొనుటకు వీలుంటుందనే ఉద్దేశ్యంతో నేను మనవిచేస్తున్నాను. ఈ సంవత్సరం మా కృష్ణాజిల్లాలో, నంది

గామతాలూకాను రెండుగాచీల్చారు. రెండుగాచీల్చి నందిగామతాలూకా జగ్గయ్యపేట తాలూకాఅని రెండుచేశారు. ఇదివఱకు నందిగామతాలూకా ఒకటేఉండేది. నందిగామతాలూకాలో మునగాల పరగణాఉంది. ఆ పరగణాలోయున్న 40 గ్రామాలు చాలా దూరంలోయున్నవి. అక్కడనుంచి నందిగామతాలూకా Head-quarters కు రావాలంటే దాదాపు 40 మైళ్లురావాలి. పెద్దతాలూకాగాకూడా ఉంది. కనుక దాన్ని రెండుగా చేయవలసిందని ఆందోళనజరిగింది. అది జరిగిన చాలా కాలానికి అది అవసరంలేనటువంటి time లో జగ్గయ్యపేట తాలూకా విడదీశారు. ఈ S.R.C Report లో మునగాల పరగణా హైదరాబాదు Stateలో కలపవలసిందిగ సిఫారసుచేయబడినది. మునగాల పరగణాకూ జగ్గయ్యపేటకూ మధ్య 20 మైళ్లు Hyderabad state లోని భాగంఉన్నది. ఇప్పుడు రెండు, ఆంధ్ర తెలంగాణాలు కలిసిపోతున్నాయి కాబట్టి, ఈ మధ్య భాగాన్ని మనం కృష్ణా జిల్లాలో కలుపుకోవడమో, లేక ఇంకోవిధంగా అక్కడ జిల్లాలుమార్పు చేసుకోవడమో జరగాలి. ఇప్పుడు జగ్గయ్యపేట తాలూకా విడదీశారంటే ఖర్చులు ఎక్కువైనవి. అంతే. చివరకు Treasury లేదు. కనుక ప్రజలకు అదనపులాభమేమి లేదు. బావుల subsidy విషయంలో చాలా కాలంనుంచి చెబుతున్నాం. ఈ బావుల subsidy ఋణాలు ఆపుచేయవలసినదని చెప్పి ఒక deputation కేంద్ర ప్రభుత్వపువారిని అడిగినట్లుగా పత్రికలలోయున్నది. ఈ ఋణాలవసూలు విషయం చాలా అన్యాయంగా జరుగుచున్నది.

THE HON. DR. B. GOPALA REDDI :—వాళ్లు ఏమిచెబుతారో చూస్తాం.

SRI P. BAPAYYA :—ఋణాలు ఆపుచెయ్యడం విషయంలో నేకాదు. ఈ బావుల ఋణాలు తీసుకుని కొందరు బావులు త్రవ్వించారు. త్రవ్వించినప్పటికీ కూడా అప్పుడు inspection చేయడంలో, ఫలానా తారీఖులోగా త్రవ్వాలి, ఫలానతారీఖులోగా inspection చేయ్యాలి అని ordes ఉన్నవి. ఆ ప్రకారం త్రవ్వడంజరిగింది. త్రవ్వినప్పుడు ఉద్యోగస్థులు inspection చెయ్యడంలో ఎంత లోతు ఉండవలెనో, ఎంత వెడల్పు ఉండవలెనో ఆ విషయమై కొద్దిలోపాలుండడం చేత అవి pass కాకుండా ఆగిపోయినవి. తరువాత వారుసరిగా త్రవ్వారు. త్రవ్వినతరువాత మళ్ళీ inspection చేయవలసినదని అర్జీలుపెడితే అది [illegible] సకాలంలో చేయలేకపోయినా యిప్పటివరకు పూర్తిచేయబడిన [illegible] చేసి subsidy వదిలేస్తాం, లేనియెడల వసూలుచేస్తామని [illegible] ప్రకటనచేసి ఒక order ఉద్యోగస్థులకు దయచేస్తే [illegible] చాలయుండి

లాభం పొందుటకు అవకాశం ఉంటుంది. ఇవి ముఖ్యంగా మెట్ట తాలూకాలలోని రైతులు పడుతున్న బాధలు అధికంగా ఎంతో పెరిగిపోయియున్న వీరి విషయంలో కొంత శ్రద్ధతీసుకోవలసిందని మనవిచేస్తున్నాను.

SRI T. V. RAGHAVULU :—అధ్యక్షా, ఈ సభవారి ఎదుట ప్రవేశ పెట్టబడిన supplementary demands ను నేను బలపరుస్తూ కొన్ని సూచనలు చేయాలని అనుకుంటున్నాను. కొద్ది రోజులలో మొదటి పంచవర్ష ప్రణాళిక ముగింపు దశకు వస్తున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో అడుగుపెట్టడానికి సిద్ధంగా ఉన్నాము. దేశాన్ని అభివృద్ధి మార్గాన తీసుకువెళ్లాలి అనే ఉద్దేశంతో ప్రణాళికలను రచించుకునే సందర్భంలో ప్రణాళికలయందు నమ్మకం ఉన్నవారు అంతా ఆశించినది దేశంలో నిరుద్యోగం పోతుంది అని, కాని శోచనీయమైన పరిస్థితి ఏమిటంటే ప్రణాళిక అయిపోతున్నది కాని నిరుద్యోగ సమస్య మాత్రం తీవ్ర రూపం ధరించడమే కన్పడుతోంది. ఇది చాలా శోచనీయమైన విషయం. అమెరికాలో ఒక ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త planned economy గురించి మాట్లాడుతూ planned economy లో ఎప్పుడూ economy ఉండదని అన్నారు. మన planned economy లో plan, economy రెండూకూడా ఉండవు అనుకునే స్థితివచ్చింది. ఎందుచేతనంటే scientific planning అంటే ఒక గ్రామాన్ని గాని ప్రదేశాన్నిగాని unit గా తీసుకున్నప్పుడు అక్కడ ఉండే జనాభాను సహజ సంపదను అంతాకూడా సద్వినియోగం అయే పరిస్థితిలో ఉపయోగించుకుంటేనే Planning అవుతుంది. కాని ఒక గ్రామానికి మరుగుదొడ్డిగాని school గాని చెరువుగాని ఇవే felt needs అని అనుకుని అంతమాత్రం చేత గ్రామ సౌభాగ్యం అయిపోయిందని కలలుకనే స్థితి మంచిదికాదని అనుకుంటున్నాను. పల్లె ప్రాంతాలలో హెచ్చుమంది వ్యవసాయంమీద ఆధారపడిన వారుంటారు.

MR. SPEAKER :—పంచవర్ష ప్రణాళిక గురించి సాయంకాలం మాట్లాడవచ్చు

SRI T. V. RAGHAVULU :—Plan గురించి మాట్లాడడంలేదు. నిరుద్యోగం గురించి మాట్లాడుతున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—మధ్యాహ్నం chance కూడా రాకపోవచ్చు.

SRI T. V. RAGHAVULU :—పల్లెప్రాంతాల్లో నిరుద్యోగం చాలా హెచ్చుగా ఉన్నది. ఇదివరలో వర్ణాశ్రమ ధర్మం అమలులో ఉంటే

ఈరోజుల్లో చేతి వృత్తులమీద జీవనం చేసేవారికి జీవనోపాధులు పోయాయి. ఈ రోజున కుటీర పరిశ్రమలకు సామరితనంగా ఉండకుండా కాలాన్ని సద్వినియోగం చేసుకుని జీవనాధారం చేసుకొనడానికి ఏమైనా బ్రతుకు తెరువు చూపించాలంటే చాలా తక్కువనే అనాలి. 20 వేల రూపాయిల కిమ్మతయినపని గ్రామంలో సూచించుకోడం, సగంవారు ఇవ్వడం, తక్కినది గవర్నమెంటు ఇవ్వడం, అయినది అని అనుకోడం జరుగుతోంది. కాని దీనివల్ల ఎంతమందికి employment దొరుకు తుంది ; ఎంతమందికి దీనివల్ల purchasing power పెరుగుతోంది అనే సంగతి గమనించాలి. చదువులేని వారిలోనే కాకుండా, చదువుకున్న వారిలోను కొద్దిగా చదువుకున్న వారిలోనుకూడా నిరుద్యోగం చాలా విపరీతంగాఉన్నది. వారి భవిష్యత్తు అంధకారమయంగాను దుఃఖమయంగాను ఉంటోంది. చదువుకున్న వారిలో నిరుద్యోగం ఉండడం శాంతి భద్రతలకు మంచిదికాదని మనవిచేస్తున్నాను. తాలూకా ఆఫీసులలోని ఉద్యోగస్థులయొక్క గుమాస్తాలయొక్క జీవితాన్ని గమనిస్తే ఒక సంగతి కనబడుతోంది. వారి భారం రోజురోజుకు పెరుగుతోంది ఒక గుమాస్తా యొక్క personal register ను తీసుకుంటే రెండు సంవత్సరాల క్రితం ఉండే currents కంటె ఇప్పుడు ఆరు రెట్లు పెరిగినాయి ; పని ఆరురెట్లు పెరిగింది. Staff ను పెంచడం మాత్రం ఉండదు. తాసిల్దారుగారు జీవితంపోయినా staff ను పెంచాలని మాత్రం వ్రాయడు. ఎందుచేత, మంచివాడని అనిపించుకోవాలని కష్టపడి పనిచేస్తే ఎంతకాలం చలాయిస్తూ కాలంగడుపుకోవడం ఆయనకు కావాలి. సమర్థవంతంగా పని జరగాలంటే ఇంతపని చేయగలరా అని ఆయనకులేదు. పెద్ద ఉద్యోగస్థులను వేసినంత సులువుగా చిన్న ఉద్యోగస్థులను వేయడంకాదు. ఇది మరొక శోచనీయమైన విషయయం. తాలూకా ఆఫీసులలో ఉండే పని భారాన్ని తగ్గించడానికి staff ను పెంచడానికి ప్రభుత్వంవారు ఆలోచిస్తే మంచిదని మనవి చేస్తున్నాను. హరిజనులనుగురించి ఒకటి రెండుసంగతులు మనవిచేయాలి. Revenue Department లో ఈమధ్య ఒక G. O. ఇచ్చారు, Permanent U. D. C. అయితే తప్ప Deputy Tahsildar's list లో include చేయడానికి వీలులేదని, 40 సంవత్సరాల వయస్సు ఉండాలని, Revenue test pass అయి ఉండాలని నియమాలుకూడా ఉన్నాయి. ఈ నియమాలన్నీ మంచివే. తప్పనిసరిగా test pass కావాలి; వయస్సు 40 సంవత్సరాలుండాలి. ఇవన్నీ కాకుండా conffidential sheets బాగుండాలి. ఈ లెక్కలను బట్టి చూస్తే 11 జిల్లాలలోను ఒక్క తాసిల్దారు హరిజనుడు లేడు. 1953 లో ఒక ప్రశ్నకు సమాధానం ఇచ్చారు గవర్నమెంటువారు, అప్పటికి ఒక హరి జనుడు Sub-Magistrate గా ఉన్నట్లు. ఇప్పటికి ఒక తాసిల్దారుకూడా లేడు.

THE HON. DR. B. GOPALA REDDI :—9 మంది Deputy Collectors ఉన్నారు.

SRI T. V. RAGHAVULU :—నిజమే. Deputy Tahsildars ఉద్యోగసమయంలో Communal G. O. దృష్టిలో పెట్టుకుంటారు. Tahsildar post వచ్చేసరికి లేదు. Deputy Collectors selection సమయంలో దృష్టిలో పెట్టుకుంటారు. ముఖ్యమంత్రిగారు చెప్పినది యదార్థమే. Collector స్థాయి వచ్చేసరికి లేదు. ఇది చాలా విచిత్రమయినది. Efficiency అనే పేరు ఎవరు పెట్టారో తెలియదు. ఈ పదం రబ్బరులాగ అప్పడాలపిండిలాగ మెత్తగా సాగుతుంది. మన ఇష్టం వచ్చిన అర్థం, ఇష్టంవచ్చినట్లు చెప్పుకోవచ్చును. వేమయ్యగారు confi-dential sheets గురించి చెప్పడంలో బాధ ఎక్కడఉన్నదో అర్థంకావడం లేదు. ఒక officer అసమర్థుడనికాని అవినీతిపరుడనికాని ఉద్యోగానికి తగడు అని కాని charges ఇచ్చి explanation తీసుకోవడం జరుగదు. Promotion కు ముందు ఒక చిన్న charge ఇచ్చి loop line లోనికి త్రోసివేయడం; లేదా vague గా వ్రాయడం చేస్తారు. దీనిమీద promotion ఆధారపడి ఉంటుంది. దీనినే efficiency అనడం. మన గవర్నమెంటులో efficiency ఎంత ఉన్నదో అందరికి తెలుసు. మనం ఉత్తరం వ్రాస్తే మనతరంలో సమాధానంరాదు. ఇటీవల అమెరికాలో ఒక పెద్ద Non-official Committee వేసి అనవసరమయిన కాగితాలు వ్రాయడంలో కాలం వృధాఅయిపోతోందని వ్రాశారు. ఎన్నో Nil returns ఉంటాయి. అయినా వెళ్ళిపోవాలి, లేకపోతే గుమాస్తా తల పోతుంది. ఇటువంటివాటివల్ల కొన్నికోట్ల విలువగల డాలర్లు, కాగితం, శ్రమ, శక్తి వృధా అయిపోతోందని ఆ కమిటీవారు అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ Nil returns మొదలయినవి ఎంతవరకు అవసరమనేసంగతి అప్పుడప్పుడు విచారిస్తే మంచిది. మంత్రిగారికి ఇదివరకే ప్రగడకోటయ్యగారు సలహాఇచ్చారు. Tours చేసేటపుడు. ప్రచ్ఛన్నంగావెడితే మరీమంచిది. Pigeon holes లో ఉన్న కాగితాలు ఒక్కొక్క గుమాస్తాకు ఉన్న currents గురించి, చిన్నఉద్యోగస్థుల క్షేమాన్నిగురించి విచారిస్తే మంచిదని, వీటినన్నింటిని దృష్టిలోపెట్టుకుని మన గవర్నమెంటుకు కావలసిన సమర్థత, పేరుప్రతిష్ఠలు తెచ్చుకొనడానికి ముఖ్యమంత్రిగారు తప్పనిసరిగా కృషిచేస్తారని ఆశిస్తూ నేను విరమిస్తున్నాను.

SRI P. GOPALU REDDI :—అధ్యక్షమహాశయా. ఈనాడు ముఖ్య-మంత్రిగారు తెచ్చిన supplementary estimatesను నేనుబలపరుస్తున్నాను. ఇది [illegible]తా మామూలు మేరకువచ్చే కార్యక్రమమే అయినా కొన్నిప్రదేశాలకు ముఖ్యంగా [illegible] కార్యక్రమం ప్రభుత్వం గుర్తించకుండా ఉంటేవిషయాన్ని వారికి [illegible]

24th March 1956] [Sri P. Gopalu Reddi

చేస్తూ ఇకమీద అయినా, వచ్చే సంవత్సరంలో అయినా ఆ ప్రాంతంలో వుంటే లోపాలను గుర్తించి అవకాశం కల్పించుకుని బాగుచేస్తారని ప్రజలకు మేలు కలుగుతుందని ఆశిస్తూ కొద్దిమాటలు చెప్పదలచుతున్నాను. సుమారు 5, 6 సంవత్సరాలుగా composite Madras state లో ఉండగా కృషిచేస్తూవచ్చిన electricity schemes ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత అనేకకోట్లు ఖర్చుపెట్టబడినా సరిహద్దు ప్రాంతమని తిరుత్తని తాలూకాలో ఏమికారణమోకాని నీటివసతి ఉంటే చోట్లనే ఈ విస్తరణ జరుగకుండా ఉండడం శోచనీయంగా ఉన్నది. అనేక పర్యాయాలు ఇదివరలో మంత్రిగారికి Chief engineer గారికి మనవి చేసుకున్నాము. ప్రభుత్వానికి ఆదాయం రాగలిగిన స్కీములను ignore చేసి, విస్తరణలో అధికంగా చిత్తూరుజిల్లాలో ఖర్చుచేసినామనే ప్రతీతి తప్ప ప్రజలకు అంతగా మేలు కనిపించలేదనే విషయం గుర్తించాలని మనవిచేస్తున్నాను. రెండవ విషయం ఏమిటంటే భారతప్రభుత్వం ఇచ్చిన subsidies తో బావులుత్రవ్వినారు. అనేకమంది బావులను పూర్తిచేసినా collector గారు demand చేసి వసూలుచేస్తున్నారు. పోయిన సంవత్సరం సెప్టెంబరునెల ఆఖరులో రాష్ట్రప్రభుత్వం ఒక ఉత్తరువు జారీ చేశారు. అందులో రివెన్యూబోర్డుకు అధికారంఇచ్చిన కారణంగా కలెక్టర్లు ఏమి చేయలేకుండా ఉన్నారు. రైతులు సక్రమమైన పద్ధతిలో ఖర్చుచేసి బావులు పూర్తిచేసినా సకాలంలో officers inspect చేయనికారణంచేత, inspect చేసినా inspect చేసినట్లు వ్రాయని కారణంచేత, మునసబు కరణాలు చెప్పినమాటలు విని పూర్తిచేసినవి పూర్తిచేయనట్లు వ్రాసిన కారణంచేత అసంపూర్తి అని సకాలంలో తయారుగాలేవని రిపోర్టులు తయారుచేసి పూర్తి subsidy వసూలుచేయడానికి చూస్తున్నారు. రివెన్యూ బోర్డువారికే అధికారం ఇచ్చినందువల్ల బోర్డువరకు appeal చేసుకొని న్యాయం పొందలేకపోతున్నారు. ఇది Central Government ఇచ్చిన subsidy అని లేకపోతే రాష్ట్రప్రభుత్వమే భరించుకోవలసి వస్తుందని చెప్పారు. శ్రీ కృష్ణప్పగారు ముఖ్యమంత్రిగారి ఎదుటనే జరిగింది. వారు కూడా ఆలోచిస్తామని చెప్పారు. నిన్నఎన్నిక అయిన బలరామరెడ్డిగారు కృష్ణప్పగారితో మాట్లాడి హామీతీసుకున్నారు. కాబట్టి ప్రభుత్వంఈవిషయాన్ని ప్రత్యేకంగా ఆర్థించి subsidy కి time పొడిగించే అవకాశాన్ని కల్పిస్తారని ఆవిధంగా ఇబ్బంది పడే రైతులకు సహాయం చేస్తారని subsidy విషయం పరిష్కార మయేవరకయినా వసూలుచేయకుండా నిలుపుదల చేసేట్లు చిత్తూరు collector కు ఉత్తరువు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

రెండవది మాకు చిత్తూరు జిల్లాలో ఎటువంటి [illegible]

[illegible]

Sri P. Gopalu Reddi] [24th March 1956

విస్తరణ, ఏ చిన్న చెఱువు కాలువలు మరమత్తు వగైరాలు మాత్రమే మాకు జరుగుతున్నవి. కుశస్థలీ, అరుణానదులు తిరుత్తణి, పుత్తూరు తాలూకాలలో ప్రవహించేటటువంటివి. వర్షములు పడినప్పుడు మాత్రము జలాధారాలు ఉంటున్న నదులుయివి. అటువంటి సమయాలలో మా చెఱువులను నింపుకోవడానికి ఆ రెండు నదులే మాకు ముఖ్యాధారంగా ఉన్నవి మొన్న మొన్న శ్రీరామకృష్ణరాజుగారు వేసినప్రశ్నకు మన P.W.D. మంత్రిగారు జవాబుచెబుతూ ఇవి మదరాసురాష్ట్రానికి నీటి ఆధారంగా ఉంటూ మదరాసు పట్టణానికి నీటి ఆధారమైనటువంటి పూండి రిజర్వాయరుకు అనువుగా ఉండేటటువంటినదులే కాబట్టి ఆ నదీప్రాంతంలో ఎప్పటికైనా మనము ఏదైనా ఒక ఆనకట్ట కట్టినట్లయితే వారు 'రిట్టు, వేస్తారో లేకపోతే ఏదైనా చేస్తారో అందువల్ల మనకు ఇబ్బంది కలుగుతుందని చెప్పారు. ఆ నదీజలాలు మాకు ఏమాత్రము ఉపయోగపడని పరిస్థితికి వస్తుందనే భీతి ఈనాడు కలుగుతుంది కాబట్టి రైపేరియన్ రైట్సు మనకు లేనిపరిస్థితుల్లో వారు కావాల్సిఉంటే బావులు త్రవ్వుకోనివ్వండి, కాకపోతే వారియొక్క నీటివసతికి కృష్ణానదినుండి తీసుకొని పోవడానికి కొన్నికోట్లో లక్షలో ఖర్చుపెట్టి తీసుకొని పోనీయండి, లేక నీళ్లుఉండే చోటుగాఉంటే తీసుకొని పోవచ్చునుగాని మా నీరును మేము ఇదివరకు ఉపయోగపరచుకుంటూ ఉండేవసతిని త్రోసిపుచ్చి ఇటీవల కట్టుకొన్నటువంటివారి ఒక జలాధారానికి వారు ఈ నదులలోని నీరును ఆధారంగా చేసుకొని మమ్ములను ప్రివెంటు చేయడం అర్థంలేని విషయంగాఉంది. కాబట్టి ఈ విషయమై రైతులకు ఈ నాటికి తెలియదు కాబట్టి ఎప్పుడైనా ఈ పరిస్థితులు ఏర్పడుతుందని మేము ఎప్పుడు కూడా ఈ ఆంధ్రరాష్ట్రంలో ఉండాలని, వారు కోరుతూ ఉండే కారణాలు ఇవే. ఇదేప్రకారంగా Palar basin అనే ఒకటి ఇప్పుడు create అయి సుమారు 1½ తాలూకా ప్రజలు ఒక్క బావికూడా త్రవ్వుకోవడానికి అవకాశము లేనట్టి పరిస్థితుల్లో చిత్తూరు జిల్లా పలమనేరుతాలూకాలోని రైతులు ఈలాంటి దురవస్థపాలై కష్టపడుతూ ఉండడం ప్రభుత్వ దృష్టికితెస్తూ అటువంటి ఇబ్బందులు లేకుండా ఆ నదీజలాలు ఎంతవస్తుందని అంచనా వేసిఉన్నంతవరకు చిన్న చిన్న ఆనకట్టలైనా కట్టి వర్షాకాలంలో ఆ నీటిని మా చెఱువులకు ఉపయోగపడేటట్టు చేయవలసిన వసతులను ఏర్పాటుచేస్తారని ప్రభుత్వం వారికి మనవిచేస్తున్నాను. మరొక చిన్న విషయం, గ్రామోద్యోగస్థులు పదేపదే అనేక పరిస్థితులలో వారికి ఇచ్చేటటువంటి స్వల్ప జీతాలు చాలలేదని అల్లాడుతున్నారు. ముఖ్యంగా మనవిచేయడం ఏమిటంటే చిత్తూరు జిల్లాలో అత్యధిక గ్రామాదులు జమీందారీ గ్రామాదులుగ ఉన్నాయి. [illegible] జమీందారు ఒక్క జీతము ఇస్తున్నారనుకోండి, అదియే పది రూపాయలలో

పదుశోకండు రూపాయలలో ఇస్తున్నారు. అదేవిధంగా ఆయా గ్రామాల జమీందారు పది రూపాయలలో, పన్నెండు రూపాయలలో ఇస్తూ వచ్చినారు గ్రామ మునసబులకు ఇచ్చిన విధంగానే కరణాలకు, తలారులు వగైరాలకు ఇస్తూవచ్చినారు. ఈ రెండు జీతములు తీసుకొని వారు అటు estate పనిన్నీ ఇటు గవర్నమెంటు పనిన్నీ చేస్తూవచ్చిన కారణంతో వారి జీవితం ఒకవిధంగా గడచిపోతూ వచ్చింది. 1950 వ సంవత్సరములో జమీందారి అబాలిషన్ చట్టం ప్రకారం గ్రామాదులు ప్రభుత్వంవారు తీసికొన్న కారణాన ఆ జమీందారీ ఇస్తూ ఉండేటటువంటి డబ్బు ఇంత అని ప్రభుత్వంవారికి లెక్కలు ఇవ్వని దోషంవలన వారిని, కొంత మందిని ఈ గ్రామ నౌకరులు village ముద్దాములు వగైరాలను మూడు నెలలకు మునుపే నివృత్తి పరిచేసి ఈ యొక్క ఖర్చు గ్రామముమీద ఉన్నదీ అని చూపించకుండా లెక్కలను తయారుచేసి ఇచ్చిన కారణాన ప్రభుత్వము ఈనాడు ఇవ్వలేకుండా ఉండే పరిస్థితుల్లోకివచ్చింది. ఆనాడు మొదలుకొని సుమారు 5 సంవత్సరములుగ పని ఒకే రీతిగాను ఒకే నియమిత ప్రకారముగనూ లేదు. అప్పటికి ఇప్పటికీ చూచినట్లయితే ఒకటికి మూడు ఇంతలు పని పెరిగి పనిచేస్తూ ఉండినప్పటికి ఒకేజీతముతోనే వారు పని చేస్తున్నారంటే వారి ఆందోళన న్యాయమైనదని సక్రమమైనదని మనము మన ప్రభుత్వము తప్పనిసరిగా భావించి వారి జీతములు హెచ్చుచేయాలని మనవి చేస్తున్నాను. ఇప్పటికీ వారికీ retrospective effect తో వెనుకటి జీతాలు ఇస్తారు అని వారందరూ ఆశతోఉన్నారు. తుదకు ఈ ఫసలీనుంచి అయినా వారికి జీతాలు వస్తుందనే ఆశతో ఉన్నారు. అటువంటి ఏర్పాటుకు ఏమీ మనము ఈనాడు Budget లోగానీ Supplementary Demand లోగాని సూచించక దానికి చిక్కులి శోచనీయంగా ఉన్నది. కాబట్టి మరుఫసలీలోనైనా వారి జీతాలన హెచ్చించి కనీసం రైత్వారీ గ్రామాల్లో తక్కువ జీతములుఉండే పద్ధతిలోనైనా వీరినందరిని జమీందారీ రైతు గ్రామాలలో ఉండినటువంటి కరణములు, ముద్దాములు, గ్రామ మునసబుల జీతాలను పెంచవలెనని ప్రభుత్వాన్ని కోరుతూ ఈ అవకాశము ఇచ్చినందులకు అధ్యక్షులవారికి నాయొక్క నమస్కృతులను అర్పించుతున్నాను.

Mr. SPEAKER.—I now adjourn the House to meet again at 5-00 p.m. to-day to discuss the draft outline of the Second Five Year Plan.

5 p. m.

## IV. GOVERNMENT MOTION.

### *Draft Outline of the Second Five-Year Plan.*

SRI P. KODANDARAMAYYA:—అధ్యక్షా, శ్రీ కళా వెంకట్రావు గారు కూర్చునే ఉపన్యసించుటకు అనుమతించగోరుతాను.

[24th March 1956

MR. SPEAKER:—శ్రీ వెంకట్రావుగారు కూర్చుని ఉపన్యసించవలసిన దనే నా అభిప్రాయం.

THE HON. SRI K. VENKATA RAO :—Mr. Speaker, Sir, I beg to move :

> "That the Draft Outline of the Second Five Year Plan received from the Planning Commission be taken into consideration."

ఇదివరకు plan సందర్భంలో ఒకసారి విపులంగా మనం చర్చించాము. రెండోసారి Revised Draft మనకు వచ్చినతరువాత యీ సభలో నేను ఒక statement కూడా చేసిఉన్నాను. ఇప్పటికి Planning Commission వారు ఒక చిత్తు ముసాయిదా తయారుచేసి మనకు పంపించారు ఆ పుస్తకాలు సభ్యులకు యిచ్చాము. Revised Draft Plan కూడా యిచ్చాము ఇవ్వాళ చాలా పుస్తకాలు దీనికి సంబంధించినవి ఈమధ్యనే అచ్చువేసినవికూడా అందరి సభ్యులకు అందచేయబడ్డవి. ఇవ్వాళకూడా నాకున్న అనారోగ్యంవల్ల మీరు నాకు కూర్చుని మాట్లాడే అనుమతి యిచ్చినందుకు చాలా కృతజ్ఞుడను. అంతేకాకుండా నేను ఇవ్వాళ చెప్పబోయే ఉపన్యాసంలోని కొన్ని హంశాలు తెలుగులోను, కొన్ని ఇంగ్లీషులోను అచ్చువేసి సభ్యులకు యిప్పుడే పంచిపెట్టి ఉన్నారు. ఇంక వాటిలో చెప్పనివిషయాలు మాత్రం తమదగ్గర కొంచెం మనవి చేయదలచుకున్నాను. ఈ Plan చర్చించినప్పుడు మనం దేశాన్ని దృష్టిలోపెట్టుకుని యీ ప్రణాళిక అంటే ఏమిటి, అసలు యీదేశంలో వుండేటటువంటి ఆర్థికాభ్యుదయంకోసం ఎలా కృషిచేయడానికి యత్నాలు జరుగుతున్నవి, యీ ద్వితీయపంచవర్ష ప్రణాళికలో మన ఆదర్శం ఎంతవరకు అమలులోపెట్టగలిగాము, దీనిని యింకా యేమయినా వున్న పరిమితిలోపల బాగుచేయడానికి వీలుంటుందా అనే విషయాల్ని ముఖ్యంగా దృష్టిలోపెట్టుకుని చర్చచేయవలసినదని కోరుతున్నాను. నిన్ననే ప్రతిపక్షనాయకులు సూచించినట్టు ఆ ఊర్లో ఉన్న రోడ్డుగురించిగాని కాలువగురించిగాని స్థానికమైన వ్యవహారాలు చర్చలో తీసుకురావలసినటువంటి అవసరంలేదు. అవి ఎప్పటికప్పుడు వచ్చే ఆయిదేండ్ల Budjet లలో మనకు వస్తూనేవుంటాయి. వివరాలన్నీ మనం అప్పుడు చర్చచేసుకోవచ్చు. ఇప్పుడు Broad గా వున్నటువంటివిషయాల సమీకరణ దృష్టిలో పెట్టుకొని నేను చెప్పినమార్గంలోనే చర్చచేయవలసినదని నా ప్రధానమైన కోర్కె. రెండో ముఖ్యమైనవిషం తమదృష్టికి తీసుకురాదలచాను. ఇదివరకు పంచిపెట్టిన కాగితాలన్నింటిలోకూడా revised allocation మన రాష్ట్రంలో 116.2 కోట్లు యిచ్చినట్లువ్రాశాము. ఇప్పుడు మొన్న Planning

24th March 1956] [Sri K. Venkata Rao

Commission దగ్గరనుంచివచ్చినట్టి ఉత్తరం ప్రకారం దీనిని 118.843 కోట్లకు ఎక్కువ చేశారు. ఈ ఎక్కువమనం మళ్ళీ మన Planning ప్రణాళికలలో చెర్చుకోవలసిఉన్నది అంతేకాకుండా Community Blocks గురించి Flood Control schemes గురించి Government of India వారు యివ్వవలసిన మొత్తాలు యింకా మనకి తెలియపరచివుండలేదు. కనుక అది యీ మొత్తంలో చేర్చలేదు. ఇంకో ముఖ్యమైన విషయం దృష్టిలో పెట్టుకోవలసినది ఏమిటంటే యీ Planning లో రెండు భాగాలున్నాయి. ఒకటి మన రాష్ట్రానికి వచ్చేటటువంటి రాబడి, రెండోది మనం పెట్టుబడి పెట్టేటటువంటి భాగం. ఈ రెండింటినీకూడా మనం సమీకరణం చేసుకోవలసిఉన్నది. ఈ చర్చించడంలో 118 కోట్లు కాకపోతే 218 కోట్లు యిచ్చారనుకోండి. మనం 218 కోట్లరూపాయలలో మన రాష్ట్రానికి వచ్చేటటువంటి revenue ఎంత, మనం ఎంత హెచ్చుచేసుకొంటే అది ఖర్చుపెట్టగలము అనేదికూడా దృష్టిలో పెట్టుకోవాలి. అంతా అప్పు చేసి పెట్టడానికి వీలులేదు కొంత మన రాబడిలోంచి పెట్టుకోవలసిన అవసరం ఉన్నది కాబట్టి అదికూడా మనశక్తి సామర్థ్యాలు దృష్టిలోపెట్టుకుని చర్చచేసుకోడం అవసరమనికూడా మనవి చేస్తున్నాను ఇంకా, అందరికీ తెలిసిన విషయమే, మన కోర్కెలు చాలా ఉన్నాయి. అవసరాలు అంతకంటె ఎక్కువగా వున్నాయి. కాని మనయొక్క resources, అసలు మన శక్తిసామర్థ్యాలకు ఉన్నటువంటి ఆర్థికపునాది మనకున్నటువంటి కోర్కెలు ఈ రెండింటినీ సమీకరణ చేసుకుని మనయొక్క వ్యవహారం చేసుకోవలసిన న్యాయంకూడావున్నదని మనవి చేస్తున్నాను. మొన్న ఒకనెలరోజులక్రితం అమృత్సర్‌లో భారతజాతీయ సాంవత్సరిక సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ఆర్థికవిధానాలు గురించి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక గురించి చాలా చర్చజరిగి ఒక ముఖ్యమైన తీర్మానం చేసి ఉన్నారు. దీనిలో ఉన్నటువంటి ఒకటి రెండు ముఖ్యాంశాలు తమకు ఎందుకు మనవి చేస్తున్నానంటే యీ రోజున దేశంలో, కేంద్రంలోనూ బహు రాష్ట్రాలలోనూ కొంచం హెచ్చు తక్కువగా అన్ని రాష్ట్రాలలోనూ కూడా కాంగ్రెసే పరిపాలనలోవున్నది కనుక వారియొక్క రాజకీయ ఆర్థిక కార్యక్రమాలు ఎలావున్నాయి, ఆ కార్యక్రమాలను అమలులోకి తెచ్చేటటువంటి యత్నంలో యీ పంచవర్ష ప్రణాళిక యిదివరకు ఎంతవరకు తోడ్పడింది, ఇకముందు ఎంత వరకు తోడ్పడనున్నది అనేటటువంటిది మనం గుర్తింపులో తెచ్చుకుందుకు వీలుగా వుంటుంది.

Avadi resolution లో ఉన్నటువంటి 2, 3, ముఖ్యమైన భాగాలేమిటంటే

Sri K. Venkata Rao] [24th March 1956

"The Avadi Session of the Congress laid down that in order to realise the object of the Congress and to further the objectives and directive principles laid down in the Constitution of India planning should take place with a view to the establishment of a socialistic pattern of society. The Congress further defined broadly the economic content of such a socialistic structure. These decisions of the Congress were widely welcomed and gave a new direction to the programmes of planned development of the country. Economic and social planning must therefore keep the same objective in view and further it."

తరువాత ఇంకొక భాగంలో

"The claims of social justice both in its individual and regional aspects should always be kept in view and should be made through changes in economic organisation and suitable administrative and fiscal measures. Existing disparities in income and wealth should be progressively removed. Special attention should therefore be paid to removing the disadvantages of the economically backwardness sections of the people. A socialistic structure of society necessarily involves equality of opportunity for all and a progressive equalisation of income. The same should always be kept in view and the endeavour should be to ensure the benefits of the economic development accrued to the less privileged classes of society until their standard of living rises."

ఇంకా ఈ తీర్మానం చివరలోయిలా ఉన్నది.

"Planning is a great adventure in building up the country and the lives of 370 millions of people. It involves an effort not only from the Central and State Governments and the official machinery but more particularly the enthusiastic support and participation of the people at every step. The message of the Plan should reach every part of the country so that every citizen can know the promise which the Plan holds out for him and the obligations which it creates. It is a unique adventure in partnership and co-operation of hundreds and millions of the people of the country."

24th March 1956] [Sri K. Venkata Rao

ఇదిఅంతా సూక్ష్మంగా తెలుగులో చెప్పాలంటే; ఆవడి కాంగ్రెసు మహా సభలో pass చేసినటువంటి తీర్మానానుసారం socialistic pattern of society అనే భావముతోటిచేయ బడిందో, దాంట్లో ఏమి భావముఉన్నదో. దీనినే ప్లాను అమలులోకి తీసుకువస్తున్నది. ఈ ప్లానును అమలులోకి తీసుకు రావడను విషయములో, ప్రజాసహకారము పూర్తిగా అవసరము ఉన్నదని, అటువంటి సహకారములంభినప్పుడే, ఈ వ్యవహారము అంతా బాగా జరుగుతుందని, ఈ కార్యక్రమము క్రింద బీదవారియొక్క ఆదాయపరిమాణము ఎక్కువకావడమే కాకుండా, వారి సౌఖ్యములకు అభివృద్ధి చేస్తే, హెచ్చు ఆదాయముల, స్వల్ప ఆదాయముల మధ్యఉన్న వ్యత్యాసాన్ని చాలావరకు తగ్గించే భావముతోటి వ్యవహారం జరిగిందని, దీనిని మనం ఆచరించవలసిందని దీంట్లో చెప్పబడింది.

ఇది మనస్సులో పెట్టుకొని మనం చర్యలకు దిగినప్పుడు దేశంలో ఇంతవరకు జరిగిన విషయాలనుగురించి మనం ఆలోచించుకోవాలి. మొట్టమొదట 1951-వ సంవత్సరములో మనదేశంలో ఈ ప్రణాళిక తయారుచేయబడ్డది. అప్పుడే యుద్ధము పూర్తి అయి దానియొక్క పరిణామములు ఇంకా దేశంనిండా ఉన్నాయి. 1951 సంవత్సరములోనే మన దేశమును రెండు భాగాలుగా విభజించడమువల్ల ఏర్పడినటువంటి ఆర్థిక క్లిష్ట పరిస్థితులుకూడా అప్పుడు ఉన్నాయి. మరల తక్షణమే కొరియా యుద్ధము రావడమువల్ల దేశంలో inflationary pressure (ఉత్పత్తికంటే ఎక్కువ ధనాన్ని దేశంలో చలామణిలో పెట్టడం) వల్ల ఏర్పడిన కష్టాలు కొన్ని ఉన్నాయి. దేశంలో ఆహార కొరత ఏర్పడినది. ముడి పదార్థాల కొరత ఏర్పడినది. కాని మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేప్పటికి ఆ కొరతలన్నీ కూడా సమసిపోయినాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక దీనిని ఎట్లా ఎదుర్కొన్నదని మనం ఆలోచించినట్లయితే, ధనంయొక్క చలామణి దేశంలో తగ్గిపోయింది. అన్ని వస్తువుల ఖరీదులు తగ్గాయి. నిన్నటిదాకా ఖరీదులు తగ్గినవని ఒక పోరాటము, నేడు ఖరీదులు ఏదుగుతుంటే తగ్గుటకొరకు మరొక పోరాటమును మనము చేస్తున్నాము. మొదటిది ఎవరు చెప్పారో సాధారణంగా రెండవదికూడా వారే చెప్పుతూంటారు.

భోజన పదార్థములయొక్క ముడిపదార్థములయొక్క కొరత చాలావరకు తగ్గింపబడటమే కాకుండా, మనం అనుకున్న దానికంటే దేశంలో అవి పుష్కలంగా లభిస్తున్నాయి. 170 లక్షల ఎకరాలు కొత్తగా నీటిపారుదల క్రింద చేర్చబడ్డాయి. 10 లక్షల కిలోవాట్ల శక్తిగల విద్యుచ్ఛక్తి నూతనంగా ఉత్పత్తి అవుతున్నది. దేశంలో ఉన్న పరిశ్రమలయొక్క ఉత్పత్తి 100 కి 41 వంతుల చొప్పున పెరిగినది. మనదేశం ఇతర దేశముల ద్వారా ఎగుమతులు,

Sri K. Venkata Rao] [24th March 1956

దిగుమతులవల్ల ఖర్చుఅయ్యే డబ్బుయొక్క వ్యత్యాసం చాలావరకు తొలగిపోయి, ఇప్పుడు చాలా తక్కువ అయింది. దేశంలో రైళ్లు, రోడ్లు ఇతర రవాణా సౌకర్యములు, టెలిగ్రాఫ్ వగైరా సౌకర్యములుకూడా చాలావరకు ఎక్కువ అయినవి. విద్యావిధానములోను, ప్రజారోగ్యములోనుకూడా కొంతవరకు అభ్యుదయము మనకు కనుపించుచున్నది.

వాటన్నింటితోటి మనయొక్క సమస్యలు పరిష్కారము అయినాయని, దానితో మనము Socialistic Pattern of Society అనేది దేశంలో పూర్తిగా అమలుజరిపామని అనుకునేందుకు వీలులేదు. కాని దేశంలో మనం మొట్టమొదటగా అనుసరించిన mixed economy విధానం, సోషలిజముకు కాపిటలిజముకు మధ్య మార్గంలో నడచే విధానం, మార్పుచేయబడి ఒక నిర్ణీతమైన దృక్పథంలోకి దేశం వచ్చిందని మనం గుర్తించవలసి ఉన్నది. ఇందుకు దోహదమిచ్చే గట్టి చర్యలను ప్రభుత్వం తీసుకున్నదనే సంగతి మనకు అనేక విషయములనుబట్టి బుజావు అవుతుంది. దేశంలో ఇంపీరియల్ బ్యాంకు, స్టేటు బ్యాంకు అయిపోయినవి మన రాజ్యాంగ చట్టాన్ని సవరించి దాంట్లో ఇవ్వవలసిన నష్ట పరిహారాన్ని చాలావరకు ప్రభుత్వముయొక్క న్యాయ దృష్టికి లోబడేటట్లుచేసి కోర్టులయొక్క వ్యవహారాన్ని కొంతవరకు తగ్గించారు. దేశంలో పన్నులు ఎక్కువవేసి లాభాన్ని కుదిమట్టంచేసే ప్రయత్నము జరిగింది. కంపెనీ law కొత్తగా శాసనముజేసి షేర్ హోల్డర్లకు ఎక్కువగా అధికారములు ఇచ్చి, మానేంజింగు డైరెక్టర్లయొక్క శక్తిని కంట్రోలు లోకి తీసుకువచ్చే వ్యవహారము జరిగింది.

Working journalists కు, newspapers లో పనిచేసే వారికి సహాయముచేసి, వారికి trade unions వగైరాలు ఏర్పాటుచేయడానికి ప్రయత్నము జరుగుతున్నది. జీవిత భీమాను జాతీయ పరము చేయడంకూడా జరిగింది.

ప్రత్తిని, మిల్లులుబాహాటంగా కొనుక్కొనే ఏర్పాటు జరిగింది. భోజన పదార్థములకొఱత తగ్గడమువల్ల Inter zonal గా కొన్నికొన్ని రాష్ట్రములకు వెళ్లకూడదన్న విషయము తొలగించబడ్డది. పంచదారను చాలా విస్తారంగా ఇతర దేశాలకు పంపేఏర్పాటులు చేయబడ్డాయి. Industries లో కొన్నింటికి control పెట్టారు. Steel, Cement, ఉక్కు ఎరువులు వగైరాలు ఎక్కువగా అభివృద్ధిలోకి తీసుకువచ్చారు. Consultation Machinery ద్వారా Trains యొక్క ఉపయోగము ఎక్కువచేశారు. Export, Import controls చాలావరకు [illegible]. వస్తువులధరలు పెంచేవారికి నష్టములేకుండా ఉన్నాయి. Monthly [illegible] 200 [illegible] internal prices ఎక్కువ

అవుతున్నాయి. దేశంలో రాష్ట్రాలయొక్క కొనుగోలుశక్తి ఎక్కువ అయినది. ఉత్పత్తి ఎక్కువ అయినది. జాతీయ ఆదాయము ఎక్కువ అయినది. అన్ని రకాలుగా మనయొక్క భావాలు అమలులోకి వచ్చాయని మనం చెప్పటానికి వీలుగా ఉన్నది. ఇప్పుడు latest position ప్రకారము పారిశ్రామిక ఉత్పత్తి 158.7 రూపాయలు ఉన్నది. మనదేశంలో ఎక్కువగా ముడిపదార్థాలు లభిస్తున్నాయి. గతసంవత్సరంకన్నా, ఈసంవత్సరం దేశంలో వీటిఫలితం ఎట్లా ఉన్నదో మనం చూచుకోవలసిన అవసరము ఉన్నది. మిల్లులలో తయారుచేసిన బట్ట 50940 గజాలకు పెరిగింది. గతసంవత్సరము 49 కోట్ల గజాలకుపైన ఉన్నది. చేనేతవస్త్రి ఉత్పత్తి 1318 మిలియన్లనుంచి 1454 మిలియన్లవరకు పెరిగింది. Powerloom cloth ఉత్పత్తి 243 మిలియన్లనుంచి 273 మిలియన్లవరకు పెరిగింది. మనం విదేశాలకు ఎగుమతిచేసే సరకుల ఖరీదు 563 కోట్లనుంచి 614 కోట్లకు పెరిగింది. మన Imports 616 కోట్లనుంచి 644 కోట్లకు పెరిగింది. మన దేశంలో మొత్తం వర్తకము 1179 కోట్లనుంచి 1248 కోట్లవరకు ఎక్కువ అవడము వల్ల, Trade deficit 53 కోట్లనుంచి 40 కోట్లకు తగ్గడం, అన్నింటిమీద కొత్త వర్తకము 69 కోట్ల రూపాయలు పెరగడముకూడా జరిగింది.

నేను చెప్పిన విషయాలనన్నింటిని దృష్టిలోపెట్టుకొని ఆలోచించినట్లయితే 2వ పంచవర్ష ప్రణాళికలో మన ఆర్థికాభ్యుదయం ఎట్లా పెరుగుతుందో తెలుసుకొనుటకు వీలవుతుంది. దేశంలో ఇంకా కొన్ని సమస్యలను పరిష్కారం చేయవలసియున్నది. దేశంలో అనేకమందికి ఉద్యోగాలను యిచ్చేస్థితిలో ఉన్నాము. Agriculture commodities కు ఒకమాటు ధరలుపెరుగుట, ఒకసారి తగ్గుట జరుగుచున్నది. వీటిని ఒకపరిమాణంలో నిలువుచేయవలసిన బాధ్యతవున్నది. Standard of living ఇంకా పెరుగుతున్నది. పెరుగువలసినంత పెరుగుటకు కృషి చేయవలసియున్నది. దానికి 2,358 కోట్లు ఖర్చుపెడదామనుకున్నారు. అదికూడ కొంతవరకు తగ్గినది. క్రొత్తగా వచ్చిన రిపోర్టులప్రకారం మనం అనుకొన్నంత తగ్గుదల లేనందుకు సంతోషించాలి. క్రిందటిమాటు నేను మాట్లాడినప్పుడు మన రాష్ట్రంలో 69 కోట్ల రూ॥లకు బదులు 59 కోట్ల రూ॥లు ఖర్చుపెడదామేమో అనే భావాన్ని వెల్లడించాను. కాని ఇప్పటివరకు వచ్చిన rough estimates ప్రకారం చూసినట్లయితే 64 కోట్లవరకు ఖర్చుపెట్టుటకు అవకాశము ఉన్నట్లు తెలియుచున్నది. మన రాష్ట్రంలో 92%, 93%, వరకు ఖర్చు తేలేటట్లు కనిపించడంకూడా సంతోషదాయకమయినవిషయం. అట్లాగే ఇతరరాష్ట్రాలుకూడా చేసినట్లు ఢిల్లీనుంచి వార్తలు తెలియుచున్నవి. ఎక్కువ ఉత్పత్తి, నిరుద్యోగసమస్యా పరిష్కారం, దేశంలోవున్నటువంటి ఆర్థికఅసమానత్వాన్ని తగ్గించుకొనుట మున్నగువాటినిగురించి మనంప్రయత్నించే

Sri K. Venkata Rao] [24th March 1956

టప్పుడు మనం జాగ్రతగా ఆలోచించుకోవాలి. మనకు ఇప్పుడు balanced diet కావలసిఉన్నది. మనం తినే భోజనపదార్థాలలో జీవకణములనిచ్చేటటువంటి శక్తిని అందరికీ లభించేటట్లు చేయాలి. ప్రజలందరికీ కావలసినన్ని వస్త్రములు లభించేటట్లు చేయాలి. ఇళ్లు, విద్య మొదలగు సౌకర్యములు ఉండేటట్లు చేయాలి. ఆరోగ్యపరిస్థితిని దృష్టిలో ఉంచుకొని మిగిలినపనులు చేస్తూవుండాలి. దేశముయొక్క జాతీయాదాయాన్ని పెంచి, దానిలోని భాగము ప్రజలందరికీ అందుబాటులో ఉండేటట్లు చేయాలి. జాతీయ ఆదాయం 10,000 కోట్లనుంచి 15,000 వరకు పెరిగే అవకాశాలున్నాయి. దీనిని బహుజనానికి అందేటట్లు చూడవలసిన బాధ్యత మనకు ఉన్నది. నెహ్రూగారు "The concept of Planning is not to think of money we have got, and divide it to schemes and priorities" అని చెప్పినారు. ఈ పని ఆఫీసులోఉండే ఒక గుమాస్తా చేయగలడు.

"but it is based on physical needs, that is to say, what do the people of India need, how many schools, how much cloth, how much housing, how much education, services etc."

వీటినన్నింటినీ దృష్టిలో ఉంచుకొని రెండవ పంచవర్ష ప్రణాళిక తయారు చేయడంజరిగింది. ఇవన్నీ మనకు కావాలంటే మనకోర్కెలను, మనకున్న ఆర్థికస్థితిని సమన్వయం చేసుకోవాలి. వస్త్రములను, భోజనపదార్థములను గృహములను ఎక్కువ చేసుకోడానికి మనం ప్రయత్నించాలి. ముడిపదార్థాలను ఎక్కువ చేసుకోవలసియున్నది. మనకు కావలసినటువంటి యంత్రాంగమును, యంత్రభాగాలను తయారుచేసుకొనుటకు ప్రయత్నంచేయాలి. దేశంలోఉన్న వయోజనులందరికీ శక్తివంతమైన, క్రమమయిన పద్ధతులు ఉండేలాచేయాలి. మనకు కావలసినన్ని ముడిపదార్థాలు, బలవంతులైన జనాభా ఉన్నది. ఈ రెండింటినీ సద్వినియోగం చేసినట్లయితే నేనుచెప్పిన వ్యవహారమంతా నిరాటంకంగా పూర్తిచేయుటకు వీలుంటుంది అనుకొంటున్నాను. Balanced diet పొందుటకుకూడ కొన్ని పద్ధతులున్నాయి. మనం భుజించే ఆహారపదార్థములలో పాలు, నెయ్యి, మాంసము, చేపలు కోడిగ్రుడ్లు, క్రొవ్వుపదార్థములు, పండ్లు, కూరగాయలు, పంచదార మొదలగు వాటినన్నింటిని తీసుకొనుటవలన మన ఆరోగ్యం బాగా ఉంటుంది. ఈ పదార్థాలను ఎక్కువగా పుచ్చుకొనుటవలన జీవకణములు వృద్ధిఅవుతాయి. 8 వేల జీవకణములు ఉన్నదేశం బాగా ఆరోగ్యవంతంగా ఉంటుంది. అమెరికాలో 8,400 ఉంది, మనకు 16,17 వందలు ఉన్నది. మనం Physical needs ...

చేసుకోవలసిఉన్నది. ఇప్పుడు మనం 15 గజాలగుడ్డ ఉపయోగించుకుంటున్నాము. East Indies లో 22 గజములు, ఈజిప్టులో 18 గజములు ఉపయోగిస్తున్నారు. ఇప్పుడు మన పంచవర్ష ప్రణాళికలో 15 గజాలుఉన్నది. 18 గజములు చేయుటకు మనం ప్రయత్నిస్తున్నాము. 1941-51 సం॥ల మధ్య నూటికి 42 చొప్పున పట్టణములయొక్క జనాభా పెరిగింది. మనదేశంలోని జనాభా ఉజ్జాయింపున నూటికి 10 చొప్పున పెరిగింది. పంచవర్ష ప్రణాళికలో 1961 సం॥లోపుగా 36 లక్షుల గృహాలను నిర్మించేందుకు Plan లో చూపబడింది. పట్నాలలో 36 లక్షుల గృహాలు నిర్మించినట్లయితే పల్లెలలో ఎన్ని నిర్మించాలి అనే సమస్యవచ్చింది. మన Plan మొదలుపెట్టేటప్పటికి 6-14 సం ల మధ్యవున్న పిల్లలలో నూటికి 32 మంది స్కూలుకు వెళ్లారు. ఈ Plan అంతంనాటికి నూటికి 40 మంది వెడు తున్నారు. 1961 సం॥ నాటికి నూటికి 60 మంది స్కూలుకు వెళ్ళేటట్లుచేసే యేర్పాటున్నది. అదికాకుండా Secondary education, university education, technical education ను గురించి మనం చర్చించవలసియున్నది.

మన దేశంలో ఇప్పటికి రిజిష్టరయిన డాక్టర్లు 65 వేలమంది ఉన్నారు. Hospitals, Dispensariee కలిసి 8,500 ఉన్నాయి. వీటిలో 1,12,000 మంచాలున్నాయి. లెక్క ప్రకారం 63,000 మందికి ఒక డాక్టరు ఉన్నాడు. సగటున 63,000 మందికి ఒక mid wife ఉన్నది. కొన్నిచోట్ల ఏ సౌకర్యములు లేకపోవుటవలన డాక్టర్లు, నర్సులు, లేనిప్రదేశాలు ఉన్నాయి వీటి నన్నింటిని మనం దృష్టిలో పెట్టుకోవాలి. ఒకసారి ఇంగ్లండుతో పోల్చి చూసుకున్నట్లయితే మనకు, ఇంగ్లండుకూ ఉన్న వ్యత్యాసం బాగా తెలుస్తుంది. ఇంగ్లండులో 1,000 మందికి ఒక డాక్టరు ఉన్నాడు. 300 మందికి ఒక nurse ఉన్నది. 618 మందికి ఒక mid-wife ఉన్నది. మనకు 63 వేల మందికి ఒక mid-wife ఉన్నది. అందువల్ల మనం ఇప్పుడున్నటువంటి ఆసుపత్రులను, ఆసుపత్రిలోని మంచములను, డాక్టరులను, Health assistants, mid-wives, nurses మొదలగు వారిని ఇప్పుడున్న సంఖ్యకు రెట్టింపు చేయుటకు రెండవ పంచవర్ష ప్రణాళికలో ఏర్పాటుచేశాము. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో 10% మొదలు 25% వరకు మన ఆదాయం పెరిగింది. మనం 11% వరకు పెరుగుతుందని అంచనా వేసుకున్నాము. అటువంటిది 2.5 to 3% per annum ఎక్కువ పెరిగింది. Eastern States లోని ఆదాయం సాలుకు 12 మొదలు 16 వరకు పెరిగింది. 2 వ పంచవర్ష ప్రణాళికలో సాలుకు 5% చొప్పున 25% వరకు పెంచడానికి మన plan లో ఉన్నది. ఇది ఏ విధంగా పెరుగుతుంది ? రూ 10,840 కోట్లు జాతీయాదాయము. దీనిని

Sri K. Venkata Rao] [24th March 1956

రూ. 18,000 కోట్లకుపైగా పెంచాలని మన ప్రయత్నం. మన దగ్గర పెట్టుబడి పెట్టుటకు తగిన ఆర్థికస్తోమత లేదు. భూమి ఉన్నది. మంచి జలవనరులున్నాయి. మంచి ఖనిజాలు ఉన్నాయి. అడవులున్నాయి పశు సంపద ఎక్కువగా ఉన్నది. ఈ జాతీయాదాయాన్ని మనం అభివృద్ధి పంథాలో ఖర్చు పెట్టవలసి ఉన్నది. మన జాతీయాదాయంలో సాలుకు నూటికి 7 రూపాయల చొప్పున తిరిగి పెట్టుబడి పెట్టుతున్నాము. ఇందుపైన 11 రూ॥ల చొప్పున పెట్టుబడి పెట్టేటట్లు చేస్తే ఇప్పుడు మనం తలపెట్టిన కార్యక్రమం సిద్ధించడానికి వీలుగాఉంటుంది అందువల్ల మనయొక్క ఆదాయంలో నూటికి 11 వంతున పెట్టుబడి పెట్టేటట్లు చూచుకోవాలి. మనం ఈ పరిస్థితుల నన్నింటినీ దృష్టిలో పెట్టుకొని చేసినట్లయితే మనదేశంలో Total Consumption నూటికి 20 వంతులు individual consumption నూటికి 12 మొదలు 13 వంతులు ఎక్కువగా వినియోగించుకొనే పరిస్థితి యేర్పడుతుంది.

ఇంతవరకుకూడా మనదేశంలో 100 కి 44 రూపాయలచొప్పున వ్యవసాయాభివృద్ధికి ఖర్చుపెట్టారు. మనదేశంలో జనాభా పెరిగినందువలన, భోజనపదార్థాలు కొనుక్కోవడంవల్ల ఎక్కువ ఖర్చుచేయవలసి ఉంటుంది. Uncertain monsoons వల్ల కూడా చాల నష్టము కలుగుతోంది. ఒక్కొక్క సంవత్సరంలో అసలు వర్షమే కురవదు. వీటన్నిటిని సక్రమంగా అమలుజరుపుకోవాలన్నట్లయితే, క్రొత్త కార్యక్రమాన్ని ఏర్పాటుచేసుకోవాలి. అందుకుగాను Second Five Year Plan లో క్రొత్త పారిశ్రామికవిధానాన్ని అవలంభిస్తున్నారు. దీనిలో Basic Industries కొన్ని ఉన్నాయి. Iron and Steel, heavy Machinery, Electric equipment, basic chemicals, exploitation of minerals ఇవన్నీకూడ ప్రభుత్వ నిర్వహణక్రింద ఉంటాయి. వీటన్నిటికొరకు డబ్బును పోగుచేయవలసి ఉంది. డబ్బు పోగుచేయడానికి రెండుమార్గాలు ఉన్నాయి. (1) పన్నులువేయడంవల్ల, (2) Public sector లో ఉన్నటువంటి పారిశ్రామిక వ్యాపారసంస్థలనుంచి డబ్బు సంపాదించడంవల్ల, Banking, Insurance, trade on selected commodities, foreign, and international trade, మొదలైనటువంటి వ్యాపారాన్ని ప్రభుత్వం తనచేతులలో పెట్టుకున్నట్లయితే Socialistic pattern of society ని అమలులోకి తీసుకురావడానికి వీలుఉంటుంది. Private sector ను కూడా దేశంలో ఉంచాలి. దానిని అదుపులోపెట్టుకొని తగినటువంటి ప్రోత్సాహాన్ని కూడా ఇస్తున్నారు. వాటిని develop చేసుకొనే మార్గాలుకూడా చూపించారు. Private sector ను అభివృద్ధిచేయుటకుగాను tax exemption కూడా ఇచ్చారు. ఇంతే

—

24th March 1956] [Sri K. Venkata Rao

కాకుండా దేశంలో కొనుగోలుశక్తికూడా ఎక్కువ అవుతున్నది. అందుచేత ఉత్పత్తి నష్టపోవడానికి వీలులేదు. ఎవరో ఒకాయన వేళకోళంగా "చైనా దేశంలోని స్త్రీలు తాముకట్టుకొనే లంగాలు వెడల్పు 2604 లో ఎక్కువ చేసుకున్నట్లయితే Manchester లో ఉన్నటువంటి మిల్లులకు 6 ఏళ్లు పని దొరుకుతుంది అని వెడల్పు తగ్గించుకొనినారు" అని చెప్పారు. అది అంతా కూడా internal demand కు సంబంధించిన వ్యవహారము

మనదేశంలోకూడా వస్త్రాలవిషయంలో internal demand 40 కోట్ల పైచిలుకు ఉన్నది. ఎక్కువ అవుతున్నదేగాని తగ్గడంలేదు. జనాభా పెరగడం వల్ల జనాభాకు కావలసిన సౌకర్యాలు కల్పించడంవల్ల internal market ఎక్కువై inflation తగ్గి దేశంలో సౌఖ్యము ఏర్పడడానికి మార్గం అవుతుం దని ప్లానింగ్ కమిషన్ వారు గుర్తించారు. నేను మొట్టమొదట మనవి చేసినట్లుగా దేశంలో నిరుద్యోగము అనుకున్నంతగా తగ్గలేదు. కాని 120 లక్షల మందికి ఉద్యోగం కల్పించేయత్నం జరుగుతోంది. జనాభా సంవత్సరానికి 45 లక్షలు పెరుగుతోంది. ఇందులో 100 కి 40 మంది కార్మిక, కర్షక తరగతులకు చెందినవారు. అందువల్ల సాలుకు 18 లక్షల ఉద్యోగాలను క్రొత్తగా సృష్టించవలసి ఉన్నది. ఇంతమందికి ఏటేటా అదనంగా ఉద్యోగాలు చూపలేకపోయినా సాలుకు 10,12 లక్షల క్రొత్తఉద్యోగాలు తయారయేటటువంటి విధానాన్ని మనం సృష్టించుకున్నాం. ఈ వివరాలన్నిటిని మేము తమకు ఇచ్చినపుస్తకాలలో చదువుకొని తెలుసుకొనే ఉంటారని భావిస్తున్నాను. United States of America లో ఉన్నటువంటి, ముడి ఇనుముకంటె ఇండియాలో 3 రెట్లు యెక్కువ ఉన్నది. ప్రపంచంలో ఇంత ఇనుము ఉన్న దేశం ఎక్కడా లేదని ఇప్పుడు తెలుసుకొన్నాము.

ఇప్పుడు ఇండియాలో 10 లక్షల టన్నుల ఉక్కు తయారుచేస్తున్నారు. United states of America లో సంవత్సరానికి 1000 లక్షలటన్నులు ఉక్కు తయారుచేస్తున్నారు. Population basis మీద చూచినట్లయితే 3 లక్షల టన్నులు అధికంగా తయారుచేయవలసి ఉన్నది. 10 లక్షల టన్నులు తయారుచేసే plant పెట్టాలన్నట్లయితే 100కోట్లరూపాయలు పెట్టుబడి పెట్టవలసి వుంటుంది. రూర్ కిలా భిలాయ్, దుర్గాపూర్ అనే 3 ప్రదేశాలలో ఉక్కుఫ్యాక్టరీలకుగాను 350 కోట్లరూపాయలు పెట్టుబడి క్రిందనే అయిపోతోంది. ఇంతకంటె భరించడం కష్టం అవుతుందిగనుక ఇవి అభివృద్ధి అయ్యేటట్లుమాత్రమే చేయాలి. ఈ విధంగా పెద్ద పరిశ్రమలకే ఎక్కువ పెట్టుబడులు పెట్టినట్లయితే చిన్న పరిశ్రమలమాట ఏమిటనికూడా ఆలోచించాలి. ఎక్కువ పెట్టుబడులుపెట్టి, భిలాయ్, దుర్గాపూర్, రూర్ కిలాలలో plant లు పెడితే ఒక్కొక్కచోట 2, 3 వేలమందికంటె

Sri K. Venkata Rao] [24th March 1956

ఎక్కువమందికి ఉద్యోగాలు దొరకవు. కాబట్టి basic industries అభివృద్ధివలన నిరుద్యోగ సమస్యలు పరిష్కరించడం అసంభవం. ఇది రష్యావంటి దేశానికికూడా తెలుసు. ఎక్కువమందికి ఉద్యోగం కల్పించాలంటే small-scale industries, cottage-industries మొదలైనటువంటి వాటిని వృద్ధిలోకి తీసుకు రావాలి. వాటిని వృద్ధిలోకి తీసుకురాకపోయినట్టయితే దేశంలో నిరుద్యోగ సమస్య పరిష్కారానికి బదులు నిరుద్యోగ సమస్యను ఇంకా తీవ్రతరం చేసేటటువంటి పరిస్థితులను ఏర్పరచుకొన్నట్లు అవుతుంది. ఈ సంగతి బాగా ఆలోచించి రైలుబండిలాగా ఒక line మీద basic industries, రెండో line మీద కుటీర పరిశ్రమవంటి చిన్నరకం పరిశ్రమలను ప్రోత్సహించడం చాలా అవసరం. అలా చేయాలంటే చాలమంది, technicians ను, craftsmen ను నిపుణతతో తయారుచేసేట్లు చేయాలి. అందుకుగాను production centres ను పెట్టాలి. Modern machines తయారుచేసే బుద్ధికుశలతకూడా వుండాలి. Electricity ని దేశం నలుమూలలకు పంపించేటటువంటి యత్నముకూడాచేస్తే ఈపని బాగా జరుగుతుందని మనవిచేస్తున్నాను. కీలక పరిశ్రమలకే factory లను ఏర్పాటుచేసి, కుటీరపరిశ్రమలకు హెచ్చు ప్రోత్సాహమిచ్చినట్లయితే గ్రామీణులకు వృత్తి కల్పించినవారమవుతాము. Cement, engineering, drugs మొదలైన భారీ పరిశ్రమలకుమాత్రమే factory లను స్థాపించుకొనడంవల్ల నిత్య అవసరమయ్యే వస్తువులను గ్రామాలలోనే కార్మిక కర్షకులతో తయారుచేయించడంవల్ల నిరుద్యోగసమస్యను కొంతవరకు పరిష్కరించడం సాధ్యమౌతుంది. భూసంస్కరణలను తీసుకురావలెనని ఆ పుస్తకంలో ప్రత్యేకంగా ఒక chapter వ్రాశారు. దానికి తగినటువంటి చర్యలను భారతదేశంలోని అన్ని రాష్ట్రప్రభుత్వాలుకూడా తీసుకోవలసి వుంటుంది. దానికి తగిననటువంటి చర్య మనరాష్ట్రములోకూడా జరుగుతున్నది. గోపాలరెడ్డిగారు ఎక్కడైన వ్యక్తిగత అభిప్రాయం అని చెప్పినట్లయితే అది వ్యక్తిగతమేగాని Government అభిప్రాయంకాదు. ఆయన Government మీద తన అభిప్రాయాన్ని ఎక్కువగా పెట్టేటటువంటి పెద్దమనిషిగాదు. Progressive గా ఒకదానితరువాత ఒకటి తీసుకురావాలనే అభిప్రాయాన్ని మాత్రం వారు వెల్లడిచేశారు. ప్రభుత్వం వీటన్నిటిని శీఘ్రతరం చేయాలనే నిర్ణయంతో మన అందరి ఆమోదంతోటి ముందుకు తీసుకునిపోయే యత్నంచేయాలి. Agrarian Reforms Committee వారు Government కు కొన్ని సూచనలు చేశారు. విశాలాంధ్రకు వెళ్లకుండానే త్వరగా వీటన్నిటిని పూర్తిచేసుకుంటే మంచిది. Planning Commission report లో వ్రాసినదానిప్రకారము భూ[illegible] పత్రకాలం Hyderab[illegible] ంగా వున్నవి. అందువలన కుడి

ప్రక్క ఒకవిధంగా ఎడంప్రక్క ఒకవిధంగా ఉండదుగనుక ఏదో ఒకే systemలో ఉండాలి. "Ceilings on individual holdings" "distribution extra land" "consolidation of holdings" మొదలైన విషయాలలో మనం చాలా కృషిచేయవలసిన అవసరం వున్నది. అన్నిటికంటె ముఖ్యంగా తక్షణమే కౌలుదారీ చట్టాలనుగురించి చర్య తీసుకోవలసిన అవసరంవున్నది. ప్రభుత్వం తప్పకుండా చర్యతీసుకుని తీరుతుంది. దానికి ఎక్కువకాల వ్యవధికూడా అవసరం వుండదని నేను అనుకుంటున్నాను.

ఇంకా దేశానికి ఆదాయము ఎక్కువ కావాలి అన్నట్లయితే, మనము పన్నుల క్రిందే పుచ్చుకోవలసియున్నది. public sector లో ఎక్కువ capital formation కావాలి. social services కు డబ్బు కావాలి. Death duties వగైరా taxes వేయడంద్వారా ఉన్నటువంటి ఆదాయ వ్యత్యాసాలు, ఆస్తి వ్యత్యాసాలుతగ్గించడానికి యత్నం జరుగుతుంది. అయితే ఇదంతాకూడ కావాలంటె ప్రజానీకంయొక్క తోడ్పాటు కావాలి. ఈ వేళ ఎవరికైనా ఆదాయంలో ఫావలా అభివృద్ధి అయినట్లయితే దానికి face Powder కొనుక్కొంటాననే దృష్టిలో వెళ్లినట్లయితే, దేశానికి investment క్రింద ఒక అణాకూడ పెట్టుకోకుండా ఈదేశాన్ని ముందుకు తీసుకుపోవడం కష్టమవుతుంది. అందువల్ల ఒక restricted system లో consumption చేసుకోవాలి. మనము పండించినదంతా, మనకు అభివృద్ధి అయినటువంటి జాతీయాదాయమంతా మన వినియోగము క్రిందవాడుకొంటె, పెట్టుబడి పెట్టడానికి లేకుండా మనయొక్క పరిశ్రమలులు గాని, వ్యవసాయముగాని ఇతరవృత్తులు గాని మనము ముందుకు తీసుకుపోవడానికి వీలు ఉండదు. అందువల్ల మనము మన వినియోగములో restricted గా ఉండాలి. ఒక austerity ని అవలంబించాలి. ఇది రెండు రకాలుగాఉన్నది. సుందరయ్యగారి పద్ధతి అవలంబిస్తే "ఇది నీవు చేసితీరు" అని నిర్ణయంచేయవచ్చు. నెహ్రూగారి పద్ధతి అవలంబిస్తే "నాయనా ఇది నీవు చేయుము" అని చెప్పవలసియుంటుంది. ఇది ఈ రెంటికి ఉన్నటువంటి తేడా కనుక నేను మనవిచేసేది, మన దేశములో పొదుపు విధానమును నేర్పాలి. విదేశములనుంచి దిగుమతి చేసుకొనేటటువంటి పదార్థాల స్వరూపంలో మన పదార్థాలు తీసుకురావాలి. నిజమే నేనుకూడ తప్పుచేస్తాను. నా చేతిమీద ఇప్పుడు rolex watch ఉన్నది. ఇండియాలో అటువంటిది తయారుకాలేదు గనుక అది కొనుక్కోక ఏమి చేసేది అనేటటువంటి మనస్తత్వము పోవాలి. మన దేశములో కూడ watches తయారు చేయాలి. ఒకవేళ అది మధ్య మధ్యనిలుస్తూ, ఇంకేదైనా లోపాలున్నప్పటికి, ఆ watch నే వాడుతూఉండాలి. గాని ఇతర దేశస్థులవి పెట్టుకోకూడదు,

Sri K. Venkata Rao] [24th March 1956

క్రమంగా మన watches లో ఉన్న లోపాలు సరిదిద్దుకొని ఉత్తమ standards కు తీసుకురావాలి. విదేశీయులు ఏమీ దేవుళ్లుకారు. మనముకూడ ఆ విధంగానే వస్తువులు చేసుకోవచ్చు Atomic energy వాళ్లు ఖర్చుపెడుతున్నారు. కాని latest Geneva conference report చదువుకొంటె, peaceful uses of atom కు India చేసిన contribution ప్రపంచములో ఎవరు చేయలేదు ఇంతవరకు. అందువల్ల బుద్ధి కుశలతలోగాని, ఇతర విషయాలలో గాని మనమేమి తక్కువకాము కాని ఆ పరిణామము వచ్చేందుకు గాను, మనము దేశీయమైనటు వంటి విధానము మనస్సులో పెట్టుకొని మనవారిచేత పని చేయించుకొని, ఉత్పత్తి చేయించుకొని, మనమే వాటిని వినియోగించుకోవాలి. ఆ వినియోగించుకోడంలో కూడ ఏ వస్తువును దుర్వినియోగంచేయకూడదు. దుర్వినియోగం చేసినట్లయితె, దేశం అభివృద్ధికిరాదు. ఈ విషయంలో ప్రతి ఒక్కరు సహాయంచేయవలసి యున్నదని చెప్పుచున్నాను. ఇంతే కాకుండా, మనము విద్య, ఆరోగ్యము మొదలగు వాటినన్నింటికి కూడ ప్రత్యేకమైన చర్యతీసుకొని, తల్లి తండ్రులయొక్క ఆర్థికస్తోమత, వారి status మీద ఆధారపడకుండా, అందరికి విద్యా, వైద్య సౌకర్యములు కలిగేటట్లు వ్యవహారంచేయాలి. National Heltu Services ను మనము establish చేసుకోవాలి. sports, సాంస్కృతిక ప్రదర్శనాలు వగైరాలను అభివృద్ధి చేసుకోవాలి, కుంటి, గుడ్డి మొదలైన వారియొక్క శ్రేయస్సుకూడ మనం చూచుకోవాలి. అంతేకాకుండా పారిశ్రామికులు, కర్షకులు, కార్మికులు, మొదలైనవారికి ఎక్కువ economic securtiy ఇవ్వడంలోను, housing, recreation, training, insurance provident fund, మొదలైన వసతులు ఇవ్వడంలోకూడ మనము విశేషంగా కృషి చేయవలసియున్నది. వీటన్నింటికి అస్కారము కల్పించాలి. నిన్ననే, నా మిత్రుడు విశ్వేశ్వరరావుగారు ప్రత్యేకంగా విశాఖపట్టణం గురించి చెప్పారు. ఈవేళ ఏదో conference కూడ ఉన్నదని చెప్పారు. ఇప్పుడే ఆ conference నుంచి వస్తున్నాను. ఈ కార్మికులయొక్క demands లో చాలవరకు ప్రభుత్వము అంగీకరించినారు. వారికి సెలవు ఇవ్వడం విషయంలోగాని, వారు represent చేసుకొనే విషయంలో గాని, వారిచ్చిన 18 demands పైకి, 12 demands కు ప్రభుత్వము అంగీకరిస్తున్నది. ఈవేళో, రేపో ఈ విషయంలో orders issue చేస్తున్నాము. కనుక మన మిత్రులందరుకూడా, ప్రభుత్వముతో అంగీకరించనివాళ్లు, అంగీకరించిన వాళ్లు, అందరు కలిసి దేశముయొక్క కల్యాణంకోసం, ఈ అభివృద్ధి చేసుకొనే రోజులలో [illegible] labour ను జాగ్రత్తగా control లో ఉంచి పెట్టి సహాయం చేయవల

సించని నేను అందరికి ప్రత్యేకమైనటువంటి విన్నపము చేస్తున్నాను. ఇంకా ఇతరులంతా మాట్లాడవలసియుంటుంది కాబట్టి నేను ఎక్కువ విపులంగా మాట్లాడదలచుకోలేదు. ఆఖరున ఒక విషయం మాత్రం చెప్పుతాను. ఈ దేశం బాగుపడాలి అన్నట్లయితే ఒకటే మార్గమున్నది. ఈ విషయంలో అందరి తోడ్పాటు కావాలి. ఈ తోడ్పాటు రావాలంటె, అసలు సంగతి ఏదో మనము ముందు తెలుసుకోవాలి. ఒక విషయము మాత్రము అందరికి తెలిసినదే. మొదటి పంచవర్ష ప్రణాళిక ఈ రాష్ట్ర అవసరాలను గుర్తించుకొని తయారుచేయలేదు. ఆ ప్రణాళిక కార్యక్రమము ప్రారంభించి 2½ యేళ్లు అయిన తరువాత ఈ మంత్రివర్గము వచ్చి దానికి కృషిచేసి ఆ కార్యక్రమము 69 కోట్ల దాకా తీసుకువెళ్లింది. అందువల్ల మనకు నిజమైన పంచవర్ష ప్రణాళిక ఈ రెండవదే. అందులో నేను చెప్పినట్లుగా దరిదాపు 20 కోట్ల రూపాయలకు మనము క్రొత్త పన్నులు వేసుకొంటేనే ఈ 43 కోట్ల ప్రణాళికను అమలుజరపడానికి వీలుఅవుతుంది. 20 కోట్ల రూపాయలకు పన్నులు వేసినప్పటికిని, ఇంకా కొంత వేసుకోక తప్పదు. ఇదికాక ఇతర విషయాలలో ఆదాయము ఎట్లా వస్తుందో సభ్యులే యోచించండి. అందువల్ల ఈ రకంగా మనము దీనికి తోడ్పడవలసిన ధర్మము ఒక పక్షమున ఉన్నది. రెండవది, మనమంతా గ్రామాలకు వెళ్లి, ఆ ప్రజలతో ఈ అభివృద్ధి నీది, ఈ అభివృద్ధి జరిగితేనే గాని నీకుగాని, నీ కుర్రవాడికిగాని లాభములేదు. కనుక నీవు సాలుకు నీ తరఫున అయిదు రూపాయలు గవర్నమెంటుకు అప్పు ఇవ్వవలసియుంటుంది అని చెప్పవలసియుంటుంది. ఈ విధముగా మనము small savings గాని, national loans గాని, provincial loans వీటన్నిటికికూడ మనము కృషిచేయవలసియుంటుంది. సంపాదించుకొనే ప్రతి వ్యక్తి ఊరికే ఒక అణా ఇవ్వమనండి. ప్రతి ఒక్కరు ఇదినాది, నా సహాయము దీనిలో ఉన్నది అనే విధముగా సహాయంచేయాలి. ప్రతి వ్యక్తి small savingsలో కృషిచేయాలి. అదే కాంగ్రెసుకూడ appeal చేసింది. డబ్బు ఎక్కువగా ఉన్న వాళ్లు ప్రభుత్వానికి అప్పు ఇవ్వవచ్చు. ఏ శక్తి లేకుండా ఉండేవారు, డబ్బు ఇవ్వలేకపోయినా, దేవుడు వారికి ఇచ్చిన రెండుచేతులు, రెండు కాళ్లు ఇచ్చి తోడ్పడవచ్చు. నా మట్టుకు నేను అనుకొనేది, చేతిలో పార, నెత్తిమీద తట్ట పెట్టుకొని గోపాలరెడ్డిగారు పనిచేయడానికి మొదలుపెడితే, గ్రామంలో ప్రతి చిన్నవాడు మొదలు పెడతాడు. అందువల్ల శాసనసభ్యులు మన ధర్మాన్ని గుర్తించి ఈ శ్రమదానాన్ని ఒక national effort గానే కాకుండా ఒక national morale కు తీసుకువెళ్లి, మనమంతా కృషి చేయవలసియుంటుంది. ఈ Planలో అంకెలు ఎట్లు వేసుకొన్నా, ఇంకా 12 వందల కోట్లు రూపాయలు deficit finance కన్పడుతున్నది. ఈ deficit finance లేకుండా notes అచ్చు

Sri K. Venkata Rao] [24th March 1956

వేసుకొమ్మంటారేమో. నోట్లు అచ్చువేసుకొంటే ఏమవుతుంది? మార్కెట్టులో వంద మణుగుల వంకాయి వస్తే వీశ 0-2-0 ఉంటుంది. కాని 50 మణుగుల వంకాయి వస్తే వీసె 0-4-0 అవుతుంది. ఆవిధంగానే రూపాయలు ఎక్కువయితే, పదార్థాల యొక్క ఖరీదు పెరగడం అవుతుంది. వాటి ఖరీదు తగ్గించాలంటే మార్గమేమిటి? ఉత్పత్తి ఎక్కువ చేసుకోవడమే. అందువల్ల ఈ సంగతి మనము ముఖ్యంగా దృష్టిలో పెట్టుకొని, నేను చెప్పిన మార్గాలవల్ల, అంటే, more production, more earning, more savings, more investments వీటికి కృషిచేయవలసి ఉంటుంది. మనకు ఉన్న దాన్నిబట్టి లెక్కవేసినట్లయితే, 48 వందల కోట్లు కావలసియుంటె, 44 వందల కోట్లే కనిపిస్తున్నది. ఇంకా 4 వందలు కోట్లు ఎలా వస్తుందో, ఆలోచించవలసియుంటుంది. దానికిగూడ పన్నులు వేయవలసియుంటుందేమో! అప్పుడే 6 వందలు, 8 వందలు కోట్లవరకు పన్నులు వేసినాము. ఇంకా ఎక్కువ వేసుకోవాలి. ఇంకా ఎక్కువ మంది అప్పు ఇవ్వాలి అప్పోసొప్పో చేసుకొని మనము ఈలోటు సరిచేసుకోవాలి. ఈ కార్యక్రమంలో మనము అనుకొన్న దానికంటే తగ్గుతుందనే పరిస్థితి ఎప్పుడైనా ఏర్పడినప్పుడు మనందరి భుజాలు దానిక్రింద పెట్టాలి. మన చేతిలో బలము దానికివ్వాలి. ఇదంతా చేయాలంటే అసలు మన పాతబుద్ధి మార్చుకోవాలి. అందువల్ల, ఈ socialist విధానములో మనకు నమ్మకము ఉన్నదాలేదా, శాంతి మార్గంవల్ల భారతదేశముయొక్క అభివృద్ధి సాధించ వచ్చుననే దాంట్లో మనకు నమ్మకం ఉన్నదాలేదా, శాంతిమార్గంవల్ల ఈ సాధన మనము చేయాలి అనే దాంట్లో నమ్మకం ఉన్నదాలేదా అనే ఈ మూడింటికి మన హృదయములు గనుక సరియైన సమాధానము చెప్పితే మన మనస్సు మన చేత సరియైనటువంటి పనిచేయిస్తుంది. అందువల్ల ఇది దృష్టిలో పెట్టుకొని ఈ మహత్తరమైన పనిని మనం సాధించవలసియుంటుంది. యుద్ధంవస్తే ఈ Second Five Year Plan మనకు greatest defence అని నిన్ననే నెహ్రూగారు చెప్పారు. దేశ్‌ముఖ్‌గారు తమ బడ్జెట్ speech లో కష్టమైనా మనము stability సంపాదించుకోవాలి అన్నారు. ఈ రెండున్నూ, నేను చెప్పిన విషయాలు, మనస్సులో పెట్టుకొని మన ఆంధ్ర రాష్ట్రముకూడ మిగతా అన్నిటితోబాటు అభివృద్ధి చెందేటట్లు అందరు కృషిచేయాలని కోరుతున్నాను. దైవకృపవల్ల మన geological survey ఎక్కువఅయి, మన minerals ఎక్కువఅయి, మన నీటి వనరులు ఎక్కువఅయి, మన వృత్తులకు ఎక్కువ ప్రోత్సాహము కలిగి, మన capacity, మన investment ఎక్కువఅయి మన ప్రజలలో సహాయము చేస్తాము అనే సద్బుద్ధి అందరికి కలిగినట్లయితే, ఆంధ్ర రాష్ట్రముయొక్క భవిష్యత్తు [illegible] గొప్పగా ఉంటుంది. మనము హైదరాబాదుకు వెళ్ళగానే మన Plan కు [illegible] కోట్ల రూపాయల సహాయం కలుగుతుంది.

24th March 1956]

MR. SPEAKER.—We shall take the printed speeches * of the Hon. Minister as statements placed on the Table of the House.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ద్వితీయ పంచవర్ష ప్రణాళికను గురించి మనము యీ రోజున చర్చసాగించడము ఈ ఎసెంబ్లీలో చాలాముఖ్యమైన ఘటనగా నేను చూస్తున్నాను. భారత దేశము రెండువందల సంవత్సరాలుగా బ్రిటిషు సామ్రాజ్యవాదుల చేతులలోపడి, వెనుకబడిఉండి భారత ప్రజలకు తిన తిండి. కట్టగుడ్డలేకుండా మలమల మాడిపోవడము జరిగింది. అటువంటి దేశము యీనాడు మనము ముందుకు తీసుకునిపోవాల్సిఉన్నది. ప్రజలకు కావలసినతిండి, బట్ట, ఉండటానికి యిల్లు, చదవటానికి విద్య, వైద్యసౌకర్యాలు కలిగించుకోటానికి మనమందరము కృషిచేయాలి. దేశాన్ని ముందుకు తీసుకునిపోవటానికి భారతీయుడు అని పిలిపించుకునే ప్రతి మానవుడుకూడ కృషిచేయడని ఎవరికినీ ఎట్టి సందేహము ఉండవలసినపనిలేదు. మొదటి పంచవర్ష ప్రణాళికను మనము పూర్తి చేసుకున్నాము. నిజమే. మొదటి ప్రణాళికను, మనదేశములో ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము ఏర్పడిన క్లిష్టపరిస్థితులవల్ల మనకుకలిగిన యిబ్బందులలో, మనము అమలు పరచుకోవడము ఎంతో కష్టసాధ్యమైనది. మనము మన దేశమును ముందుకు తీసుకొని పోవటానికి యీ మొదటి పంచవర్ష ప్రణాళికను ఒక ప్రాతిపదికగా మాత్రమే ఉపయోగించుకోగలిగాముకాని, దానియొక్క ఫలితములు మనకు సంపూర్ణముగా చిక్క లేదు. అంతేకాని అది మరొకటికాదనే సంగతి నేను అంగీకరిస్తున్నాను. అంటే, ప్రథమ పంచవర్ష ప్రణాళికవల్ల మనము ఎంతదూరము ముందుకు వెళ్లగలిగాము అనేవిషయము యిప్పుడు మనకు యీ చర్చలలో అనవసరము. అది జరిగిపోయింది. దానివల్ల మనము ఎంతముందుకు వెళ్ళవలసిఉన్నా, ఎంతముందుకు వెళ్ళగలిగినా, ఇప్పుడు మనము Socialistic Pattern of Society ఏర్పరుచుకోవాలని ఆవడికాంగ్రెసు చెప్పింది. తరువాత అమృతసర్ కాంగ్రెసు మరల దానినే సోషలిస్టు సమాజము స్థాపించుకోటానికి ఆదేశించింది. కాబట్టి మనము యిప్పుడు సోషలిస్టు సమాజము ఏర్పరుచుకోవలసిఉన్నది గనుక, దానికి ప్రాతిపదికగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికను మనము అమలుజరుపుకోవలసిఉన్నది ఈ ప్రణాళిక నాలుగుఆశయములతో కూడుకునియున్నది. మొదటిది పారిశ్రామికాభివృద్ధి. పరిశ్రమలు అభివృద్ధికావటానికి యీ ప్రణాళికను ఆహ్వానిస్తున్నాము. ఈ ప్రణాళికలో యిమిడిఉన్న ఆశయాలు గురించి ప్రణాళికను చదివినప్పుడు, ప్రతి భారతీయుడుగూడ తప్పకుండా హర్షిస్తాడు. అయితే యీ ఆశయాలను గురించి

* Vide appendices (A) and (B) at pages 401 to 421 infra.

Sri P. Sundarayya] [24th March 1956

మంత్రిగారు నాలుగురకాలుగా చెప్పియున్నారు. మొదట జాతీయోద్యమమును పెంపొందింప జేసుకోవాలని అన్నారు. ఇప్పుడుఉన్న జాతీయోద్యమముకంటె రాబోవు అయిదేండ్లలోపల దీనిని మరొక నాల్గవవంతు అధికముచేయడమే, దాని యొక్క ఆశయమని అన్నారు నిజమే. ఈరోజున నాల్గవవంతు పెంపొందించు కున్నంత మాత్రాన, మనకు కావలసినదిఅంతా కూడరాదు. మన ప్రజలకు కావలసి నదంతా కూడ మనము చేసుకోలేము. కాని యిప్పుడు ఉన్న దానికంటె మరొక నాల్గవ వంతు ఆదాయమైనను పెంపొందింప జేసుకోగలిగినట్లయితే, కొంతవరకు కాక పోయినా, కొంతవరకైనా మనము ముందుకు వెళ్లటానికి అవకాశము ఏర్పడుతుంది. అందుచేత ఆ మాత్రముఅయినా మనము సాధించుకోగలగటానికి యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలుపరుచుకోటానికి కృషిచేయడము, దానికి మార్గాలను సూచించడము ప్రతి ఒక్కడుకూడ ఆహ్వానిస్తున్నాడు.

ఈ ప్రణాళికను అమలుపరచుకుని ఫలితములు సాధించాలని అనుకున్నప్ప టికినీ, భవిష్యత్తులో మనయొక్క ఆదాయమును ఎక్కువగా పెంచుకోవాలని అను కున్నప్పటికినీ, సత్వరముగా మనకు పారిశ్రామికాభివృద్ధి కావలసిఉంటుంది. పారి శ్రామికాభివృద్ధి లేనంతకాలము, మనము ఎంతవరకు వ్యవసాయముమీదగాని, కుటీర పరిశ్రమలమీదగాని, ఆధారపడి ఉన్నప్పటికినీ, ప్రజలయొక్క ఆర్థికస్థితి సంవత్సర ములకొలది కృషిచేసినప్పటికినీ, ప్రయోజనములేదు. మనము ముందుకుగూడ పోజా లము. పోవటానికి సాధ్యముకాదు కారణమేమిటంటే, పూర్వము ఎన్నో సంవత్స రాల క్రిందటివరకు మనకు జనాభాతక్కువ. ఉత్పత్తితక్కువ. ఏ గ్రామములో పండినపంట ఆ గ్రామానికి సరిపోయేది, మిగిలేదికూడ. మనము తయారు చేసుకున్న గుడ్డలు ఎక్కడికక్కడ, ఎప్పుడుపడితే అప్పుడు స్వయం సంపూర్ణముగా ఉండేవి. ప్రజలకు బాధపడడమనేది ఉండేదికాదు ఆనాడు మనకు ఎన్నోసౌకర్యాలు ఉండేవి. అలాంటిది యీనాడు జనాభానుచూస్తే ఎంతో మీదు మిక్కిలిగా పెరిగి పోయింది. తిండి కావాలన్నా, బట్టకావాలన్నా, ఉండటానికి యిల్లుకావాలన్నా, అన్నీ కరువుగా ఉన్నవి. ఇవి అన్నీ మన జనాభాకు సరిపోయేటట్లుగా మనము వృద్ధిచేసుకోవాల్సియున్నది. అవి అన్నింటిని వృద్ధిచేసుకోటానికి యీ ప్రణాళికను మనము అమలుపరచుకోవాలి. ఈనాటి జనాభాపూర్వముకంటె ఎన్నోరెట్లు పెరిగి నందువల్ల, ఎన్నో విధములుగా మరింత ఎక్కువగా సౌకర్యాలు కోరుకూడున్నప్పుడు [illegible] పోటీగా నిలబడి "ఇది మా దేశము, మేము వెనుకబడి ఉండలేదు. [illegible] మేము ముందుకుపోగలము, పోతున్నాము. మా దేశములో ఉన్న [illegible] మేము వృద్ధికి తెచ్చుకొని, మా సిరిసంపదలను మేము పెంపొందింప [illegible] కొనుచున్నవి; [illegible] నాసరే, కేవలము

24th March 1956] [Sri P. Sundarayya

ఆధ్యాత్మికంగాగాని, మానసికంగాగాని కాకుండా భౌతికవిషయములలోకూడ, యింకను అన్నివిధములలోగూడ మీకంటే మేము వెనుకబడి ఉండజాలము. ఉండముఅని ఎవరువచ్చినా ఎదిరించి రుజువుచేయుగలశక్తి సంపాదించాలంటే, ముందు పారిశ్రామికాభివృద్ధిమీద నే మనము ఎక్కువగా ఆధారపడవలసిన అవసరము ఉన్నది. ఇదే మా అందరికోరిక అని అంటున్నాను.

తరువాత, Standing Committee of the National Council సమావేశంలో నెహ్రూగారు ఉపన్యాసము యిచ్చారు. అందులో ఒకభాగము నేను మీకు చదివి వినిపించుచున్నాను. బహుశ దీనిని అందరూకూడ చదివే ఉంటారు. అయినప్పటికినీ, యీ చర్చలసందర్భములో పంచవర్ష ప్రణాళికకు అది పునాదిగా మనము తీసుకోవలసిన అవసరము ఉన్నది. కాబట్టి దానిని మీకు చదివి వినిపిస్తున్నాను.

' If you want India to be industrialised and to go ahead, as we must, as it is essential, then you must industrialise and not bother about the odd little factories producing hair oil and the like It is totally immaterial what the things are, whether they are small or big consumer articles. You must go to the root and the base and build up that root and base, on which you will build up the structure of industrial India. Therefore it is the heavy industries that count and nothing else excepting as a planned factor, which is important. We want planning for making heavy industries and we want that which will make heavy machines, we want industries which will make wealth ; and we should set about them as rapidly as possible, be it takes time If we set about them to-day, as we no doubt are in various ways, they will bear results four, five or six years later. If we do not do it now, then we have to wait for another Five Year Plan period. Therefore it becomes important. Stress was laid at the meeting of the Planning Committee therefore on these two factors.''

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యీ విషయాన్ని గుర్తించి, దీనికి అంతటికీ పునాదిగా చేసుకోవాలనేవిషయము మనము గుర్తిస్తున్నాము. దీనిని మేము పూర్తిగా ఆహ్వానిస్తున్నాము. దీనిని జయప్రదముచేయటానికి మాకుతోచినసూచనలు యీసభ ముందు, ప్రభుత్వముముందు పెట్టి, మనదేశమును పారిశ్రామికంగా మరింత వృద్ధి

Sri P. Sundarayya] [24th March 1956

చెందటానికి, మనదేశములో మనకు కావలసిన అన్ని విషయములలోనూ, అన్నివస్తువులు తయారుచేసుకోవడములోనూ, మాకాళ్లమీద మేము నిలబడగలము, ఏ శత్రువు వచ్చినా ఎదిరించి, ఓడించగలము, మాదేశముమీద దాడిచేసినా, త్రిప్పి ముఖముమీద కొట్టగలశక్తి మాకు ఉన్నది, ఇప్పుడు మేము పారిశ్రామికంగా వృద్ధిచెందాము అనే మనోధైర్యము దేశములో ప్రతిమానవునికి రావటానికి వీలుగా యీప్రణాళికను అమలు పరచటానికి కృషిచేస్తాము, దీనికి మేము మా సంపూర్ణ సహకారము యివ్వటానికి సిద్ధముగా ఉన్నాము అని మనమందరము స్పష్టముగా చెప్పవలసియున్నది.

ఇకపోతే మూడవ ఆశయము యేమిటంటే యీ రోజులలో నిరుద్యోగులుగా ఉన్నవారు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. ఇంతవరకు నిరుద్యోగసమస్య మన రాష్ట్రములో ప్రభుత్వము పరిష్కరించలేకపోయినప్పటికినీ, సాధ్యమైనంత ఎక్కువ మందికి యీ ప్రణాళికద్వారా పనులు కల్పించడమనేది దీనియొక్క మూడవ ఆశయముగా చెప్పడము జరిగింది. ఈ రోజున భారతదేశములో ఆర్థిక అసమానత్వము మెండుగా ఉన్నది. పేదప్రజలు అధికసంఖ్యాకులుగా ఉన్నారు. ఈ అసమానత్వ మనేది మనము పోగొట్టుకోవాలి. అందరు సుభిక్షముగా ఉండి సౌఖ్యపడాలి. అమెరికాదేశములో ఒక్కొక్కరికి సంవత్సరానికి సగటు ఆదాయము 7,8 వేల వరకు ఉంటే, ఇక్కడ మనదేశములో 250 రూపాయలకంటే, ఎక్కువ ఉండదప్పుడు, మనదేశము ఆర్థికంగా ఎంత వెనుకబడి ఉన్నదో మనకు తెలుస్తూనే ఉన్నది.

ఒక మూల పనిలేక, తిండిలేక మలమల మాడుతున్న బికార్లున్నారు. మరొక మూల మేడలూ, లక్షలూ, కోట్లూ ఆర్జిస్తూ, అనేక సౌఖ్యాలు అనుభవిస్తూ ఉన్న జనాభా ఉన్నారు. ఇటువంటి విపరీతమైన వ్యత్యాసాలు ఉండకూడదు. ఈ ఆర్థిక అసమానత్వం తగ్గించాలి. దానికి తగిన చర్యలు ఈ ప్రణాళికలోనే తీసుకోవాలి అనే ఈ నాలుగు ఆశయాలనూ మనం అమలు జరిపితీరాలి. ఈ ఆశయాలు ఏదో కొంతవరకూ సాధిస్తాం, ఇదివరకటికన్న ఒక అడుగు ముందుకుపోతాం అని సంతృప్తి చెందినట్లయితే, ఈ పంచవర్ష ప్రణాళిక మనం సరిగా అర్థం చేసుకున్నట్లు కాదు. అది అమలు జరపడానికి కృషి చేసినట్లుకూడా కాదు. ఈ నాలుగు ఆశయాలు నెరవేరడానికి ఆ ప్రణాళికలో సూచించినవి సరిపోతాయా ? ఈ ఆశయాలు సంపూర్ణంగా, త్వరగా నెరవేరడానికి మనకు స్వతంత్రమైన మార్గాలు ఏమైనా ఉన్నాయా అనే దృష్టితో పరిశీలించి ఈ పంచవర్ష ప్రణాళికమీద మేము కొన్ని విమర్శలు చేయవలసి యున్నది. పారిశ్రామిక అభివృద్ధి విషయం తీసుకుందాం. [illegible] పంచవర్ష ప్రణాళికలో పారిశ్రామిక అభివృద్ధి విషయంలో ప్రభుత్వ

రంగంలో ప్రభుత్వ బొక్కసంలో నుంచి 2300 కోట్లు ఖర్చుపెట్టడం జరిగింది. ఇది కాకుండా మరొక 1200 కోట్లు private రంగంలో అంటే వ్యక్తిగత ఆస్తి కలిగి నటువంటి పెద్ద పెద్ద ఆస్తిపరులు ఖర్చుపెట్టారు. వాళ్లు డబ్బుపెట్టి స్థాపించిన పరిశ్రమలు కానివ్వండి, కట్టిన ఇళ్లు కానివ్వండి, ఈ రీతిగా private రంగంలో ఖర్చుపెట్టింది 1200 కోట్లు ఉందని తెలుస్తోంది. మొత్తం 3500 కోట్ల రూపాయిలు ఇప్పుడు ఖర్చుపెట్టడం జరిగింది. రెండో పంచవర్ష ప్రణాళికలో 4800 కోట్ల రూపాయిలు ప్రభుత్వ రంగంనుంచి, అంటే మామూలు ప్రభుత్వ వ్యవహార కొండ కాక అదనంగా పెట్టుబడుల క్రింద 4800 కోట్ల రూపాయిలు ప్రభుత్వరంగంలోనూ మరో 2300 కోట్ల రూపాయిలు private రంగంలోనూ, మొత్తం 7100 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టడం జరుగుతుంది. అంటే దాదాపు మొదటి పంచవర్ష ప్రణాళికకన్న రెండు రెట్లు రెండో పంచవర్ష ప్రణాళికలో మనం ఖర్చు పెట్టడం జరుగుతుంది. ఈ ఖర్చుపెట్టడంలోకూడా భారీ పరిశ్రమలకు కొంత ప్రాధాన్యత ఇవ్వడంకూడా జరిగింది వ్యవసాయంకన్నకూడా, భారీ పరిశ్రమలు, పారిశ్రామిక రంగానికి పునాది కాబట్టి దీనిమీద ఎక్కువ కేంద్రీకరించాలని కొంత శ్రద్ధ తీసుకుని కొంత డబ్బు ఉక్కు Factory లు, లేక యంత్రాలు తయారుచేసే యంత్ర పరిశ్రమలు, రసాయినిక వస్తువులు, ఉత్పత్తిచేసే పరిశ్రమలూ వీటిలోకొంత అదనంగా ఖర్చు పెట్టడానికోసం కృషిచేశాం. ముఖ్యంగా వ్యవసాయిక దేశమైన మన దేశం పారిశ్రామిక దేశంగా మారడానికి ఏ పంచవర్ష ప్రణాళిక పునాది అని శ్రీ జవహర్లాలు నెహ్రూగారు పదే పదే చెబుతున్నారో ఆ రెండో పంచవర్ష ప్రణాళికను చూచినట్లయితే 1960 నాటికైనా చెప్పుకోతగినంత పురోగమనం మన దేశంలో పారిశ్రామిక రంగంలో సాధించగల్గుతుందనే ఆశ ఎక్కడా కనిపించడం లేదు. ఉదాహరణకు చెబుతాను. విద్యుచ్ఛక్తి, పెద్ద పరిశ్రమలు వీటి విషయమై మొదటి పంచవర్ష ప్రణాళికలో private రంగం, public రంగం రెండూ కలిపిచూచుకున్నప్పుడు దాదాపు 766 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టడం జరిగింది. 266 కోట్లు విద్యుచ్ఛక్తికి, 149 కోట్లు పెద్ద పరిశ్రమలకీ ఇవి ప్రభుత్వరంగంలోనూ, 350 కోట్లు private రంగంలోనూ ఖర్చుపెట్టారు. ఐతే private రంగంలో దేనికిదేనికి ఎంతెంత ఖర్చుపెట్టారో చెప్పడం సాధ్యంకాదు. ఆ వివరాలులేవు. కుటీరపరిశ్రమలకు దానిలోనుంచి కొంత ఖర్చుపెట్టి ఉండవచ్చు. మొత్తంలో 50 కోట్లు లెక్క సరిగాలేదని తీసివేసి నప్పటికీ మొత్తం పంచవర్షప్రణాళికలో పెట్టిన పెట్టుబడి దీనిలో ఎన్నోశాతం ? ఈ విద్యుచ్ఛక్తి, పెద్దపరిశ్రమలూ private రంగంలోనూ public రంగంలోనూ ఎన్ని ఉన్నవనిచూస్తే 100 కి 28 శాతంమాత్రమే వున్నది. చిన్నకుటీర పరిశ్ర

Sri P. Sundarayya] [24th March 1956

మలూ, మోటారువగైరా రవాణాశాకర్యాలకూ కొంత ఖర్చుపెట్టారని దాన్ని మినహాయించినట్లయితే 100 కి 20 చొప్పున మొదటి పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమలమీద ఖర్చుపెట్టినట్లు తేలుతోంది. చిన్నపరిశ్రమలమీద ప్రభుత్వరంగంలో ఖర్చుపెట్టింది 30 కోట్లే. అది 1% మాత్రమే. మనము బ్రహ్మాండమయిన పారిశ్రామికాభివృద్ధి సాధించగలుగుతామా ఈ మొత్తంతో అంటే, అదికూడా సందేహమే. ఐతే ఇప్పటికే 4800 కోట్లు ఐపోయిందిగదా? ఇంకా డబ్బు ఎక్కడనుంచి తెచ్చిపెడతాం అనవచ్చును. దేన్ని మినహాయిస్తాం? వైద్యానికీ, విద్యకీ మొదటి పంచవర్ష ప్రణాళికలో ఖర్చుపెట్టినదానికన్న ఇప్పుడు మరింత తక్కువ ఖర్చుపెట్టడం జరుగుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళికలో 100కి 23 చొప్పున ప్రభుత్వరంగంలో ఖర్చుపెడితే, ఇప్పుడు 100కి 20 చొప్పునమాత్రమే ఖర్చుపెట్టడంజరిగింది. డబ్బు ఎక్కడనుంచి తెస్తాం. వ్యవసాయానికి ఖర్చు ఎంతవరకు తగ్గించగలమో అంతవరకు తగ్గించేయడం జరిగింది. Irrigation సౌకర్యాలకుకూడా ఎంతవరకూ తగ్గించడానికివీలుందో అంతవరకూ తగ్గించడం జరిగింది. ఇన్ని తగ్గించినా పరిశ్రమలమీద ఇంతకన్న ఎక్కువఖర్చు పెట్టడానికి వీలులేనప్పుడు మీరు విమర్శించి ఏమిలాభం? డబ్బు ఎక్కడనుంచి తేగలం? అని మీరనవచ్చును. ఆవిషయమై మేము కొన్ని సూచనలు చేయగలం మనం రష్యాతోనూ, అమెరికాతోనూకాదు ఈరోజు పోల్చుకోవలసింది. మనతోపాటే స్వాతంత్ర్యం సంపాదించి మనవలెనే వెనుకపడి వున్న చైనాతో మనం పోల్చుకోవాలి. పోటీపడాలి శ్రీ జవహర్లాలు నెహ్రూగారే చైనా సాధించిన పురోగమనాన్నిగురించి పదేపదే చెప్పారు. కొన్ని పరిశ్రమలలో ఈనాడు మనం China కన్న ముందువున్నాం. మనం ఈవిధంగానే చైనాకన్నా ముందడుగు వేయడానికే స్థిరసంకల్పంతోవుండి ఇతరపాశ్చాత్యదేశాలస్థాయికి వచ్చేటట్లు ప్రయత్నం చెయ్యాలి. ఇటువంటి పోటీతో మనం కార్యక్రమం సాగిస్తేనే పారిశ్రామికరంగంలో ముందుకువెళ్ళి, ప్రజలకు కావలసిన అవసరాలను తీర్చడానికి పునాదులు వేసినవాళ్ళం అవుతాం. అటువంటిప్రయత్నం ఈ ప్రణాళికలో జరుగుచున్నదా అంటే లేదని చెప్పవలసి వచ్చినందులకు విచారపడుతున్నాను.

Railways కు ఇంత ఖర్చు చేశారు, రోడ్లకు ఇంత ఖర్చు చేసారు అనే వివరాలలోనికి నేను పోదలచుకోలేదు వీటన్నింటికి కీలకమైన పరిశ్రమలగురించే చెబుతున్నాను 1955-56 లో మనం 1 లక్షల టన్నులను తయారుచేస్తే 1961 వ సంవత్సరానికి 43 లక్షల టన్నులకు పెంచుతున్నామకదా; ఇంతకన్న అభివృద్ధి సాధించగలమా అని అడుగుతున్నాను ఎట్లా సాధించగలము అనే విషయం గురించి చెప్పాలంటే ఇంక ఏదేశమయినా సాధిస్తున్నదా [illegible] చూడాలి. చైనా కమ్యూనిస్టుదేశం కాబట్టి అది మంచిదని మనవి

చెడ్డదని అని నేను అనడంలేదు మనం చేసినది తప్పు అని నేను అనడంలేదు. చైనాకన్న మనం ఎందుకు వెనుకబడాలి? కమ్యూనిస్టుమార్గం మంచిదికాదని చాలా మంది అనుకోవచ్చును దానికన్న మనమార్గం మంచిది అని రుజువుచేసుకోవాలంటే చైనాకన్న మనం ముందంజవేస్తేనే కమునిస్టుపద్ధతికన్న నెహ్రూగారిపద్ధతి అనండి, ప్రజాతంత్రపద్ధతి అనండి, మంచిది అని చైనాకన్న మనం ఎక్కువ ముందుకు పోగలమని ఆచరణలో రుజువుచేసినట్లవుతుంది. ఉక్కు విషయం తీసుకుందాము. చైనాను తీసుకుంటే వారు యుద్ధములో అనేకకష్టనష్టాలు పడ్డారు; ఆవిషయం అలా ఉంచండి. వారి ఉక్కుపరిశ్రమ ఏనాడు 6,7 లక్షలకు మించ లేదు. జపానువారు మంచూరియాలో చేసినది తీసికుని కలిపిచూచినా 6,7 లక్షలకన్న మించినది లేదు. యుద్ధానంతరం కమ్యూనిస్టులు అధికారంలోనికి వచ్చినతరువాత రెండులక్షల టన్నుల కన్న తయారుచేసే పరిస్థితిలో లేరు. భగ్నమయిన Factories తిరిగి కట్టుకుని, క్రొత్త factories నిర్మించుకుంటూ 1954 సంవత్సరానికి దాదాపు 22 లక్షల టన్నుల ఉక్కు తయారుచేయగలిగారు. 1960 సంవత్సరం వచ్చేనాటికి 75 లక్షల టన్నుల ఉక్కు తయారుచెయడానికి పూనుకుంటున్నారు. మనం తయారు చేయడానికి పూనుకుంటున్నది 45 లక్షలు అయితే వారు పూనుకుంటున్నది 75 లక్షలు. బొగ్గువిషయం తీసుకొందాము. 1950వ సంవత్సరంలో 3 కోట్ల 20 లక్షల టన్నులు బొగ్గును మనదేశంలో తయారుచేస్తున్నాము. ఇప్పుడు 3 కోట్ల 80 లక్షల టన్నులు తయారుచేస్తున్నాము 1960 సంవత్సరంనాటికి 6 కోట్లు టన్నుల బొగ్గు తయారుచేయడానికి ప్రణాళికవేసుకుంటున్నాము దాదాపు 4 కోట్ల నుంచి 6 కోట్లకు పెరిగిందికదా; అది చాలా ఎక్కువకదా; 50% వరకు పెరగడమే గొప్పకార్యముక్రింద పరిగణించవచ్చును. నిజానికి 4 కోట్లనుంచి 6 కోట్లకు రావడం తేలికయినవిషయంకాదు. దానికి గర్వపడవలసిందేకాని మునుపటికన్న 10 అడుగులు ముందుకువేశామా, లేదా-అన్నదికాదు ప్రశ్న. మనదేశంకన్న మరొకదేశం ఎందుకు ముందుకు పోవాలి; మనమే ఎందుకు ముందుకుపోకూడదు అనేది ప్రశ్న చైనాలో 1954 లో 8 కోట్ల టన్నులు బొగ్గు తయారుచేస్తున్నారు. యుద్ధానికి తరువాత 1949 లో చాలా తక్కువే చేస్తున్నారు; మనకన్న ఎక్కువ తయారుచేసేపరిస్థితిలో లేరు. 1960 సంవత్సరం వచ్చేసరికి 150 కోట్ల టన్నుల బొగ్గు తయారుచేయడానికి ప్రణాళికవేసుకొని పనిచేస్తున్నారు. విద్యుచ్ఛక్తి విషయం తీసుకుందాము. 1954 నాటికి మనం 7 శతకోటి కిలోవాట్ల యూనిట్లు తయారుచేస్తున్నాము. 1960 నాటికి 20 శత కిలోవాట్ల యూనిట్లు తయారుచేయడానికి ప్రణాళిక వేసుకుంటున్నాము. 7 నుంచి 20 అంటే దాదాపు 3 రెట్లు—గొప్పసంగతే—హర్షించవలసిందే. కాని ఈవిషయంలోకూడా చైనాను తీసుకుంటే 1954-లో వాళ్లు

Sri P. Sundarayya] [24th March 1956

11 శతకోటికిలోవాట్ల యూనిట్లు ఉపయోగిస్తున్నారు. 1960 నాటికి 24 కోట్ల శతకోటి విద్యుచ్ఛక్తి యూనిట్లు వినియోగించడానికి ప్రణాళిక వేసుకుంటున్నారు. ఇదే రీతిగా ఇంకా కొన్ని విషయాలలోకూడా చూడవచ్చును మనకన్న ముందుకు వెళ్ళడానికి వారు ప్రణాళికలువేసుకుంటున్నారు. మనకన్న పారిశ్రామికంగా వెనుకబడిన చైనా, మనకన్న ముందుకువెళ్లడానికి ప్రణాళికలు వేసుకుంటున్నారు. పరిణామం విషయమే కాదు. ఎంతవరకు సాధించినా మెరుగే అనుకుంటే మన దేశంలో పరిశ్రమలు నిర్మించడంలో కొన్ని చిక్కులను ఎదుర్కొంటున్నాము. భారీపరిశ్రమలు నిర్మించడంలో యంత్రాలు నిర్మించే పరిశ్రమలు నిర్మించడంలోను కొన్ని ముఖ్యమైన లోట్లున్నాయి. చైనాలో వాళ్ళ ప్రణాళిక ఆశయం ఏమిటంటే 1957 నాటికి వాళ్ళదేశంలో ఏ యంత్రం కావలసివచ్చినా—ప్రజల ముఖ్యావసరాలనుతీర్చే consumer goods తయారుచేసే యంత్రాలు మాత్రమేకాక పెద్ద ఉక్కుకర్మాగారాలు, విద్యుచ్ఛక్తి తయారుచేసే యంత్రాలు, యంత్రాలనేకం తయారుచేసే యంత్రాలు మొదలైనవాటిని అన్నింటిని తయారుచేసుకునే పద్ధతిలో ప్రణాళిక వేసుకున్నారు. 1957 తరువాత అవసరంవస్తే ఏదేశంమీద ఆధారపడకుండా మా దేశానికి కావలిసిన ఏ యంత్రాన్నిఅయినా మా దేశంలోనే తయారుచేసుకోగలము; ఆ యంత్రాలుద్వారా ప్రజలకు కావలసిన పరిశ్రమలన్నింటిని నిర్మించుకోగలము అనే పద్ధతిలో వారి ప్రణాళికఉన్నది. అయితే 1957 నాటికే చైనాలో ప్రజలకు కావలసిన పరిశ్రమలు అన్నింటికీ యంత్రాలు తయారుచేసే యంత్రపరిశ్రమలు నిర్మించుకోగలదాఅంటే పరిమాణంలో కాకపోవచ్చును. మరొక 10 సంవత్సరాలు పరిమాణంకోసం తంటాలు పడవచ్చును. ప్రస్తుతం పునాది మాత్రమే ఏర్పడుతుంది. ఏ యంత్రంఅయినా ఏ భాగమయినా ఇంకొకరిమీద ఆధారపడకుండా మనదేశంలోనే తయారుచేసుకునేస్థితిలో ఉంటాము అంటున్నారు. నెహ్రూగారు భారీపరిశ్రమలు, heavy industries machine producing industries చాలా ముఖ్యమని అంటున్నారు. దానిని వాయిదా వేయడానికి వీలులేదు. ఇప్పుడు మొదలుపెడితే 5,6 సంవత్సరాలు పడుతుంది. త్వరగా మొదలుపెట్టక 4,5 పంచవర్ష ప్రణాళికలవరకు నిదానంగా ఆలోచించుకోవచ్చును అనుకుంటే మనదేశం వెనుకబడుతుంది. ఈ దృష్టితోచూస్తే 1960 నాటికైనా మనదేశంలో machine producing industries ఏర్పడుతాయా; ఆ పద్ధతిలో ఈ 2వ పంచవర్ష ప్రణాళిక ఉన్నదా అంటేలేదు. ఇదివరకు లేనట్లుగా heavy steel forgings, heavy steel castings, steel fabrications, Engineering Industries కు సంబంధించినవాటిలో ముందుకు పోతున్నాము. [illegible] కావలిసిన యంత్రాలు Engines మనదేశంలో తయారుచేయడానికి

24th March 1956] [Sri P. Sundarayya

ప్రణాళిక వేస్తున్నాము. Motor cars మన దేశంలో తయారుచేస్తున్నాము 57 వేల కార్లు 1960 నాటికి తయారు చేయగలమని చెబుతున్నారు. Railway engines మనదేశంలోనే తయారుచేయడానికి చిత్తరంజన్ ఫ్యాక్టరీ స్థాపించాము. టాటా కంపెనీవారు మోటరుగేజికి కావలసిన Engines తయారుచేస్తున్నారు. క్రమేణా మనదేశంకూడా పారిశ్రామికంగా తన కాళ్లమీద నిలబడకలుగుతుందని సంతోషమూ కలుగుతోంది. అయితే క్రమేణాఅంటే అర్థంఏమిటి ? 1960 నాటికి ఏమి అవుతుందో చెప్పలేము. చిత్తరంజన్‌లో ఇంజనులు తయారుచేయడానికి చాలా డబ్బు ఖర్చుపెట్టాము. మనం గర్వించతగిన పరిశ్రమ అది. అయినాదానికి కావలిసిన పనిముట్లు నేటికీ మనదేశంలో తయారు చేసుకోడంలేదు. కీలకభాగాలుకోసం బ్రిటిషుదేశంపై ఆధారపడవలసిఉంటోంది. 80% చేసుకుంటున్నాం ; 90% చేసుకుంటున్నాము, 10% మాత్రమే బ్రిటన్ నుంచి తెప్పించుకుంటున్నాము అని సంతోషపడడం న్యాయమాఅని అడుగుతున్నాను. మునపటికన్న ముందుకుపోతున్నామనే మాటనిజమే. అయితే మనకాళ్లమీద మనం నిలబడకలుగుతున్నామా అనేదేప్రశ్న. బ్రిటిషు సామ్రాజ్యవాదులుకాని, రష్యాకాని, చైనాకాని ఎవరిమీదా ఆధారపడకుండాఉండే శక్తి మనకుఉన్నదా ? ఈ శక్తిని మనం ఎంతత్వరగా సాధించుకోగలము ? చైనా 1957 లోపల చేసుకోగలిగితే మనం 1960 నాటికైనా చేసుకోగలమా ? బిర్లా పెద్ద పారిశ్రామికవేత్త ; డబ్బు ఎక్కువ తీసుకుంటున్నారనేది మరొకసారి చూద్దాం ; అనేక factories దేశంలో నిర్మించారు. బ్రిటన్‌తో ఒప్పందం చేసుకుని మొదటిసారిగా భారతదేశంలో మోటారుకారులు తయారుచేస్తున్నందుకు సంతోషం. ఎవరి సహాయమైనా తీసుకోవచ్చును. గాదాపు 15 సంవత్సరాలుగా ఈ పరిశ్రమఉన్నది.

కానీ ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలోనే ప్రభుత్వం ప్రకటించిన డాంట్లోనే 57,000 మోటారుకారులను, లారీలను మనం 1960 నాటికి తయారు చేయగలమని చెప్పుతూ డాంట్లో 100 టికి 80 పాళ్లు మాత్రమే మనదేశంలో తయారు చేస్తాము. మిగిలిన 20 పాళ్లుకూడా బైటనుండి తీసుకొస్తామనిచెప్పారు. ఈ విషయంలో 124 వ పేజీలో clear గా ఉంది automobiles, motor cycles, auxiliary industries 57 వేలు అని చెప్పేసి automobiles లో 80% కు మాత్రమే భారతదేశపు ముద్దర అని చెప్పారు. మిగిలిన 20 పాళ్ల సంగతేమిటి ? ఏ మోటారు కారైనా ఏ ఇంజనైనా 100 టికి 99 పాళ్లు మనం తయారుచేస్తాం అనుకోండి. ఆ ఒక్కపార్టు, ఆ ఒక్కమేకు, ఒక ball bearing లేకుంటే ఆకారు నడుస్తుందా? ఆ ఇంజను పనిచేస్తుందా ! ఆ విమానం ఎగురుతుందా ? ఇదే సమస్య. అంటే 100 కు 85 పాళ్లు 90 పాళ్లు 95 పాళ్లు-మునుపటికన్న కొంత మెరుగని మనం సంతో

Sri P. Sundarayya] [24th March 1956

పించడంతోపాటు తయారుచేసినా మిగిలిన 10 లేక 20 పాళ్లకోసం ఇంకో దేశంమీద ఆధారపడాలి. వాళ్లు ఎప్పుడు పడితే అప్పుడు మన గొంతుక నొక్కే దానికోసం వాళ్ళచేతుల్లో కీలు ఉంది. మన ప్రాణాలు వాళ్ళచేతుల్లో పెట్టి కూర్చునే దుస్థితి ఇంకా మన ముందనే సంగతిమాత్రం మనం గుర్తించాల్సి ఉంటుంది. 4, 800 కోట్ల ప్రభుత్వరంగానికి ఖర్చు పెట్టుతున్నారు. ఉక్కు పరిశ్రమను అభివృద్ధిచేస్తున్నారు. ఈ యంత్రపరిశ్రమలు మనకు అత్యంత అవసరము. ప్రభుత్వం కోరినటువంటి, చెప్పుతున్నటువంటి, ఆరంభించి నటువంటి factory లైనా సరే 1960 నాటికైనా ప్రతియొక్క కీలకభాగాన్ని మనదేశములోనే తయారుచేసేరకంగా ఎందుకు కృషిచేయరు ? దాని కడ్డంకు లేమి ? ఇంగ్లీషువారు technical సహాయంచేయకపోతే వేరెవరైనా ఇచ్చే దానికి తయారైతే వాళ్ళదగ్గఱకెళ్ళి తెచ్చుకుంటాం. లేదా వాళ్ళ patents కొబట్టి వాటికి డబ్బు కట్టితేగాని ఇవ్వమంటే, అవసరమైతే డబ్బుకట్టి తెచ్చుకొంటాము. "డబ్బు కట్టినా ఇవ్వము మీరు మా పరిశ్రమల రహస్యాలు తెలుసుకొన్నట్లయితే మీరు మా వస్తువులనుకొనరు" అంటారా! వాళ్ల విమానాలను కొనుక్కొని మన ఇంజనీర్ల చేతులలో పెట్టి ఏ ఏ భాగాలు ఎట్లెట్లా ఎక్కడ ఉన్నవో చూచి మనము ఆ patent భాగాలను రద్దుచేసి మనదేశమున మనమెందుకు తయారుచేసుకొనకూడదు? డబ్బు ఇస్తాం మీ patent మాకివ్వమంటే, డబ్బు ఇచ్చినాసరే మీకు మేము patents ఇవ్వము, మేము చెప్పినట్లే చెయ్యాలి మాకిష్టమొచ్చినప్పుడే మీకిస్తామనేరకంగా ఎవరన్నాసరే, 'మీసహాయం మాకొద్దు, మీ సంగతో, మా సంగతో' తేల్చుకుంటాం, అని చెప్పే దానికి అభ్యంతరం ఏమీలేదు. దీనికి జాగు ఎందుకు జరుగుతున్నదో ఆలోచించాలి అదేరీతిగ భారీ విద్యుచ్ఛక్తి యంత్రాలు తీసుకుంటే మొదటి పంచవర్ష ప్రణాళికలోనే దానిని స్థాపించాలని ఉన్నప్పటికీగాను ఇంతవరకు ఎందుకు స్థాపించలేకపోయారు? వందలకొలదికోట్ల రూపాయలను ఖర్చుచేసి మనం విదేశాలనుంచి విద్యుచ్ఛక్తి తయారుచేసే జనరేటర్లను, turbines ను తెప్పించుకొంటున్నాం. పెద్దపెద్ద hydro-electric schemes భాక్రానంగల్ గాని, మన రాష్ట్రంలోని మాచ్‌ఖండ్ గాని, ఇంతకాలం ఆలస్యంకావడానికి ఒక కారణం మనకు ఆ కాలానికి వాటికి కావలసిన యంత్రాలు రాకపోవడమేనని మనకు అందరికీ తెలిసినదే. అందుచేత ఆ రకంగా ఆ మొదటిరోజుల్లో మనకేమి లేదుకాబట్టి [illegible] ఆలస్యమైనాకూడా, ఎంతకష్టమైనా తలవంచుకోక తప్పదు. కాని [illegible] మొదటిపంచవర్షప్రణాళిక

లో నే తలపెట్టినటువంటి భారీ విద్యుత్ యంత్రాగారాన్ని అప్పుడు ఆరంభించకుండా ఈరోజు మళ్ళీ బ్రిటిష్ ప్రభుత్వం, బ్రిటిష పెట్టుబడిదారులతో ఒక ఒడంబడికకు వచ్చి ఆరంభిస్తున్నాము. ఒడంబడిక ఎవరితోనైనా వచ్చేదానికి నాకేమి అభ్యంతరములేదు. మూడవ పంచవర్ష ప్రణాళికలో కొంతకాలం జరిగితే తప్ప అది పూర్తికాదు. అప్పటికిగాని మనం generators ను నిర్మించుకోవటానికి సాధ్యం కాదని ఈ 113 వ పేజీలో వుంది. 25 కోట్లరూపాయలు దీనికి అవుతుంది. పూర్తి అయ్యేసరికి 8 ఏండ్లవుతుంది. దాని తర్వాతనే heavy trans-formers, industrial motor generators, వీటినన్నింటిని తయారుచేసుకొను స్థితికిరాగలమని అనుకొంటున్నాను. ఒక ప్రక్కన కోట్లకొలది ధనం విద్యుచ్ఛక్తియంత్రములపై ఖర్చుపెడుతూ విద్యుచ్ఛక్తి లేకుండా పరిశ్రమలను అభివృద్ధిచేయలేమని చెప్పి విద్యుచ్ఛక్తిమీద మనము ధనం కేంద్రీకరిస్తూ మనదేశంలో ఆ విద్యుచ్ఛక్తికి కావలసిన generators ను, turbines ను, 50 వేల కిలోవాట్లులను తయారుచేసేటటువంటి వాటినిగురించిగాదు—10 వేలు, 5 వేలు, 2 వేలు, 3 వేలు తయారుచేసేటటువంటి generators ను, turbines ను తయారుచేసుకొనేదానికోసం భారీ విద్యుచ్ఛక్తి యంత్రాగారము ఇంతవరకుకూడ మనకు లేకపోవడం శోచనీయము. బ్రిటిష్ ప్రభుత్వంతో, సంబంధం పెట్టుకోవడంవల్ల, ఏరకంగా సామరస్యం ఉంటుందో ఆలోచించాలి. బ్రిటిష్ ప్రభుత్వంతోగాని, బ్రిటిష్ పెట్టుబడిదారులతోగాని, ఎవరితోగాని సంబంధం పెట్టుకొనేదానికి నాకు అభ్యంతరములేదు. కాని సాధ్యమైనంత త్వరలో ప్రతియొక్క భాగము మన ఇంజనీర్లు, మన పరిశ్రమల్లోనే పూర్తిగా మన factory ల్లోనే తయారుచేసేటట్లుండాలి. దానికి ఒప్పుకుంటేనేగాని లేకపోతే మీతో ఒడంబడిక చేసుకోము అని ఖచ్చితంగా చెప్పాలి. బిర్లా-నెఫీల్డు ఒడంబడిక, లేకుంటే Imperial Chemical Industries—టాటా కంపెనీలవారు చేసుకొన్నటువంటి ఒడంబడికలను పరిశీలించాలి. Heavy chemicals, caustic-soda, soda ash, sulphuric acid ఇంకా ఇతరరకాలైన heavy chemicals ను తయారుచేసేదానికొఱకు, కేవలం రంగులకేకాక అనేక పరిశ్రమలకు ఉపయోగించే dye stuffs ను తయారుచేసుకొనేదానికి, ఆఖరుకను యుద్ధానికి కావలసిన ప్రేలుడుమందుకొఱకు ఇంకొక దేశంమీద ఆధారపడకుండా మనదేశంలోనే తయారుచేసుకొనేదానికికూడ మనం పూనుకుంటే మంచిది. దీనికికూడ I.C.I.తో ఒడంబడికకు రావటం జరిగింది. ఈ ఒడంబడిక ఇంతవరకు బయటికిరాలేదు. ఈ ఒడంబడికలో షరతుల విషయమై మేము ప్రభుత్వాన్ని కోరేదేమిటంటే, "మీరు దేశాన్ని బ్రిటిష్‌వారికి అమ్మేసి వారిక్రింద ఎల్లకాలం తొత్తులుగా వుండాలని చేస్తున్నారు" అనడం చాల పొరబాటు, అది మేము అనడంలేదు, కాని

Sri P. Sundarayya] [24th March 1956

ఏకారణాలచేతనైనా సరే ఏ ఒడంబడికైనా సరే దేశానికి నష్టకరంగా ఉంటే, అటువంటిషరతులు విధిస్తున్నప్పుడు, అటువంటి షరతులు అగ్రిమెంట్సులు ఉంటున్నప్పుడు ఈ అగ్రిమెంటులను ఎవరుచేసుకొన్నా,—బిర్లా చేసుకొనివ్వండి, టాటా చేసుకొనివ్వండి, ఇదివరకు ప్రభుత్వవిధి లేకుండా ఒకపర్యాయం చేసుకొన్నప్పటికైనా సరే—ప్రభుత్వం ఒకపరి పునరాలోచనచేసి ఏదైతే మనదేశంలో తయారు చేయాలి అని అనుకొంటున్నామో, వాటినన్నింటినికూడా ఇక్కడే తయారుచేసేటట్లుగాను, ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేలోపల, పూర్తి చేసేటట్టుగాను ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. అప్పుడే మన కాళ్లమీద మనం నిలబడగలం. అప్పుడే పారిశ్రామికంగా మనము ముందుకు పోగలమనే ధైర్యంకూడా ఉంటుంది. లేకపోతే ఏ రోజంటే ఆరోజు బ్రిటిష్‌వారి దయాదాక్షిణ్యాలమీద, అమెరికా దయాదక్షిణ్యాలమీద ఆధారపడవలసి ఉంది. ఇప్పుడు Pakistan కు అమెరికా ఏరీతిగా ఆయుధాలనిచ్చి మనలను బెదరించడానికి చూస్తూఉందో రోజురోజు సరిహద్దుసంఘటనలు ఏవిధంగా జరుగుతూన్నాయో మనకంతా కనబడుతూఉంది. చూస్తూనేఉన్నాం. అయితే ఈ రోజు Dr. Katju గారు ఆయుధాలగురించి పార్లమెంటులో చెబుతూ భారతదేశంలో మామూలు యుద్ధానికి కావలసిన ఆయుధాలు, అంటే మఱఫిరంగులు మొదలైన వాటినన్నిటినికూడా మనదేశంలో తయారుచేసుకుంటున్నాము అన్నారు. వారి ఉపన్యాసము నేను పూర్తిగా చదువలేదు. ఇదివఱకు తుపాకులు చిన్నచిన్న మఱఫిరంగులు వీటిని చేయటమేగాని భారిమఱఫిరంగులను మనదేశంలో చేస్తారనుకోవడం లేదు. పోనీ ఇవన్నీకూడు చేస్తున్నాము కానీ దానికి కీలకమైనటువంటి భాగాలు, కావలసినటువంటి ఉక్కుకూడ మా దేశంలో లేదు. వాటినన్నిటిని విదేశాలనుంచి తెప్పించుకోవలసివస్తుంది. వాటికి కావలసిన explosives కొరకు విదేశాలమీద ఆధారపడవలసి వస్తుంది. అందుచేత తుపాకీలు తీసుకొని దానిలో మందులేకుండా ఉంటే మనం Nitrate పెట్టి ఈ ఆధునికయుద్ధంలో కాలుస్తామా ? ఎన్నో explosives ను తయారు చేసుకోటానికి ఇంతవరకు మనం పూనుకోకపోవడం మంచిదికాదు. ఈ విషయములలో ఈ Company లతో మనం సంబంధం పెట్టి ఉంటే వాళ్లు ఇది technical పనిగాబట్టి ఆలస్యంగాను, మెల్లగాను చేస్తామని కూర్చుంటే ఏరీతిగా మనము మనకాళ్లమీద నిలబడేదానికి వీలుంటుంది. అందుచేత ఖర్చుపెట్టినంతవరకు మనకు కావలసిన ఆయుధాలన్నీ మనమే తయారుచేసుకోగలం. ఆ ధైర్యం కావాలి. చేసుకోగలిగినంతవరకు డబ్బు ఖర్చు [illegible]వరకు ఈ ఫలితం మనకువచ్చేటట్టుగా మనకాళ్ళమీద మనం నిలబడే [illegible] ఒడంబడికలను అన్నిటినీకూడా ఏ పరిస్థితులలో ఎవరు చేసుకున్న

24th March 1956] [Sri P. Sundarayya

ప్పటికీ, మన భారతదేశ స్వతంత్రంకొరకు మన భారతప్రజలయొక్క స్వతంత్రం నిలబెట్టుకునే దానికోసం వీటిని తిరిగి ఆలోచించి అవసరమైతే రద్దుచేసి క్రొత్త పునాదులమీద వెళ్ళాల్సివుంటుందనిమాత్రం యీ విషయంలో చెప్పాల్సివుంటుంది. చైనాలో యీ విద్యుచ్ఛక్తి పరిశ్రమ చూసుకున్నప్పుడు 8 లక్షల Kilo watts శక్తి కలిగేటటువంటి generators ను, turbinesను తయారుచేయగలుగుతున్నారు. 1960 నాటికి చేయగలం అనిచెప్పివాళ్ల ప్రణాళికలోవున్నది. అప్పుడే కొన్ని ఆరంభించారు. మనంమాత్రం ఎందుకు చేయకూడదు? 8 లక్షలు కాకపోతే 3 లక్షలు చేసుకుంటాం, 2 లక్షలు చేసుకుంటాం. తరువాత యింకా ముందుకుపోయే దానికి వీలుంటుంది. ఆరీతిగా చూడమని కోరుతున్నాను. అదేరీతిగా ఉక్కు పరిశ్రమకు వచ్చినప్పుడు 43 లక్షల టన్నులు తయారుచేస్తున్నాం అని Sri T. T. Krishnamachari గారు మూడవ పంచవర్ష ప్రణాళిక అయేటప్పటికి 2 కోట్ల టన్నులుకూడా కావలసిన అవసరంవుంటుందని మేము తయారుచేస్తాంఅన్నారు. సంతోషం. మహాసంతోషం. అయితే యిప్పుడు శ్రీ కళావెంకట్రావు గారు చెప్పారు. ఈ మూడు factory లు పెట్టాల్సివచ్చేప్పటికి 350 కోట్ల రూపాయలుపెట్టవలసి వస్తుంది. దీంట్లోప్రధాన భాగం విదేశాలనుంచి వచ్చే యంత్రాలకు ఖర్చుపెట్టడం జరుగుతుందన్నారు. నిజమే, కాని 1960 నాటికయినా మనం యింకో దేశం వెళ్ళి మాకు steel factory కట్టిపెట్టండి, దానికి మేముయింత డబ్బిస్తాం అనేదానికన్నా మన యంత్రాలతో తయారుచేసిన భాగాలతో మన దేశంలో మనమే ఒక steel factory కట్టుకోడానికి కావలసిన పునాదులు ఎందుకు వేసుకోకూడదు? రెండవ పంచవర్ష ప్రణాళికలో మొదటి చట్రం అని యిచ్చినటువంటి దాంట్లో సంవత్సరానికి 10 లక్షల టన్నులు తయారుచేసేటటువంటి ఉక్కు factory ని మనదేశంలో నిర్మించటానికి కావలసిన యంత్రాలన్నికూడా తయారు చేసేటటువంటి యంత్రాభివృద్ధి చేయవలసినదని దీంట్లో ఒక aim క్రింద యిచ్చారు. రెండవ పంచవర్ష ప్రణాళికలో అటువంటిది కనబడుతున్నదా అంటే నాకు ఎక్కడా కనబడడంలేదు. ఒక 12,000 టన్నులు heavy castings కు, 15000 టన్నుల forgings కు, steel fabrication కు 5 లక్షలు మాత్రం కనబడుతున్నాయి. ఇవి చేసినంత మాత్రాన 10 లక్షలు తయారుచేయగలిగిన ఉక్కు పరిశ్రమ మనదేశంలో స్థాపించగలమని నేను అనుకోను. ఎందుకొరకు దానిని మానుకోడం జరిగింది? ఉక్కు factory లు కట్టమన్నారు. బాగానేవుంది. తరువాత మేము కట్టుకునే దానికి కావలసిన పరిశ్రమకూడా కట్టమని మనం ఎవరితోనైనా ఎందుకు ఒడంబడిక చేసుకోకూడదు? 5 ఏండ్లలో 6 ఏండ్లలో ఎందుకు పూర్తి చేసుకోకూడదు? 43 లక్షలనుంచి 2 కోట్ల టన్నులకొరకు 3 పంచవర్ష ప్రణాళికలు పూర్తయేటప్పటికి

Sri P. Sundarayya] [24th March 1956

ఎవరిమీద ఆధారపడి చేసుకుంటాం ? మళ్లా బేరం యిచ్చేదానికి ఎవరి దగ్గరకు వెళ్లాల్సివస్తుంది ? అందుచేత మేము యీ పరిశ్రమలగురించి చెప్పేదంతా ఒకటే. రెండు రెట్లు మూడు రెట్లు పెంచడం అనేటటువంటిదికాదు మూడు రెట్లు పెంచుతాం అంటే సంతోషమే. రెండు రెట్లు మూడు రెట్లు పెంచుతాం అంటే ఇవన్నీ assembling factories క్రింద లేకపోతే బ్రిటిషువారి దయాదాక్షిణ్యం క్రింద రష్యావాళ్లు యిస్తే తప్ప మరొకటిలేదని ఆ రీతిగాకాదు, సహాయం తీసుకుంటాం. కావలసివస్తే ఎక్కువ వడ్డీ యిస్తాం. కాని 5 ఏండ్లయిన తరువాత మన కాళ్లమీద మనం నిలబడేటటువంటి విధంగా యీ పరిశ్రమలు మార్చుచేయాలి. ఈరోజు దురదృష్ట వశాత్తు అనేక పరిశ్రమలలో యీ రీతిగా స్వయం సమృద్ధిగా, స్వయం పోషకంగా తమ కాళ్లమీద నిలబడేటట్టుగా ప్రతి భాగాన్నీ భారతదేశంలోనే తయారు చేసేటట్లుగాలేవు. ఈ ప్రమాదాన్ని ప్రభుత్వం తెలిసికొని వెంటనే దీని దిద్దేదానికి అవసరమైన చర్యలు తీసుకోవాలి. అటువంటి చర్యలు తీసుకున్నప్పుడే, పూర్తిగా అన్ని పార్టీలవారు, యితర విషయాలలో ఎన్ని భేదాలున్నా, మన దేశాన్ని కాళ్ళమీద నిలబడగలిగేటట్టు చేసేదానికి కోసం కావలసిన అన్ని రకాల సహాయం, అన్నిరకాల తోడ్పాటు చేసేదానికి అభ్యంతరంలేదు పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్నప్పుడు జాతీయ ఆదాయం గురించికూడా మనం చూడాలి. నిజమే రు. 10,840 కోట్ల నుంచి రు. 13,480 కోట్లకు జాతీయ ఆదాయం పెరుగుతుంది. అయితే యిక్కడకూడా ఆదాయం ఏరీతిగా వస్తున్నది అని 26 వ పేజీలో నిచ్చిన లెక్కలనుబట్టి శాతంకట్టినట్టయితే 1955-56 లో వ్యవసాయంక్రింద నూటికి 50 పాళ్లు ఆదాయంవస్తే 1960-61 లో కూడా నూటికి 46 పాళ్లు వ్యవసాయంమీద ఆదాయం వస్తుంది. అదేరీతిగా ఖనిజాలనుంచి 1955-56 లో నూటికి 1 పాలు జాతీయ ఆదాయం వస్తున్నది. 60 నాటికికూడా అదే ప్రమాణంలో వస్తుంది. ఆదేశాతంలో వస్తుంది. 1955-56 లో నూటికి 8 పాళ్లు జాతీయాదాయం పరిశ్రమల ద్వారా వస్తున్నది. 1960 నాటికి నూటికి 10 పాళ్లు మాత్రమే మనకు పరిశ్రమల నుండి అదనంగా వస్తుంది చిన్నపరిశ్రమలనుండి 1955-56 లో 8% వస్తూంది. 1966 నాటికి ఆ 8 పాళ్ళే వస్తుంది. Buildings కట్టడంవల్ల వచ్చేది 2%. 60 నాటికికూడా 2%. వ్యాపారం, రవాణా వీటినిబట్టి అప్పుడూ 17% ఇప్పుడూ 17%. అందుచేతే యీ రకంగా చూసుకున్నప్పుడు మనదేశం పారిశ్రామిక అభివృద్ధి [illegible] చేసుకోగలమని ఈ పెట్టుబడిని బట్టిగాని జాతీయ ఆదాయంబట్టి [illegible] 1960 నాటికి కూడా చెప్పతగినంత — [illegible]

24th March 1956] -Sri P. Sundarayya

హర్షించతగినంతగా కర్తవ్యం పూర్తిచేశామని మన కాళ్లమీద నిలబడి శత్రువులను ఎదుర్కొనగలమని, ప్రజలకు సౌకర్యాలు చేకూర్చగలం ఆనేరీతిగా మనం కొత్త గాలిని పీల్చుకొని నిలబడేదానికోసం ఆస్కారం ఏమాత్రమూ లేదు. మొత్తం జాతీయాదాయం, పారిశ్రామిక అభివృద్ధి చూసుకున్నా 1955-56 కంటె కొంత మెరుగయినా చాల కొద్ది మెరుగనే గుర్తించుకోకపోతే నిజంగా మన రెండవ పంచవర్ష ప్రణాళికలో మనం చెప్పిన ఆశయాలకి కార్యాచరణకు మాత్రం చాలాదూరంగా ఉంటుంది అనేసంగతి ప్రభుత్వదృష్టికి మేము తీసుకురాదలచుకున్నాము. చిన్న పరిశ్రమలకు 200 కోట్ల రూపాయలు కేటాయించారు. సంతోషమే. చిన్నపరిశ్రమలంటే ఏమిటి ? అది యీ పుస్తకంలోనే కార్వేకమిటీ రిపోర్టు ఆధారంగా చేసుకుని చూచినట్లయితే 133 వ పేజీ కార్వేకమిటీ 260 కోట్లు సూచించింది ప్రభుత్వం ధనాభావంచేత 200 కోట్లకు తగ్గించింది. దాదాపు సగభాగం చేనేతపరిశ్రమ—ఖాదీపరిశ్రమ—వీటికోసం ఖర్చుపెట్టడం, మిగిలింది అంతాకూడా small scale industries, అంటే 5 లక్షల పెట్టుబడి కలిగినటువంటి చిన్నచిన్న పరిశ్రమలకు 55 కోట్లు మాత్రమే కేటాయిస్తూ మిగిలిందంతాకూడా కుటీరపరిశ్రమలకు కేటాయించారు. చెప్పులు, నూనెగానుగలు దంపుడు బియ్యంవంటి కుటీరపరిశ్రమల కోసం మిగిలిన 50 కోట్లు ఖర్చుపెట్టడం జరుగుతుంది. ఈరోజు కుటీరపరిశ్రమలలో పని చేస్తున్నవాళ్లకు తిండికి జరుగుబాటులేదు. పూర్తిగా పనిలేదు. వీళ్లకు పూర్తిగా పని కల్పించాలి. రోజల్లా కుటుంబం అంతా పనిచేస్తే 20 లేక 25 రూపాయలు రాని వాళ్లకు యింకో 20 రూపాయలయినా ఎక్కువచేయడానికి 200 కోట్లు అవసరం. అయితే ఇంకో వందకోట్లు అయినా ఖర్చుపెట్టడానికి ఎవ్వరికీ అభ్యంతరంలేదు. పని చేసే వాళ్ళకు మరి-కొత్త తిండిపెట్టేదానికోసం యీ కేంద్రప్రభుత్వంకూడా ఒక ప్రణాళిక వేస్తున్నది. అక్కడకూడా భేదాభిప్రాయాలున్నాయి. ఈ కుటీర పరిశ్రమలుకూడా మరింత పెంపొందిస్తూ భారీ పరిశ్రమలు పెద్ద పెద్ద యంత్రాలు, భారీ పరిశ్రమలు ప్రజలకు కావలసిన వస్తువులన్నీ కుటీర పరిశ్రమలలోనే తయారు చేయిస్తాం అని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు చెప్పిందాంట్లోలేదు. ఈ ప్రణాళికలో ఏ కారణంచేతనో అది వుంటూవుంది. చేనేత పరిశ్రమకు కావలసిన రక్షణ యివ్వండి, అన్ని రకాల సౌకర్యాలు కలుగజేయండి, పనిచూపించండి, లేకపోతే శుభ్రంగా తిండిపెట్టడానికి నిరుద్యోగభృతి లాంటిది యివ్వండి. ఇచ్చినట్లయితే తప్పకుండా బలపరుస్తాం. కాని కుటీర పరిశ్రమల ద్వారానే మన ప్రజలకు కావలసిన అవసరాలను తీర్చగలం అనే సిద్ధాంతంమీద మాత్రం వెళ్లినట్లయితే అదిన్ని

Sri P. Sundarayya] [24th March 1956

నిరుద్యోగాని పోగొట్టదు. మన ప్రజలకు కావలసిన వస్తువులు తయారు చేయడానికి సాధ్యంకాదు. పరిశ్రమలకు అనుగుణ్యంగా అనుబంధంగా కుటీర పరిశ్రమలు కొంతవరకు పనిచేయగలిగితే తప్పితే పరిశ్రమలకు పోటీగా కుటీర పరిశ్రమలు పెట్టే టటువంటి ధోరణితో తీసుకుంటే మాత్రం యీ 200 కోట్ల రూపాయలు దుర్వినియోగం అవుతుందని చెప్పాల్సివస్తుంది. అంతేకాదు ఈ సందర్భంలో మరొక సంగతికూడా నేను చెప్పాల్సివుంటుంది. మన దేశానికి కావలసిన పరిశ్రమల గురించి 60%, 70% మాత్రమే 1960 నాటికి యంత్ర పరిశ్రమల క్రింద తయారు చేసుకోగలం మన దేశంలో అని Sri T. T. Krishnamachari గారు చెప్పారు. అయితే 70%, 60% అయినా మన దేశంలోనే తయారవుతాయా, లేక యితర దేశములపై ఆధారపడి ఉంటామా అనేది ప్రధాన సమస్య. దానిని గురించి వారిచ్చిన ఉపన్యా సంలో, పత్రికలో వచ్చినదానినిబట్టి చూసినట్లయితే, అంతగా కనపడడంలేదు.

మనం పారిశ్రామికాభివృద్ధికొఱకు, విదేశాలతో, విదేశపెట్టుబడిదారులతో అనేక ఒడంబడికలు చేసుకున్నాము. అవన్నీ రద్దుచేయండి. వాటిని రద్దుచేయకుంటే మనదేశం నిజమైన పారిశ్రామికాభివృద్ధిలో ముందుకు పోతాము అనుకోవడము పొర పాటుఅని చెబుతున్నాను.

National Development Council చర్చలలో అనేకరాష్ట్రాలు పాల్గొ న్నవి. భారతదేశం చాలా వెనుకబడిఉన్నది. వెనుకబడిఉన్న ప్రాంతాలలోకూడా అన్ని ప్రాంతాలు ఒకేరకంగా అభివృద్ధి చెందలేదు. కొన్ని రాష్ట్రాలు బాగా అభి వృద్ధిచెందినాయి.

ఈ వెనుకబడిన రాష్ట్రాలను ముందుకు తీసుకొని పోనంతకాలము, భారతదేశం, సమిష్టిగా, బలంగా ఉంటుందను కోవడము పొరపాటు. పారిశ్రామిక విషయంలో గాని, ఇతర విషయాలలోగాని వెనుకబడిన ప్రాంతాలకు ప్రత్యేకశ్రద్ధవహించి అభివృద్ధిచెందేట్లు చేయడానికి తప్పకుండా ప్రణాళికలు అవసరము. ప్రణాళికలో కేటాయిస్తున్నప్పుడు దీనిని ఒక అంశముగా పెట్టుకొనే కేటాయింపులు జరగాలి. వెనుకబడిన ప్రాంతాలకు ప్రాధాన్యతయిస్తూ డబ్బు కేటాయించినట్లు నాకు ఎక్కడా కన్పించ డములేదు. వెనుకబడిన ప్రాంతాలు వెనుకబడేఉన్నాయి, అభివృద్ధిచెందిన ప్రాంతా లకు మాత్రమే పరిశ్రమలు అన్నికూడా కేంద్రీకరించబడ్డాయి.

[illegible] బొగ్గు, ఇనుము దొరికిచోట ఉక్కు పరిశ్రమ పెట్టడానికి వీలవుతుంది అంటు న్నారు. ఈ వాదనను నేనుకూడా అంగీకరిస్తున్నాను. మన ఆంధ్రరాష్ట్రములో [illegible] ఇనుము దొరుకుతుందో, ఎక్కడ బొగ్గుదొరుకుతుందో, వాటి రెంటిని [illegible] ఉక్కు పరిశ్రమను ఏర్పాటు చేయగలము అనేది

అనేది ఆలోచించాలి. అదితేలేదాకా భారతదేశంలో ఎక్కడా ఉక్కుపరిశ్రమ పెట్టవద్దు. ఇదివరకే బెంగాలులో, బీహారులోను ఉక్కుపరిశ్రమలు ఉన్నాయి. డబ్బు కేటాయింపు చూచినట్లయితే, వెనుకబడిన ప్రాంతాలను ముందుకు తీసుకొని పోయేందుకు పారిశ్రామికంగాకూడా ఏమీ కేటాయించలేదు. ఈ విషయము మంత్రివర్గము కేంద్రప్రభుత్వదృష్టికి తీసుకువచ్చి తగినట్లు దెబ్బలాడవలసి ఉంటుందని చెబుతున్నాను వారు మనకు మొండిచెయ్యి చూపుతోంటే మాట్లాడకుండా కుర్చునేపద్ధతిని నేనుమాత్రం ఒప్పుకోవడములేదు. దీనిమీద మీరు తగిన చర్యలు తీసుకోలేదని చెబుతున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI :—రైళ్లు ఆపమంటారా?

SRI P. SUNDARAYYA :—రైళ్లు ఆపమని చెప్పడములేదు.

THE HON. SRI K. VENKATA RAO :—మమ్ములను రాజీనామా ఇవ్వమంటారా ?

SRI P. SUNDARAYYA :—ప్రజలు నన్ను ఎన్నుకొనంతకాలం మీరు రాజీనామాఇచ్చినా, నేను అక్కడ కూర్చొనేటంత పొరపాటుపని చేయదలచుకోలేదు. కేంద్రభుత్వంలోను కాంగ్రెసుప్రభుత్వమే ఉన్నది. అన్ని రాష్ట్రములలోను కాంగ్రెసుప్రభుత్వమే ఉన్నది, మనరాష్ట్రంకూడా ఒక అడుగుముందువేసి 5 యేండ్లలలో కాకపోతే 20 యేండ్లలోఅయినా అన్నిరాష్ట్రాలతోపాటు సమానంగా రావాలి. పొగాకుమీదవచ్చె పన్నులో మనకు రావలసిన వాటా కేంద్రప్రభుత్వము ఇవ్వడములేదు. మనకు ఎంతరావాలోకూడా అనేకపర్యాయములు లెఖ్కలతో సహా చూపించినాను. దానిని సాధించేదాకా పదేపదేచెప్పక తప్పదు. అవిధంగా వారు ఇవ్వకపోతే ఈ ఆంధ్రరాష్ట్రమును కేంద్రప్రభుత్వమే తీసుకొని నడిపించమని కాంగ్రెసుపార్టీ అంతాకూడా ఏకంగా నిలబడిచెప్పండి.

THE HON. Dr. B. GOPALA REDDI :—తిరువాన్కూరు కొచ్చిన్ రాష్ట్రమును ఏమిఅన్నారో మనకుకూడా అదే అంటారు.

SRI P. SUNDARAYYA:—తిరువాన్కూర్ కొచ్చిన్‌లో మేము, కమ్యూనిస్టు పార్టీవారు, 62 మంది ఉన్నారు. మేము ప్రభుత్వమును ఏర్పాటుచేస్తాము అంటే మీకు చేతకాదు, మేమే చేతనైనవాళ్లము అని ప్రభుత్వాన్ని రద్దుచేసింది.

విద్యుచ్ఛక్తికి ఆంధ్రరాష్ట్రానికి చాలా తక్కువ కేటాయించారు. 800, 400 మైళ్లు lines మన రాష్ట్రంలో వేసుకునేందుకు వీలున్నది.

Sri P.Sundarayya] [24th March 1956

ఆంధ్రరాష్ట్రములో చెప్పుకోదగ్గ పరిశ్రమలు లేవు. క్రొత్త రైలుమార్గాలు ఏమీ లేవు. ఇది వ్యవసాయదేశంగానే ఉన్నది. విద్యుచ్ఛక్తిని తయారుచేసే దానికోసం అదనంగా ఏమీ కేటాయించలేదు. మన రాష్ట్రములో కృష్ణా, గోదావరి, పెన్నా నదులు ఉన్నాయి. ఆ నీటితో ఎక్కువ పంటలు పండించే దానికి అవకాశము ఉన్నది. ప్రాజెక్టులకోసం మనం బ్రహ్మాండంగా ఆందోళన చేస్తున్నాము. పోనీ మన రాష్ట్రమును పారిశ్రామికంగా కూడా ఏమీ అదనంగా అభివృద్ధి చెయకపోయినా, వ్యవసాయికంగా అభివృద్ధి చేస్తున్నారా అంటే, దానికి డబ్బు కేటాయించలేదు. మనలను కేంద్ర ప్రభుత్వము ఎంతో అన్యాయము చేస్తున్నది.

బొంబాయిలో 240 కోట్ల రూపాయిలు పెట్టుబడి గలవి 25 ఫ్యాక్టరీలు ఉన్నాయి. అందులో ఇంకా కొన్ని ముఖ్య పరిశ్రమలు లేవు. నౌకలను తయారు చేయుట, విమానాలు తయారుచేయుట, ఇటువంటి పెద్ద పరిశ్రమలు లేనప్పటికి 240 కోట్ల రూపాయలు పెట్టుబడి కలిగినవి చాలా ఉన్నాయి. వాటిలో 5 లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు. అసలు బొంబాయిలో ఉన్న పరిశ్రమలన్నింటిలో పనిచేస్తున్న కార్మికులు మొత్తం 80 లక్షలమంది. అందులో ఈ ముఖ్యమైన పరిశ్రమలలో 5 లక్షలమంది పనిచేస్తున్నారు. వారు సంవత్సరానికి 410 కోట్ల రూపాయలు ఉత్పత్తి చేస్తున్నారు. అందులో ప్రతి సంవత్సరము profit క్రింద, కార్మికుల జీతాల క్రింద 114 కోట్ల రూపాయలు చూచుకున్నట్లయితే, net value క్రింద 33 కోట్ల రూపాయలు వారికి సంవత్సరమునకు వస్తున్నది. బెంగాలులో జనాభా దాదాపు మన జనాభాకన్న 50 లక్షలు ఎక్కువ ఉన్నారు. అక్కడ 165 కోట్ల మూలధనంతో 73 కోట్లు ఉత్పత్తిని తయారు చేస్తున్నారు. దాదాపు మనకన్నా బొంబాయి రాష్ట్రం పారిశ్రామికంగా 20 రెట్లు అభివృద్ధి చెందినది. మన ఆంధ్ర రాష్ట్రంలో బెజవాడ దగ్గర బొగ్గు దొరకదని ఎరువుల ఫ్యాక్టరీ ఇవ్వడం మానివేసినారు. కొత్తగూడెంలో బొగ్గు దొరుకుతుంది గదా అక్కడ పెట్టవచ్చునుగదా ? మన రాష్ట్రంలో సప్లయి అయ్యే ఎరువులు చాలడం లేదు. మనకు దగ్గరగా ఉండేట్లు కొత్తగూడెంలో దానిని పెడితే బాగుంటుంది. భారీ విద్యుచ్ఛక్తి యంత్రాగారం విశాఖపట్టణంలో పెట్టేందుకు ఆలోచిస్తున్నారు.

మన రాష్ట్రములో పెద్ద పెద్ద పరిశ్రమల సంగతి మన ప్రభుత్వము ఏమి ప్రయత్నం చేయలేదు. అసలు మన ప్రణాళికను 600 నుంచి 250 కోట్లకు తగ్గించి [illegible] రెండు రోజులు చర్చ జరిపి, తరువాత 118 కోట్లకు తగ్గించారు. భారీ

విద్యుచ్ఛక్తి యంత్రాగారము వస్తుంది అంటున్నారు. నాకేమీ వచ్చేదాకా నమ్మకము లేదు. కొత్త రైలు మార్గాలకు సున్నచుట్టారు. మేము భిలాయ్‌లో factory కట్టుతున్నాము, రూర్‌కెలాలో factory కట్టుతున్నాము, అక్కడ రైళ్ల జంట మార్గాలు వేస్తున్నాము, దాని క్రిందే డబ్బు అంతా ఖర్చు అవుతున్నది. ఇంకొ అవి పెట్టండి, ఇవి పెట్టండి అంటే డబ్బు ఎక్కడనుంచి తెస్తాము అంటున్నారు. పోని అక్కడనుంచి ఎగుమతులు మన విశాఖపట్టణం రేవుకు వచ్చేటట్లు కడుతున్నారా అంటే, ఒకటి కలకత్తా పోయేట్లు, ఇంకొకటి బొంబాయి పోయేట్లు కడుతున్నారు. రైలు మార్గాలు సరిగా లేవు అంటున్నారు. ఆ రైలు మార్గాలను అభివృద్ధి చేయుటకు ఎందుకు ఆలోచించరు ? రాయచూరునుంచి మదరాసు రావడానికిగాని, బొంబాయి వెళ్లడానికిగాని, బొంబాయినుండి మదరాసు రావడానికిగాని, కలకత్తా నుండి విశాఖ పట్నమునకు రావడానికిగాని రైలు మార్గములు అనుకూలంగా లేవు. అందుచేత భారతదేశాన్నంతా అభివృద్ధి చేయడానికి ఒక రైలుమార్గమయినా వేయాలి. బెజవాడ నుంచి గూడూరు, మైలువారు నుంచి బెంగుళూరులకు రైలుమార్గములు వేయించాలి. ఈ మధ్య ప్రాంతంలో రైలుమార్గం లేదు. ఈ రైలుమార్గం వేసినట్లయితే విశాలాంధ్రాలో కొంతవరకు కొంత కాలానికైనా పనులు సాగించుకొనుటకు వీలవుతుంది. వేయమని అడిగితే " ఇప్పుడు మాదగ్గర డబ్బులేదు " అంటారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వంవారు పరిశ్రమలకోసం బడ్జెట్ లెఖ్ఖల ప్రకారం 950 లక్షల రూపాయలు కేటాయించినారు. అంటే సంవత్సరానికి 190 లక్షలు మాత్రమే కేటాయించినారు. పెద్ద పరిశ్రమలకు, చిన్న పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు సహాయంచేయుటకు మొదలయిన వాటన్నింటికీకూడా ఈ 190 లక్షలలోనే ఖర్చుపెట్టుకోవాలి. అందులో జాతీయ పరిశ్రమలకు 33 లక్షలవరకు ఖర్చు పెడుతున్నారు. అంటే 150 లక్షల రూపాయలు మాత్రమే పరిశ్రమలకు ఖర్చు పెట్టడానికి వీలుంటుంది. పెద్ద పరిశ్రమలకు, చిన్న పరిశ్రమలకు నూలు మిల్లులకు, సిమెంటు, పంచదార ఫ్యాక్టరీలకు సహాయంచేయడానికి ఇవన్నీ ఉపయోగించకూడదని కేంద్ర ప్రభుత్వంవారు తాఖీదువేశారు. 3 సిమ్మెంటు ఫ్యాక్టరీలు, 4 నూలుబట్టల మిల్లులు, 5 పంచదార ఫ్యాక్టరీలు పెట్టినా మీరు వెనుకబడివున్నారు గనుక ఈ సిద్ధాంతాన్ని మాత్రం నేను అంగీకరించదలచుకోలేదు. కమ్యూనిటీ ప్రాజెక్టులు వెనుకబడిన ప్రాంతాలలో పెడతాము; వాళ్లు చేసుకోకపోతే వాళ్లదే-బాధ అంటారు.

[24th March 1956

THE HON. SRI K. VENKATA RAO :—చేసుకోగల్గినవారి దగ్గర ఇప్పటికి ఒక్కటికూడ పెట్టలేదు.

SRI P. SUNDARAYYA :—ఒక ఉదాహరణ చెప్పమంటారా ?

THE HON SRI K. VENKATA RAO :—చెప్పండి.

SRI P. SUNDARAYYA :—పెద్దాపురంలో పెట్టినారు.

THE HON. SRI K. VENKATA RAO .—పెద్దాపురం చేసుకోనగల్గిందా ? It is a worse place than Rayalaseema. ఆ తాలూకాలో 820 గ్రామాలున్నాయి.

SRI P. SUNDARAYYA :—అన్నీ సక్రమంగానే ఉన్నాయని మీరు అనుకోవచ్చుగాని సగం contribution ఇస్తేగాని వెనుకబడిన ప్రాంతాలలో ఒక్క కమ్యూనిటీ ప్రాజెక్టుకూడా పనిచేయడంలేదు. ఎంత పని జరుగుతున్నదో మాకు అనుభవంలో ఉన్నది.

మన ఆంధ్రరాష్ట్రంలోని చేనేత పరిశ్రమలను గురించి చాలా మంది మాట్లాడినారు. ఆంధ్రరాష్ట్రంలో 3 లక్షల మగ్గాలున్నాయి. మగ్గమునకు ఇద్దరు చొప్పున దానిమీద 6 లక్షలమంది జీవిస్తున్నారు. వీరికి సంవత్సరంపొడుగునా పూర్తిగా పనికావాలి. 15 బేళ్ల నూలు కావాలని administration report లో వ్రాశారు. ఇప్పుడు మన ఆంధ్రరాష్ట్రంలో మిల్లులమీద 1850 వేల బేళ్లు మాత్రం తయారవుతున్నది. అంటే దాదాపు మరొక 8 బేళ్లు మన ఆంధ్ర రాష్ట్రములో తయారు కావాలి. మరొక 28 నూలు మిల్లులు మన ఆంధ్రరాష్ట్రంలో కావాలి. పెద్ద మిల్లులైతే 15, 20 కావలసి వస్తుంది. ఇన్ని మిల్లులు మన రాష్ట్రంలో లేకపోయినట్లయితే చేనేత పారిశ్రామికులకు కావలసిన నూలు సరఫరా చేయుటకు వీలుండదు. దానికోసం రెండవ పంచవర్ష ప్రణాళికలో 4 మిల్లులు మాత్రమే ఏర్పాటు చేస్తున్నామంటే ఏమి ప్రయోజనం ?

THE HON. SRI K. VENKATA RAO:—అసలు ధరఖాస్తులేదు. ఒక్కటి కూడా reject చేయలేదు

SRI P. SUNDARAYYA :—వారు దరఖాస్తు పెట్టనిమాట నిజమే. డబ్బులేదు కదా. అసలు డబ్బు వసూలు చేయడానికి మార్గం చెపుతాను. రూపాయి [illegible] ఇస్తున్న సంగతి ప్రభుత్వానికి తెలుసు వారి అందరిదగ్గర డబ్బుతీసు [illegible]డానికి ప్రభుత్వం ఎందుకు పూనుకోవటేదు? అటువంటి చర్యలు మీరు తీసు

24th March 1956] [Sri P. Sundarayya

కున్నప్పుడు మేముగాని, మా పార్టీవారుగాని మిమ్ములను వ్యతిరేకించినామా ? యీ ఒక్క విషయం చెప్పండి

ఖనిజాలను గురించి పరిశోధన చేస్తున్నామన్నారు. కాని సరిగా పరిశోధన చేయడంలేదు కనుక కొంతమంది 94 వేల రూపాయలు ఖర్చుపెట్టుకుని బొగ్గును గురించి పరిశోధనచేయవలసిన పరిస్థితి యేర్పడుతున్నది. వారికున్న పెద్ద పెద్ద ఖనిజములను చూచుకొన్న తరువాత ఆంధ్రరాష్ట్రమీద వారి దృష్టి ఎప్పుడు పడుతుందో, ఎప్పుడువచ్చి మన ఖనిజాలను పరిశోధన చేస్తారో తెలియదు.

మనకు విద్యుచ్ఛక్తి ఉన్నది బొగ్గులేదు ఉన్నదానిని ఏమి అభివృద్ధిచేశారు ? మన రాష్ట్రంలో శ్రీశైల ప్రాజెక్టు మున్నగువాటికి 40 కోట్ల రూపాయలు కావాలన్నారు. దీనికి 21 కోట్లు ఇవ్వడానికి అంగీకరించారు. ఏ విధముగా ఖర్చు పెడుతున్నారు. Revised Draft లో చూస్తే మాచ్‌ఖండ్ ప్రాజెక్టు పూర్తిచేస్తామన తుంగభద్ర ప్రాజెక్టు పూర్తిచేస్తామని, తుంగభద్ర నెల్లూరు కాలవలను link up చేస్తామనిఉన్నది. వీటన్నిటినుంచి విద్యుచ్ఛక్తి తయారవుతుంది, విద్యుచ్ఛక్తి వచ్చినంతమాత్రాన సంతోషిస్తే ఏమి లాభం ? దానిని సద్వినియోగంచేసుకొనుటకు మార్గములుకావాలి. అందుచేత కొన్ని lines వేయాలి. కొన్ని గ్రామాలకు, పట్నములకు links వేయడానికి 7 కోట్ల రూపాయలు సరిపోతాయి. శ్రీశైల ప్రాజెక్టుకు 50 లక్షలు రూపాయలు మాత్రమే కేటాయించినారు. ఈ 50 లక్షలు ఖర్చుపెడితే ఎవరు సంతోష పడతారు ? ప్రభుత్వం ఎవరిని సంతృప్తి పరచగలదు ?

ఈ 5 సంవత్సరాలలోపులో ఇదివరకు ఉన్న ప్రాజెక్టులను పూర్తిచేసుకోలేక పోతే ఈ శ్రీశైలప్రాజెక్టునుమాత్రం ఏమి చేయగలము ?

THE HON. SRI K. VENKATA RAO.—శ్రీశైలప్రాజెక్టు కడతారనా మీ అభిప్రాయం ?

SRI P. SUNDARAYYA :—కడతామని ప్రణాళికలో వేయడము ఎందుకు ? కట్టకపోవడమెందుకు ? ఈ 50 లక్షలు దేనికైనా వినియోగిస్తే బాగుంటుంది. మనం గతసంవత్సరం 7 కోట్లరూపాయలు ఖర్చుపెట్టినాము. ఈ సంవత్సరం 670 లక్షలు మాత్రమే ఖర్చుపెట్టుతున్నాము. కేంద్రప్రభుత్వంవారు ఇచ్చిన లెక్కల ప్రకారం మనం 4 కోట్లుమాత్రమే ఖర్చుపెట్టడానికి వీలుంటుంది. 2 వ పంచవర్ష ప్రణాళికలో ఇది అభివృద్ధి అనుకోవాలా ?

Sri P. Sundarayya] [24th March 1956

మొదటి పంచవర్ష ప్రణాళికలోని చివరి 3 సంవత్సరాలు 7 కోట్ల రూపాయలు ఖర్చుపెడుతూవచ్చి, ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక మనదేశాన్ని అభివృద్ధిలోనికి తీసుకు పోతుందని వారు ఆనందంతో ఉంటే మనరాష్ట్రంలోమాత్రం విద్యుచ్ఛక్తికి 7 కోట్లు ఖర్చుపెడుతున్నారు. 4 కోట్లకన్నా ఎక్కువ ఖర్చుచేయడానికి వీలులేని ప్రణాళిక ఎవరిని సంతోషపెట్టగలదు ?

THE HON. SRI K. VENKATA RAO:—5 కోట్లనుంచి 20 కోట్లలోనికి తీసుకువెళుతున్నాము. దానిని అనుభవించేవారు సంతోషిస్తారు.

SRI P. SUNDARAYYA :—దానిని ఉపయోగించుకునేవారు సంతోషిస్తారనే సంగతికి నేను ఒప్పుకుంటాను.

పరిశ్రమలు లేకపోతేపోనీ వ్యవసాయమునకు irrigation స్కీములను అమలు పరిచారా అంటే అవీ తృప్తిగాలేవు. "మాకు పరిశ్రమలు, గుడ్డలు, ఇతర సౌకర్యములు లేకపోతేపోనీ పంటలు పండించుకునేందుకు నీరైనా సరఫరాచేయించండి మాకుకావలసినపంటలు పండించుకొని కడుపునిండా అన్నమయినా తింటాము" అని రైతులు గోలపెడుతున్నారు. ఈ Irrigation పద్దుఖర్చు 66 కోట్లనుంచి 34 కోట్లవరకు తగ్గింది ఇది మళ్ళీ 32 కోట్లకు తగ్గినట్లుగా తెలియుచున్నది సంవత్సరానికి 7 కోట్లరూపాయలు పెట్టుబడిక్రింద ఖర్చుపెడుతారు నందికొండ ప్రాజెక్టుకు మొదటిదశ పూర్తి అవడానికి మొదటి 5 ఏండ్లలోపల 35 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలి. ఇప్పుడు 6½ కోట్లు చొప్పున ఖర్చుపెట్టినాకూడ మనం నందికొండప్రాజెక్టును పూర్తిచేసుకోలేము. తుంగభద్ర ఎగువకాలువ, వంశధారసంగతి ఏమౌతుంది ? కేంద్రప్రభుత్వం మళ్ళీ వంశధార గురించి ఆలోచించి డబ్బు కేటాయించగలదు, కాని revised draft లో కూడ 4 వ సంవత్సరం పని ఆరంభిస్తారు. (4, 5) ఈ రెండు సంవత్సరములకు కలిసి ఒకకోటి రూపాయలు మాత్రమే ఖర్చుపెడుతున్నామని రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్రాసిఉన్నది. 13 కోట్ల రూపాయల విలువగల ప్రాజెక్టుకు 1954-55 సం॥ లో ఒకకోటి రూపాయలు ఖర్చుపెట్టినట్లయితే ఆ ప్రాజెక్టును నిర్వహించడం లాభకరమా ? మరోవైపున 5 ఏండ్లలో ప్రథమదశ పూర్తికావలసిన ప్రాజెక్టులను 15 ఏండ్లవరకు పొడిగించి 4, 5 ఏండ్లలో పూర్తి కావలసిన వంశధార, తుంగభద్ర ఎగువకాల్వను 10, 15 సం॥ లకు వాయిదావేసినట్లయితే ఈలోపులో వడ్డీ కట్టుకోవాలి. ఆ వడ్డీ ప్రతి సంవత్సరమూ కట్టుకోవాలి. [illegible] ఈ సంవత్సరం కట్టుకొనే స్థితిలో లేరు కాబట్టి రెవిన్యూ ఖాతా లోటుగా [illegible] మీకు అప్పు [illegible] మాట ఆలోచిస్తామంటున్నారు.

ఒకప్రక్కన అనవసరంగా ప్రాజెక్టులను 10, 15 ఏండ్లు పొడిగించుకొనేటట్లుచేసి రెండోప్రక్కన వడ్డీ కట్టుకోవాలి అంటున్నారు. రెవెన్యూ ఖాతాలోటువున్నది కాబట్టి అప్పులు ఎట్లాతీర్చి పెట్టుబడి ఎట్లా పెట్టాలి ? అనే రకంగా మాట్లాడడం న్యాయంకాదు. వ్యవసాయాభివృద్ధినిగూర్చి, పరిశ్రమాభివృద్ధిని గురించి మాట్లాడుతున్నారు. రెండు విషయాలుకూడా ప్రధానమైనవే. వ్యవసాయ అభివృద్ధికి భూసంస్కరణలు అవసరమని కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వము రెండుకూడా ఆచరణలలో చేయకపోయినా మాటలలో అంగీకరించడం జరుగుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళికలో భూకమతాలకు ceilings పెట్టాలి, కౌలుశేట్లు తగ్గించాలి అని వున్నది. కౌలుదార్లను తొలగించకుండుటకు తగిన చట్టాలను చేయాలని మొదట పంచవర్ష ప్రణాళికలోను, దానినే మరింత వివరంగా రెండవ పంచవర్ష ప్రణాళికలోను చెప్పినమాటనిజమే. ఇందుకుగాను మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో మన ప్రభుత్వము తగిన చర్యలు తీసుకోలేదు. "మేము అధికారానికి వచ్చి ఒక సంవత్సరమే అయినది. అంతకు ముందు మద్రాసులో జరిగినదానికి మేము బాధ్యులముకాము. రాష్ట్రం వచ్చిన దగ్గరనుంచి దానితో కుస్తీలుపట్టడంతో సరిపోయింది. వాగ్దానాలు మాత్రం కొన్ని చేశాము గాని పని ఎట్లా త్వరగా చేయగలమని" అంటున్నారు. మా pressures వల్లనే శాసనసభ అంతా వెనుకకుపోవలసిన పరిస్థితి వచ్చిందని కూడా అంటున్నారు. మా pressure సంగతికాదు. కేంద్రప్రభుత్వము ప్రపంచమంతా గొప్పగా చెప్పుకునేటటువంటి కాంగ్రెసునాయకులు సంవత్సరంనుంచి land reforms ను అమలు జరుపుతున్నారా ? అని అడుగుతున్నాను. ఈరోజు వ్యవసాయ అభివృద్ధిగురించి చెప్పినదాంట్లో కొన్నికొన్ని సూచనలు బాగానే వున్నాయి. స్వంతవ్యవసాయము చేసుకోవాలి అంటున్నారు. స్వంతవ్యవసాయము అంటే ఏమిటో ముందు నిర్వచించుకోవాలి, ఇద్దరుకలిసి ఉమ్మడిగా వ్యవసాయముచేసి వచ్చిననష్టాన్నిగాని, లాభాన్నిగాని ఇద్దరుచెరి సగము భరించే పద్ధతి కాకుండా అన్నివిధాల వ్యవసాయములో ఏనష్టమువచ్చినా పెట్టుబడి కావలసివచ్చినా ఒక్కరే స్వంతవ్యవసాయంలో భరించాలనేటటువంటిదే మొదటి point రెండవది, దగ్గరలోవుండి దానిని తనిఖీచేస్తూ వుండాలి. స్వంత వ్యవసాయదారుడు గాని, ఆయన కుటుంబంలోని మనిషిగాని ఆ గ్రామాలలోనేవుండి తనిఖీచేస్తూవుంటే అది స్వంతవ్యవసాయంక్రిందికి వస్తుంది. లేకపోతే లేదు. స్వంత వ్యవసాయం అంటే గట్టుమీద కూర్చుని కఱ్ఱపెత్తనం చెయ్యటంగాదు. వ్యవసాయదారుడు అనే అతడు ముఖ్యమైన వ్యవసాయపను లన్నిటిలోకూడా స్వంతంగా కష్టపడి పనిచేయాలి. అట్లు చేసినప్పుడే అది స్వంతవ్యయసాయం అవుతుందిగాని

Sri P. Sundarayya] [24th March 195

లేకపోతే కాదు. Ceiling పెట్టి అదనపుభూమి తీసుకోవేదానికి ఈనిర్వచనం పనికివస్తుందాలేదా అనేది అట్లా ఉంచి, భూమి తనకు కావాలని స్వంతంగా చేసుకునేందుకుగాను కౌలుదారును తొలగించడానికి పూనుకొన్నప్పుడు స్వంతంగా పొలంలో దిగి పనిచేస్తున్నాడా లేదా అనేది గీటురాయిగా పెట్టుకోవాలని రెండవ పంచవర్ష ప్రణాళికలో చెప్తున్నారు రాష్ట్రప్రభుత్వం దానిని ఎంతవరకు అంగీకరిస్తారో తెలియదు. భూసంస్కరణలయొక్క నిర్దుష్టస్వరూపం ఏమిటో ఇంత వరకు తెలియలేదు. ఏరాష్ట్రప్రభుత్వంకూడా ఇంతవరకు స్వంతవ్యవసాయానికి నిర్వచనం ఇవ్వలేదు. ఇచ్చినప్పుడే నిజమైన భూసంస్కరణలు రాగలవు. కౌలుదారును తొలగించాలన్నప్పుడు కౌలుదారుదగ్గరనుంచి భూమితీసుకొని తాను స్వయంగా కష్టపడి వ్యవసాయం చేస్తారా అని అడుగుతున్నాను. మన ఆంధ్ర రాష్ట్రంలో ఇంతవరకు రాజకీయ బాధితులైన లేక ఇతరులైనా సరే కౌలుదార్ల దగ్గరనుంచి భూమిని తీసుకుని, భూమిని కౌలుకు ఇవ్వకుండా తాను పొలంలో వుండి పనిచేస్తున్నారా అంటే లేదు. ఎక్కడో 50, 60 మైళ్లదూరంలో వుండి భూములను తమబంధువులచేతనో, ఎవరిచేతనో సాగుచేయించుకొంటు లెక్కలతో వ్రాసేవాళ్లకు భూమిని ఇవ్వడం ఏరీతిగాను న్యాయంగాదు. ఇది భూసంస్కరణలు అమలు జరిపేందుకు మార్గమేనా అని అడుగుతున్నాను. ఏచట్టము తెచ్చినా, ఏచట్టము తేకపోయినా కౌలుదారులహక్కులను రక్షించడానికి చట్టాన్ని త్వరలోనే తీసుకువస్తామని కళా వెంకటరావుగారు చెప్పారు. ఆంధ్రరాష్ట్రంలో 1950వ సంవత్సరంలో జనాభా లెక్కలనుబట్టిగాని, agricultural wage enquiry statistics నుబట్టిగానిచూస్తే 100 కి 70 మందికన్న ఎక్కువ కౌలుదార్లు గ్రామంలోలేరు. వ్యవసాయకూలీలు 100 కి 80 మందిపైన వున్నారు. తూర్పుగోదావరి జిల్లా అమలాపురం రాజోలు ప్రాంతాలలో 100 కి 16 మంది చొప్పున కౌలుదార్లు ఉన్నారు. కొన్ని జిల్లాలలో 100 కి 5, 6 మందిమాత్రమే వున్నారు. కౌలుదార్లచట్టాన్ని తీసుకురండి కౌలుదారురేటు తగ్గించాలిగాని, 5 వంతుకుమించి ఏపరిస్థితులలోను తీసుకోకూడదని ఒకవాదన ఉంది. అయిదింటనాలుగు వంతులుకూడా కౌలుదార్లు తీసుకొంటున్నసంగతికూడా మనకు తెలుసు. అందుచేత సగంతగ్గించినప్పటికి మెరుగ్గానేఉంటుంది. చట్టముతెస్తేతేవచ్చు. ఇదివరకే ఇతరరాష్ట్రాలలో అనేక చట్టాలువచ్చినాయి. మీరు చట్టాలు తెచ్చేలోపలనే భూస్వాములు కౌలుదార్లను తొలగించి భూమినిస్వాధీనంచేసుకొంటారు ప్రభుత్వం కౌలుదార్లను రక్షించడానికి చట్టం తెచ్చేటప్పటికి కౌలుదారనేవాడేవుండడు. ఎందువల్లనంటే ఆంధ్రరాష్ట్రంలో రిజిష్టరు కౌలు అనేది నాకు తెలిసినంతవరకు లేదు. 8 ఏండ్లు, 5 ఏండ్లు, 10 ఏండ్లు [illegible] న్నప్పటికి కౌలుదార్లనని రుజువుచేసుకునే అవకాశం వెయ్యిమందిలో

24th March 1956] [Sri P. Sundarayya

ఒక్కనికైనా ఉన్నదో లేదో సందేహమే. ఇటువంటి పరిస్థితులలో కౌలుదార్ల చట్టాన్ని ఏరీతిగా అమలు జరుపుతారు? మీరు అమలుపరచగలరనే నమ్మకం మాకు లేదు. Debt Relief Act ను మొట్టమొదట మద్రాసురాష్ట్రంలో తీసుకువచ్చారు. రూ. 0-8-0 కన్న ఎక్కువ వడ్డీ తీసుకుంటే శిక్షార్హులని కూడా అన్నారు. ఆచరణలో 1 రూ॥కి అణావొప్పున వడ్డీ తీసుకుంటున్నారన్న సంగతి అందరికి తెలిసినదే. Pro-note మీద అర్ధరూపాయని మాత్రమే ఉంటుంది. 0-12-0, 1రూ 1½ కూడా తీసుకోవడం గ్రామాలలో సహజంగా జరుగుతూనే ఉంటుంది. కౌలుదార్ల చట్టాన్ని అమలులోకి తీసుకురావాలంటే వ్యవసాయకూలీలయొక్క కనీసవేతనాల చట్టాన్ని కూడా అమలుపరచవలసి ఉంది. దీనిని ఇదివరకు 14 గ్రామాలలో వర్తింపచేశారు. 14 గ్రామాలలో ఒకటి నెల్లూరుజిల్లాలో ఉన్నదని అన్నారు. ఆ గ్రామాల పేర్లేమిటో గోపాలరెడ్డిగారికి కూడా తెలియదు. కనీస వేతనాలచట్టాన్ని సక్రమంగా అమలుజరపవలెనంటె అందుకు ప్రాతిపదికగా కౌలుదార్లకు రక్షణ కలిగించవలసి ఉన్నది. రైతుకు తనభూమిపైన తనవృత్తిపైన శ్రద్ధకలుగవలెనంటె తాను సాగుచేసుకొనుచున్న భూమినుంచి ఎవరును తొలగించజాలరనే ధైర్యమును అతనికి కలుగజేయవలసియున్నది. అందుకుగాను రైతురక్షణ చట్టమును వెంటనే తీసుకొనిరావాలి అందువల్ల అన్నిసమస్యల పరిష్కారమునకు కీలకము భూమి పంపకము భూమి లేనివారికి కొస్తోకూస్తో భూమి ఇచ్చి అతనిదగ్గర భూమి ఉండేటట్లు చర్యలుతీసుకొన్నప్పుడు అది సాధ్యమాతుంది. Right of resumption అని ఉన్నది. ఇప్పుడున్న పట్టాదారులు భూములు కౌలుకు ఇచ్చినాగాని 16.0 రు॥ల ఆదాయంవస్తే అది కుటుంబక్షేత్రమని, 5 గురు గల కుటుంబముండేదానికి 3 రెట్లు దాకా ఉంచుకోవచ్చునని ఉన్నది.

అదేరీతిగా అయిదుగురుకన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఆరు కుటుంబ క్షేత్రాలవరకు ఉంచుకోవచ్చును. అంతకుమించి ఏ పరిస్థితులలోను ఉంచుకోకూడదన్నారు. మన ప్రభుత్వము agrarian reforms report వచ్చింది, చదువుతాము, ప్రకటిస్తాము అని అంటున్నారు. దానిప్రకారం లెక్కవేస్తే, ఈ ఆరు కుటుంబక్షేత్రాలు, లేక అయిదుగురు ఉంటె మూడు కుటుంబక్షేత్రాలు ఉండిన, అది ceiling అవుతుంది. 16 వందలు మొత్తము ఆదాయము, లేక నికర ఆదాయము 12 వందలు వస్తుందని చెప్పాము. అంటె అతడే కష్టపడి స్వంతంగా పనిచేసినప్పుడు ఇంత ఆదాయము వస్తుందన్నమాట. మొత్తం ఆదాయము ఎకరానికి 16 వందలని తీసుకొందాము ఈరోజున బస్తా ధాన్యం 23 రూపాయలకు అమ్మబడుతూ ఉంది. డెల్టాప్రాంతాలలో ఎకరానికి సగటున 15 బస్తాలు పండుతుంది. కాబట్టి, 5 ఎకరాలకు ఒక కుటుంబక్షేత్రము అయితే

Sri P. Sundarayya] [24th March 1956

3 కుటుంబక్షేత్రాలకు 15 ఎకరాలు అవుతుంది. పోనీ కుటుంబము పెద్దది అయితే, 30 ఎకరాలకు మించి మాగాణి ఎవరికి ఉంచకూడదు. అయిదుగురు ఉన్నట్లయితే, 15 ఎకరాలకన్నా ఎక్కువ ఉంచకూడదు. దానికి మించినదంతా కూడ బీదవారికి భూములు లేనివారికి ఇవ్వవలసింది అనేది గనుక ఈ ప్రభుత్వము అంగీకరించి అమలు జరిపితే, ప్రజలలో కావలసిన ఉత్సాహము వస్తుంది. మాయొక్క సంపూర్ణ సహకారము లభిస్తుంది. ఎవరూ దానినుంచి తప్పించుకొనిపోవడానికి వీలులేకుండా, Binami transfers చేయకుండా, ఖచ్చితముగా దీనిని అమలుజరిపేదానికోసం, మీ పోలీసులకన్నా, మీ ఉద్యోగస్థులకన్నా రాత్రింబగళ్లు అదేపనిగా పనిచేస్తామని మీకు హామి ఇస్తున్నాము. మీ సహాయం కావాలి, మీరు సహకరించడంలేదు అని ఎప్పుడూ మీరు మమ్ములను విమర్శిస్తూఉంటారు. కాని నేను చెప్పినపని చేయండి. దీనికోసం మేము ఏరీతిగా పనిచేస్తామో అవి ఆచరణలో చూడవచ్చు. కాని ఈ విధానాన్ని అమలుజరిపేటప్పుడు కొన్ని మినహాయింపులను ఆధారముచేసుకొని, రాష్ట్రప్రభుత్వము తప్పించుకోవచ్చు. కుటుంబక్షేత్రాలు అన్నారు. అది బాగానే ఉన్నది. కాని దీనికి కొన్ని మినహాయింపులు మీరు చేయవచ్చు. ఉదాహరణకు, తోటభూములైతే పంచేదానికి వీలులేదు అనవచ్చు. Plantations విషయ మేమిటి అంటున్నారు. మన ఆంధ్రరాష్ట్రములో plantations చెప్పుకోవలసినంతగా లేవు. Casuarina ను plantation అని కేంద్రప్రభుత్వము నిర్వచించలేదు. అయితే మన ఆంధ్రప్రభుత్వము దాన్నికూడ plantation క్రింద తీసుకొంటుందేమో, ఎందువల్లనంటే, ఈ మధ్యనే నెల్లూరుజిల్లాలో కొన్ని సంఘటనలు జరిగాయి వ్యవసాయకూలీలు casuarina వేసుకొన్నటువంటి దానిని ఎవరో భూస్వాములు వస్తే అతని క్షేత్రముక్రిందనే దానిని ఇచ్చినట్లుగా అక్కడ ఎక్కువగా చెప్పుకొంటున్నారు. అటువంటి casuarina ఎక్కడైనా పంపకానికి వస్తుందనుకొని దాన్నికూడ plantation అన్నప్పుడు, Rice మాత్రము plantation ఎందుకు కాకూడదు? ఇంకా పశువులకు పెంచేదానికి కావలసినటువంటి dairy farms ఉంటే వాటిని మినహాయించవచ్చు. ఇంతేకాకుండా, చాలా చక్కగా యంత్రాలు పెట్టి బాగా పండిస్తున్నటువంటి క్షేత్రాలు ఉన్నట్లయితే వాళ్లకు ఇవ్వవచ్చును. ఈ రోజు చక్కెరకోసం, చెరుకువేస్తున్నారు. 3 వేల ఎకరాల, 4 వేల ఎకరాలు, co-operative farms క్రింద ఇది చేస్తున్నారు. (Interruption) Plan లో ఉన్నటువంటి లోపాలు తెలియజేస్తున్నాను. ఏదో ఉత్పత్తి పడిపోతుందనే [illegible]తో ఇవన్నీ చాలా చక్కగా నడుస్తున్నామని, వీటికి ceiling పెట్ట నక్కర [illegible] మినహాయింపు ఇచ్చారు. ఈ విధముగా ప్రతి రాష్ట్ర ప్రభుత్వముకూడా [illegible] ఆధారము చేసుకొని పోతుంది. ఇటువంటి మినహాయింపులు

ఇవ్వడం సరికాదు. ఈ రోజు వ్యవసాయ కూలీలయొక్క, బీద రైతాంగముయొక్క సమస్య పరిష్కరించి వాళ్లకు భూమి పంచాలి అన్నట్లయితే, మినహాయింపులుచెస్తే, ఆ పనికాదు. ఈ సుక్షేత్రాల నేటటువంటివి ఇప్పుడు తాత్కాలికంగా అధికంగా పండినా, మొత్తానికి బీద ప్రజానీకానికి భూమి వచ్చినప్పుడు, వారు పండించినంత ఇవి పండవు. అందుచేత ఇప్పుడు మినహాయింపులు లేకుండా భూములు పంచవలసి యుంటుంది. 15 ఎకరాలు, 20 ఎకరాలు, 30 ఎకరాలు ఉండవచ్చునని ఏదో పరిమితి పెట్టారు. అది వదలి మిగిలినటువంటిది అంతా పంచి పెట్టాలని నేను చెప్పుచున్నాను. ఆంధ్ర ప్రభుత్వము ఇంతవరకు ఏమిచేస్తున్నది ? ఇనాం బిల్లు గురించి కాలయాపన జరుగుతున్నది.

Sri P. GUNNAYYA .—అధ్యక్షా, మన రాష్ట్రములో రాత్రిపూట చదువు చెప్పేటటువంటి Teacher కు Night School Grants ఇస్తున్నారా. ఈ సమావేశము రాత్రికూడ జరుగుతూఉన్నది కాబట్టి దీంట్లో పాల్గొంటున్న సభ్యులకు అదనంగా allowances ఏమైనా ఇవ్వడానికి ఏర్పాటు చేస్తారా, ముఖ్య మంత్రి గారు ? పోనీ ఇక్కడవున్న పోలీసులకు, అసెంబ్లీ ఆఫీసులోని ఉద్యోగస్థులకైనా కొంత allowance ఇవ్వడానికి ఏర్పాటు చేస్తారా ?

Mr. SPEAKER :—ప్రభుత్వము అదంతా ఆలోచిస్తారు.

Sri P. SUNDARAYYA :— జాతీయాదాయము నూటికి 25 పాళ్లు పెరగాలన్నారు అంటే ప్రజలకు వెను వెంటనే కొన్ని లాభాలుకలగాలి. ఇప్పుడు కళా వెంకటరావుగారు మనిషికి నాలుగణాలు సంపాదిస్తే, దాంట్లో ఒక కాణీగాని, ఒక దమ్మిడీగాని, ప్రణాళికకు పెట్టాలని చెప్పుతున్నారు. నిజమే ఒప్పుకొంటున్నాను కాని అంతకుముందేమి లేకుండా, ఇప్పుడు నాలుగణాలు సంపాదించుకొంటె, దానిలోనుంచి ఒక దమ్మిడీ అయినా ఇవ్వమని అడిగేదానికి ముందు, వందలు, వేలు, లక్షలు సంపాదించుకొనేవాళ్ల దగ్గర నుంచి రాబట్టుకొంటె అప్పుడు బీదవారు అణా ఇచ్చినా, ఇవ్వకపోయినా, దేవుడిచ్చిన చేతులు, కాళ్లతో మునపటికన్నా ఎక్కువ కష్టపడి పనిచేస్తారని చెప్పవచ్చు. కాని కడుపులో కాస్తా లేకపోతే, దేవుడిచ్చిన కాళ్లు చేతులు కూడ పనిచేయలేవు. కడుపు మాడుతూ ఉంటే ప్రేగులన్నీ గడగడలాడు తూంటే, పారతీసుకొని వేస్తే భూమి తెగదు, గునపము తీసుకొని పొడిస్తే భూమి తెగదు. చేతిలో సత్తువ లేకపోతే అంత ఉత్సాహంతో పనిచేయలేరు. అందుచేత వారికి ఒకపూట, రెండుపూటలు కడుపునిండా పెట్టండి. ఆవిధంగా చేసినట్లయితే వారు మునపటికన్నా ఎక్కువ పనిచేసేదానికి అభ్యంతరం లేకుండా చేస్తారు. కడుపునిండా తిండి పెట్టినప్పుడు, పనిచేసేందుకు ముందుకన్నా ఎక్కువ ఉత్సాహం

[24th March 1956

గానే ఉంటాడు. కనుక ఆ రకంగా చేయాలని కోరుతున్నాను. ఈరోజు ఆహార సమస్య తీసుకొన్నప్పుడు, ఇది మనదేశములో మునపటికన్నా కొంచెము మెరుగ్గా ఉన్నదనేమాట ఎవరు కాదనరు. 1950 వ సంవత్సరముకన్నా 1955 లో ఆహార వస్తువుల ఉత్పత్తికూడ కొస్త పెరిగింది. అది నేను కాదనను. కాని ఈ ప్రణాళికలో ఆహార ధాన్యాలు, అంటే వరి కానివ్వండి, పప్పు ధాన్యం కానివ్వండి, రెండు కలిపి చూచుకొన్నప్పుడు, 7 కోట్ల, 7 లక్షల టన్నులు మాత్రమే తయారు చేసే విధముగా ఉన్నది. 1961 వ సంవత్సరంలో మనదేశంలో 40 కోట్ల జనాభా ఉంటుంది. ఈ 40 కోట్ల జనాభాకు 7 కోట్ల 7 లక్షలు టన్నుల ఆహార ధాన్యం ఇచ్చినట్లయితే, ఒక్కొక్కరికి ఎంత వస్తుందో లెక్కవేసి చూచినట్లయితే, 18½ ఔన్సులకన్నా ఎక్కువరాదు. కళా వెంకటరావుగారు, పుష్టికరమైన ఆహారం Nourshing Diet తీసుకోవలెనని చెప్పుతున్నారు. అందుకని, పాలు, మాంసము చేపలు, గ్రుడ్లు ఇవన్నీ తీసుకోవలసివుంటుంది. కాని, ఇవన్నీ మీరు ఇవ్వనక్కరలేదు. పాలువద్దు, గుడ్లువద్దు, మాంసము వద్దు, కడకునూనె, చక్కెరకూడ ఇవ్వకపోయినా నాకు అభ్యంతరంలేదు. రెండుపూటలు కస్త బియ్యము, పప్పు, దానికి కావలసిన ఉప్పు కారము ఇస్తేచాలు. ఈ list ప్రకారం, 14 ఔన్సుల బియ్యం, 3 ఔన్సుల పప్పు దినుసులనుంచి, పాలు, పెరుగు ఇవన్నీ కలుపుకొని 32 ఔన్సులవరకు ఇచ్చి నారు. ఇది 2600 క్యాలరీల ఉష్ణాన్ని ఇస్తుందన్నమాట. అంటే ఇది కష్టపడి పనిచేసే మనిషికికాదు. మామూలుగా సుఖంగా ఘారాడుతూ, మాట్లాడుతూ, లేక కలము పట్టుకొని వ్రాసుకొనే వారికి సరిపోయ్యేటటువంటిది. అనగా, ఎక్కువ భారీ పనులులేకుండా ఉంటే వారికి, వారు ఆరోగ్యంగా ఉండాలంటే, ఈ 2,600 క్యాలరీల ఉష్ణము కావలసియుంటుంది. ఇది వారి Subsistence కొరకు కావలసి యుంటుందన్నమాట.

మామూలుగా పనిచేసేవారి సంగతిచూస్తే మన భారతదేశములో 3,000 యూనిట్లు, 3,400 యూనిట్లు కావలసివున్నది. 3000 లసంగతి మాకు వద్దు. 2,6000 లేచాలు. మేము కష్టపడి పనిచేసేటప్పుడైనా యివ్వమని అంటున్నారు. అట్లైనా యివ్వమని మేము కోరుతున్నాము.

Mr. SPEAKER :—There are no two opinions in the [illegible] is the question now.

—

24th March 1956]

SRI P. SUNDARAYYA :—"How to produce" అనేదానికి, గూడ నేను మా అభిప్రాయమేమో చెబుతాను. ఇవి అన్నీ చెప్పకుండా, అవి ముందుచెబితే, మీసోదే మీరు చెబుతారు గాని, వేరేవిషయాలు చెప్పరేమి అని మీరే అంటారు. మేము యిన్నిసంగతులు చెబుతూకూడ యీ ప్రభుత్వాన్ని కేంద్ర ప్రభుత్వాన్ని మరొకసారి తీవ్రంగా ఆలోచించండి అని, యిద్దరినీకూడ కోరుతున్నాము.

ఆహారసమస్య విషయమువచ్చినప్పుడు అందరు పుష్టికరమైన ఆహారము తినండి, అని కళా వెంకటరావుగారు అన్నారు. పోనీ, పుష్టికరమైనతిండి పనిలేదు. రెండు పూటలు కడుపునిండా తినేపరిస్థితి మేము తెచ్చాము అనేది చూపించండి !

THE HON. SRI K. VENKATA RAO :—"కడుపునిండా" అని అన్నానా ? మునుపటికంటె ఎక్కువగా లభిస్తున్నది అని అన్నాను

SRI P. SUNDARAYYA :—మునుపటికంటె వృద్ధి అయింది అనే దానికి సంతోషించటానికి మనము తయారుకావాలి. (Interruption) అదికాదు. యిప్పుడు మనము చేతిలో ఏమి పెట్టుకున్నాము అంటె, 7 కోట్ల 50 లక్షలు పెట్టుకున్నాము. ఈ 7 కోట్ల 50 లక్షలు పెట్టుకుంటే, యిప్పుడు ఉండే చక్కెర, నెయ్యి, నూనె, అన్నీకూడ అందరికి సమానంగా పంచేటప్పటికి. ఒక్కొక్క మనిషికి 24 ఔన్సులకంటె ఎక్కువరావడములేదు. ఇందులో ఎక్కువ తినే వారు ఎక్కువ తింటారు. తక్కువ తిన్నవారు తక్కువతింటారు. కాని అందరికి సరిసమానంగా పంచాలని అంటే ఒక్కొక్కరికి 24 ఔన్సులకంటె ఎక్కువరాదు. ఆ ప్రకారము లెక్కచూస్తే, యింకా ఒక్కొక్క మనిషికి 8 ఔన్సులు లోటు అవుతున్నదన్నమాట. ఇక కాయకూరలు, పండ్లు సంగతి చెబితే, అది ఒక 16 ఔన్సులు యివ్వవలసి ఉన్నది. దాని సంగతి యిప్పుడువద్దు. ఊరకనే మిరపపొడి, ఉప్పుయిస్తేచాలు. అంతకంటె ఎక్కువ అవసరము లేదు. ఇప్పుడుమాత్రము 24 ఔన్సులుమాత్రమే యిస్తున్నారు. ఇది జైలు రేషనుకంటే తక్కువగాయున్నది అందువల్ల ప్రతివాడికి రోజు ఒకటింటికి 32 ఔన్సులు కావాల్సి ఉన్నప్పుడు, అది రాకుండా ప్రతిరోజు 8 ఔన్సులు లోటు ఉంటూవున్నది. దీని అర్థము, మనకు వున్న జనాభాలో నాలుగింట ఒకవంతు తిండి తక్కువ తింటూవున్నారన్నమాట. లేకపోతే మూడువంతుల జనాభా తినీ, తక్కినవారు పస్తుపడుకుంటున్నారని చెప్పక తప్పదు. ఈ సంగతి ప్రభుత్వము దృష్టిలో పెట్టుకున్నప్పుడు, మన ఆహారసమస్య మనము పరిష్కరించుకున్నాము అనిగాని, లేకపోతే మన ప్రజలకు కావలసిన కనీసపుతిండి మనము యిస్తున్నాము

Sri P. Sundarayya] [24th March 1956

అని చెప్పుకోటానికి, వీలులేదు ఆసంగతి ఆలోచించకుండా, ముందు తిండిలేకుండా యితరపనులు చేయడము సాధ్యముకాదు. దీన్ని ముందు తయారుచేయాలని అంటున్నాను. ఇప్పుడు చైనాదేశము సంగతిచూడండి. వాళ్లు ప్రతిసంవత్సరం 20 కోట్ల టన్నుల ధాన్యం పండిస్తున్నారు వారి జనాభా మన జనాభాకంటే నూటికి 50 వంతులు ఎక్కువ ఉన్నారు. కాని మొత్తముమీద చూస్తే, వాళ్లలో మనిషి ఒకటింటికి దినమునకు 36 ఔన్సులచొప్పున వస్తున్నది. అందుచేత మనప్రజలకు ఒకవైపున తిండిలేకుండాచేస్తూ, మరొకవైపు "మీరు అందరు ఉత్సాహంగా పని చేయండి" అని అంటే ఎట్లాచేస్తారు? ముందు తిండికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వవలసి ఉంటుంది అని నేను ప్రభుత్వందృష్టికి తెస్తున్నాను.

ఇక గుడ్డలసంగతి చూస్తే, మనిషికి 18 గజాలు వస్తున్నది అని అన్నారు 18 గజాలు యిస్తేచాలు, అందుకు సంతోషమేననుకోండి. కాని ప్రభుత్వము ఏమి చర్యతీసుకోబోతున్నది? "మీరు ఎక్కువగా గుడ్డలు తయారుచేయండి" అని అంటున్నారు. అయితే పరిశ్రమలనుంచి, ఆహారముక్రింద ఖర్చుచేసేదానినుంచి, అంతా తీసుకొనిపోయి కొత్తమిల్లులు పెట్టండిఅని మేము చెప్పడములేదు. పది గజముల గుడ్డకాదుగదా, గోచీలు అయినా పెట్టుకుని పనిచేయటానికి ఎవరికీగూడ అభ్యంతరము ఉండదు. (Interruption) ప్రతి మనిషికి కనీసము 18 గజాలు గుడ్డ వస్తున్నది అన్నారు. 18 గజాలు వచ్చేటట్లు లేదు. పది గజాలు వచ్చేటట్లుగా, అది గూడ అందరికి అందుబాటులో ఉండటానికి ప్రభుత్వం చర్య ఏమైనా తీసుకుంటున్నారా అంటే, అదేమి కనబడదు. ఈ ప్రణాళికలో లేదు. అందుచేత మేము 18 గజాలు చొప్పున తయారుచేస్తున్నామని, తిండి 18 ఔన్సుల చొప్పున పండిస్తున్నామని అనడంవల్ల లాభంలేదు. ఈ రోజున ధాన్యమునకు ధరలు పెరుగుతూ ఉన్నవి ఇప్పుడు బస్తా ఒకటింటికి 23 రూపాయలు ఉన్నది. గతసంవత్సరము రూపాయకు 8 శేర్లచొప్పున అమ్మింది. ఇప్పుడు ఇంకా పెరిగే సూచనలు కనబడుతున్నవి. ఇప్పటికికప్పుడే చౌక డిపోలు పెట్టమని ప్రజలు కేకలు వేస్తున్నారు. (Interruption) కాబట్టి production ఎక్కువ చేయడమనేది ఒకటి, పేద ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు తిండిసరిపోయేటట్లు చేయడమనేది ఒకటి, యీ సమస్యలు ఉంటున్నవి. ఇక విద్యావిధానమునకు పోదాము.

విద్యాశాఖను చూస్తే, మన ఆంధ్రదేశమున కంతటికీ కేటాయించిన సొమ్ము అయిదు సంవత్సరాలకూ చేర్చి 7½ కోట్లుఅంతే, సంవత్సరానికి 1½ కోట్లు అన్నమాట. ప్రాథమిక ఉపాధ్యాయులు కానివ్వండి, యింకా హైస్కూల్సులో చిన్న

తరగతులకు చదువుచెప్పే ఉపాధ్యాయులు కానివ్వండి, మొత్తముమీద అందరూ చేరి సుమారు అరవైవేలదాకా ఉన్నారు. వీరుఅందరు సెకండరీ ట్రైనింగు అయిన వారే Government of India యొక్క విద్యాశాఖ మంత్రిగారు చెప్పిన స్కేలు ప్రకారము అయితే వీరందరికీ 9 కోట్ల రూపాయలు కావల్సి ఉంటుంది. ఈ ప్రభుత్వము ప్రకటించిన స్కేలు ప్రకారముయిస్తే, ఒక్కొక్కరికి నెలకు 20 రూపాయలు చొప్పున యిస్తే, అదికూడ వారి సర్వీసునుబట్టి, కేటాయిస్తే, యీ 60 వేలమందికి రెండు పూటలు తిండితిని సుఖముగా ఉండటానికి 1½ కోటి రూపాయలు చాలవు. కేంద్రప్రభుత్వము వారి స్కేలు ప్రకారము అయితే సంవత్సరానికి 9 కోట్లు కావాలి. ఆ విధంగా చూస్తే, యిక కొత్తగా టీచర్లను వేసుకోటానికి అవకాశములు ఉన్నవా? ప్రభుత్వాన్ని అడిగితే, "మీరు డబ్బు తెచ్చుకొండి, వారు పెట్టుబడి పెట్టుతామని అంటున్నారుగదా! ఇప్పటికే అయిదుకోట్ల విద్యకోసము ఖర్చు చేస్తున్నాము ఇంకా కొత్త స్కూళ్లు పెట్టాలంటే, జీతాలు పెంచాలంటే, యింకా నాలుగు కోట్లు కావాలిగదా! ఆ డబ్బు మీరు తెచ్చుకోకపోతే, కేంద్ర ప్రభుత్వము ఎట్లా యిస్తుంది?" అని అంటున్నారు. ప్రతిసారికూడ యీ విధముగా మీరు డబ్బు వసూలు చేసుకోవడములేదు కాబట్టి మేము డబ్బు యివ్వము అంటే, మనము యీ విద్య విషయములో యిదివరకు ఎక్కడ ఉన్నామో, యికముందు అయినా అక్కడనే ఉండే పరిస్థితి వస్తున్నదన్నమాట అంతకంటే వేరే కనబడదు. తరువాత కేంద్ర ప్రభుత్వమువారు targets ఎంతవరకు పెట్టారోగాని, ఆ వివరాలలోనికి నేనుఇప్పుడు పోదలచలేదు. ఆ విషయాలకిపై నేను ఎన్నోసార్లు మాట్లాడాను. లెక్కలు వేసిచూచి, యింకా 1960వ సంవత్సరము దాకా ప్రైమరీ పాఠశాలలు అన్ని వోట్లవుండవని అంటున్నారు. అంటే కేంద్ర ప్రభుత్వము చేసిన సూచన యీ రోజున అమలులో లేదు. ప్రాథమిక స్కూల్సులో విద్యార్థుల వయస్సు యింత ఉండాలి అని గీటురాయి పెట్టారు. అయిదవ తరగతి పూర్తి చేయనిదే, ఏ విద్యార్థికిగూడ అక్షర జ్ఞానము ఉండదు, అని ప్రభుత్వం యొక్క రిపోర్టులలో పదేపదే చెబుతున్నారు. ఈ రీతిగా చూచినాకూడ ప్రాథమిక పాఠశాలలో, మొదటి సంవత్సరము 6 లక్షల 20 వేలమంది చేరారు అంటే, ఆఖరు సంవత్సరము ఒక లక్ష ఎనభై వేలమంది చేరుతున్నారు. అంటే నూటికి 70 మంది యీ మధ్యన పోతున్నారన్నమాట. అందుచేత నిజముగా చదువు చెప్పేవారు ఎంతమంది ఉన్నారు అంటే నూటికి 30 మంది మాత్రమే ప్రాథమిక పాఠశాలలో ఉంటారు, వయస్సు పరిమితిలోపల ఉన్న విద్యార్థులకు మాత్రము చదువు చెబు

Sri P. Sundarayya] [24th March 1956

తున్నారు. మిగిలిన వారందరికి ఏ కారణమువల్లనైతేనేమి, చదువు నిరర్ధకమవు తున్నది. తిరువాన్కూరు స్టేటులో చూస్తే నూటికి 97 మంది ప్రాథమిక పాఠ శాలలో ఉంటున్నారు. Education Minister యొక్క లెక్కలను బట్టి అంత మంది చదువుకుంటున్నారని తెలుస్తున్నది.

THE HON. SRI K. VENKATA RAO:—అందుకనే అక్కడ ప్రభు త్వము నిలవడము లేదు.

SRI P. SUNDARAYYA :—అందుచేత యీ ప్రాథమిక విద్యఅయినా నూటికి నూరు పాళ్లు 1960 వ సంవత్సరమునాటికి సాధించండి. స్కూలు ఫైనల్ పరీక్షకు ఎంతమంది కట్టారు ? Colleges ఎంతమందికి కట్టించారు ? అనే దానికంటె 14, 15 సంవత్సరముల వయస్సులోపల వారందరికి చదువు చెప్పిం చడం అవసరం. Constitution లో ఉన్నది. అది ఇప్పుడు అది సాధ్యముకాదు కాబట్టి, అది 1960 వ సంవత్సరము నాటికైనా చేస్తామని అంటున్నారు. అయితే 1960 వ నాటికైనా ఎట్లా చేస్తారు? నూటికి 30 మందికూడా అయిదవ క్లాసువరకైనా రానిపక్షములో, 14 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ ఉండాలని స్కూలులో చెబు తున్నారంటే, వాళ్లను నామకః స్కూలులో చేర్చడమేనా ? లేకపోతే 14 ఏండ్ల వరకూ విద్యాజ్ఞానము కలగటానికి చర్యలు తీర్చుకుంటున్నారా అంటే, ఏమీ లేదనే చెప్పవలసిఉన్నది. దానికి కావలసిన డబ్బులేదని అంటున్నారు. Higher Elementary Schools ను Middle Schools గా మార్చాలి. 800 కు పైగా Higher Elementary Schools ఉంటే, అందులో నూరు మాత్రమే మార్చుతున్నామని అంటున్నారు. కాబట్టి మన విద్యా విషయము చాలా అసం తృప్తిగా ఉన్నది.

తరువాత ఆరోగ్యశాఖ విషయములో మేము మునుపటికంటె ఎక్కువమంది డాక్టర్లను తయారుచేస్తున్నామని ప్రభుత్వమువారు అంటున్నారు. ఎంతమంది, అని అడిగితే, యింతవరకున్నా, 1½ రెట్లు, రెండురెట్లు ఎక్కువతయారవుతున్నారని అంటున్నారు. సరే. Bhore Committee వారి రిపోర్టులో చెప్పినదాన్నిబట్టి మనము ఇంగ్లండుతో పోల్చిచూసుకుంటే, మనము ఎంత వెనుకబడిఉన్నామో, మంత్రిగారే చెప్పారు. అందుకు చాలా సంతోషము. దానికి మాకేమి అభ్యంతరము ఉండదు. కాని మన ప్రభుత్వం ఏమి చేస్తున్నది ? ఇదివరకు మన దేశములో ఆరోగ్యమును [illegible] పరిస్థితులు [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] - -

24th March 1956] [Sri P. Sundarayy

సంగతి అటుఉండనివ్వండి. వారు ఎట్లాగైనా తంటాలుపడుతారు. ఇకముందు పుట్టబోయే వారిసంగతిని గురించి నేను అడుగుతున్నాను. వెయ్యిమందికి ఒక డాక్టరు, 500 మందికి ఒక మంత్రసానిచొప్పున ఉండేటట్లు ప్రభుత్వము తయారు చేస్తున్నదా, అంటే, లేదనిచెప్పవలసిఉన్నది. ఆంధ్రరాష్ట్రములో ప్రతిసంవత్సరము 3 లక్షలయాభైవేలమంది కొత్తగా పుట్టుతున్నప్పుడు, అందులో ప్రతివెయ్యిమందికి ఒకడాక్టరుచొప్పున, లెక్కచూస్తే, మనకు సంవత్సరానికి 250 మంది డాక్టర్లు కావాలి. ఈ పంచవర్ష ప్రణాళికలో 160 మంది డాక్టర్లను తరిఫీదుచేస్తే, అందులో 70 మంది మాత్రమె పరీక్షఅయివస్తున్నారు. దీన్నిబట్టి, ప్రతిసంవత్సరము 70,80 మందికన్న రావటములేదు. మిగిలిన 170 మంది ఎక్కడినుంచివస్తారు, ఎక్కడినుంచిఅయినా అరువుతెస్తారా అని అడిగితే, ముసలివాళ్లను తెస్తాము. జీతాలు ఎక్కువచేస్తాము, బైటనుంచి recruit చేస్తాము, అని సమాధానము చెబుతున్నారు. బైటనుంచి తెస్తామంటే, బైట మనకంటె అధ్వాన్నముగా ఉంటున్నది. కాబట్టి బైటనుంచి recruit చేయడమనేది ప్రభుత్వానికి సాధ్యపడేదుకాదు. నేను మాత్రం నమ్మటములేదు. తరువాత nurses విషయం ఉన్నది.

THE HON. SRI K. VENKATA RAO:—Nurse లకు 150 రూపాయిలు వస్తాయి. B.A. లు M.A. లు పాసై పదేళ్లు సర్వీసుచేసినంత జీతం. వాళ్లు పెళ్ళిచేసుకోరు. 150 రూపాయిలతో హాయిగా బ్రతకవచ్చు.

SRI P. SUNDARAYYA :—భార్యాభర్తలలో ఎవరు తప్పుచేసినా వాళ్ళకు ఎడబాటుకల్గించి ఎక్కడకో దూరంగా transfer చేసే Rules అన్నీ పెట్టుకుని మీరు పరిపాలన చేస్తూఉంటే పెళ్ళిచేసుకున్నవాళ్లు ఎవరువస్తారు? బ్రహ్మచారిణులు ఉన్నవాళ్లు రావాలిగాని. Hospital లో bed strength రెండు రెట్లు చేస్తామన్నారు. కాని ఈ ప్రణాళికలో 10 వేల beds కు మాత్రమే అని అంటున్నారు. ఇదివరకటి 8 వేలనుంచి 10 వేలైతే రెండురెట్లు ఎట్లా అవుతుంది. నాలుగోవంతుమాత్రమే. ఈరీతిగాఉంది వైద్యసహాయం. ఇక నిరుద్యోగం సంగతి మంత్రిగారు కొంతవరకూ ఉద్యోగాలు కల్పిస్తామంటున్నారు. కేంద్రప్రభుత్వంకూడా 80 లక్షలవరకూ ఉద్యోగాలు చూపిస్తామంటున్నారు. ఒకకోటిమంది కొత్తగా పనికివస్తూంటే 80 లక్షలమందికి పనికల్పిస్తామనివారే ఒప్పుకున్నారు. మిగిలిన 20 లక్షలమంది సమస్యగడ్డుగానే తయారవుతోందని చెబుతున్నారు. ఇదివరకున్న నిరుద్యోగులు ఎంతమందో కేంద్రప్రభుత్వం కొన్ని లెఖ్ఖలు ఇచ్చింది. ఆ లెఖ్ఖలుసరికావు. ప్రభుత్వంచెప్పిన లెఖ్ఖలప్రకారం

Sri P. Sundarayya] [24th March 1956

ఇదివరకున్న జనాభాలో 100 కి 40 మంది పనిచెయ్యడానికి తయారయ్యేవారున్నారు. ఈరోజు పనిఉన్నవాళ్లు ఎంతమంది? 51 జనాభాలెక్కల ప్రకారం self-supporting, Earning dependents వీరిని లెక్కవేస్తే ఆంధ్రదేశంలో మాత్రమే 20 లక్షలమంది పనికోసం ముందుకువస్తున్నారు. Self-supporting Earning dependents గా 75 లక్షలున్నారు. 30, 40 లక్షలమందికి పని ఏమీలేదు. ఆదామాషానుబట్టి చూచినట్లయితే భారతదేశంలో మొత్తంవారు చెప్పినట్లు 60 లక్షలేకాదు, 6 కోట్లమందికి తక్కువలేకుండా నిరుద్యోగులున్నారు. మన ఆంధ్రరాష్ట్రానికి సంబంధించి 22 నుంచి 30 లక్షలకు తక్కువలేకుండా నిరుద్యోగులు పాతవాళ్లున్నారు. సరే పాతవాళ్ల సంగతి వదలివేసి, క్రొత్తగా ఈ 5 ఏళ్లలోనూ 5 లక్షలమంది ఉద్యోగాలకోసంవస్తారు. ఈ రెండో ప్రణాళికలో 60 వేలమందికి మాత్రమే దొరుకుతుంది. 1 లక్ష 27 వేల మందికి ఈ constructions లోనూ 37 వేల మందికి constructions పూర్తిఐనతరువాత ఇతరరకాలుగా ఉద్యోగాల లోనూ దొరకడానికి వీలుంది. Subsidiary occupations క్రింద ఇంక కొంచం ఎక్కువ దొరుకుతుంది తప్పితే, ఉద్యోగాలు మాత్రంలేవు పాతవాళ్ళకు ఉద్యోగాల సంగతి అట్లా వదలిపెట్టి, క్రొత్తగా ఉద్యోగాలు చూపించవలసిన 5 లక్షల మందిలోనూ, మనం Public sector లో 60 వేలమందికీ Private sector లో ఇంకొక 90 వేలమందికీ చూపిస్తే మిగిలిన సగంమంది సంగతి ఏమి కావలసియుంటుంది? అందుచేత ప్రభుత్వం ఈ నిరుద్యోగసమస్య సంవత్సరం సంవత్సరం ఎంతభీభత్సంగా పెరుగుతోందో ఆలోచించవలసియుంటుంది; మనం 4800 కోట్లుఖర్చు పెట్టాలని అనుకుంటున్నాం. అంతతో సంతృప్తిపడితేచాలదు. ఈ విధంగా సంవత్సరం, సంవత్సరం నిరుద్యోగం పెరుగుతూఉంటే దానికి కుటుంబసంయమనం అంటె family planning అని పేరుపెట్టి ఏదో చిట్కాలు వేసేందుకు పూనుకుంటే అది ప్రయోజనకారికాదు. ఆవిధంగా మనదేశాన్ని ముందుకు తీసుకుపోలేమని నేను మనవిచేస్తున్నాను. ఈ పనులన్నీ చెయ్యాలని అన్నిపార్టీలు అంగీకరిస్తున్నాయి. ఐతే డబ్బు ఎక్కడనుంచి వస్తుందని కళావెంకట్రావుగారు అనేకసార్లు అడుగుతున్నారు. మన కేంద్రప్రభుత్వ ఆర్థికమంత్రి దేశముఖ్ గారు ఇంకా 200 కోట్లు అదనంగా పన్నువెయ్యడానికి పూనుకోవలసి వస్తుందనిచెప్పారు. నాలుగోవంతు మాత్రమే పన్నుల మూలంగాగాని, రైల్వేలద్వారాగాని వస్తుంది. మిగిలినదంతా ఈ అదనపుపన్నుల [illegible] పేణాపనూలుచేయడంతప్ప, ఇంకేమీ మార్గంలేదా అని [illegible] మార్గాలున్నాయి. ఈ రోజు ఈ లక్ష 60 వేలమందికి పని చూపిం[illegible] మన ఆర్థికసమస్యగాని మన [illegible]తీయసమస్యగాని పరిష్కారం కాదు.

24th March 1956] [Sri P. Sundarayya

ఇంకొక ప్రక్క 1200 కోట్లరూపాయిలు deficit financing క్రింద మనం పెడుతూఉన్నప్పుడు, ఈ 1200 కోట్లరూపాయిల మారకం బ్యాంకులద్వారా వెడుతుంది కాబట్టి, వీటిని ఆధారంచేసుకునివాళ్లు Bank drafts ఇస్తూ, credit ఇంకా expand చేస్తారు. వీటన్నింటినీబట్టి ధరలు పెరుగుదల విపరీతంగావచ్చే ప్రమాదం ఎక్కువగాఉంది. దాన్ని మనం మరచిపోకూడదు. ఈ Deficit financing, inflation వల్ల ఎవరికి కావలసినడబ్బు వాళ్ళకు ఉంటుంది. ఇదివరకు జేబులో ఒకరూపాయిఉంటే ఇప్పుడు 10 రూపాయిలుంటాయి. నష్టమేమున్నదని అడగవచ్చును. మారకంలో పెట్టిన ఈ డబ్బంతా బీదలకు ముందుపంచి, ధనవంతులదగ్గర కొ స్తకుదిస్తే ఎవరికీ ఏమీ అభ్యంతరంలేదు. ఆచరణలో జరిగేది ఏమిటంటే బీదలవేతనాలు అట్లాగే ఉంటాయి. చిన్నరైతులూ, కూలీలస్థితి అట్లనే ఉంటుంది. ఈ అదనంగా issue చేసిన డబ్బుఅంటే నోట్లన్నీ మళ్ళీ లాభాలరూపంలోనూ, ఇతర రీతులాడబ్బున్న వారిదగ్గరకే చేరుకుంటాయి. అందువల్ల inflation మరింత పెరుగుతుంది. Inflation పెరగడంతో ప్రజల జీవితపరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది. దాన్నిగురించి తగినచర్య తీసుకోవాలి. ఈ deficit financing కి పూనుకోడానికి మనం ఎప్పుడు సాహసించవచ్చునంటే, లాభాలను control చేస్తూ, ఆదాయాన్ని control చేస్తూ, ప్రజలకు కావలసిన అత్యవసర వస్తువులు వాళ్ళకు దొరికేటట్లుగా ప్రభుత్వం గ్యారంటీచేసి; అవసరమైతే చౌకడిపోలద్వారా అన్నీ supply చెయ్యడానికి చర్య తీసుకో గల్గినప్పుడే ఈ deficit financing కి అర్థం వుందికాని లేనియెడల బీదలనోరుకొట్టి ధనవంతుల జేబులునింపడం తప్పితే ఇంకొక ప్రయోజనం వుండదు. ఈ deficit financing కి మేము పూర్తిగా వ్యతిరేకులం ఐతే మీరనవచ్చును. "ప్రణాళిక పెంచమంటున్నావు, పరిశ్రమలు పెంచాలంటున్నావు, విద్యకీ వైద్యానికీ ఇంకా ఎక్కువ ఇవ్వమంటున్నావు, జీతాలు పెంచమంటున్నావు, కావలసినడబ్బుకు dificit financing పనికిరాదు. పన్నులు ఇప్పటికే ఎక్కువ ఐపోయాయి అంటున్నారు. డబ్బు ఎక్కడినుంచి వస్తుంది. ఇదంతా ప్రచారంకోసం" అంటున్నారు. ప్రచారం చెయ్యడానికి ఇక్కడ చెప్పవలసిన అవసరంలేదు. ప్రచారముచేసినంతమాత్రాన ప్రజలంతా విని వెంటపడతారనుకోవడం పొరపాటు. ఈ పరిస్థితినుండి బైటపడడానికి మీరు అవలంబిస్తూయున్న పన్నులవిధానం సరియైనదేనా? ఇదే పరిస్థితిలో మనం వెడితేఎప్పటికైనా మన దేశాన్ని ముందుకు తీసుకువెళ్లడానికి సాధ్యమవుతుందా ? Taxation Enquiry Committee లో చెప్పింది. Planning Commission వారు Second Five Year Plan లో ఒప్పుకున్నారు. ఈ రెండో పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేలోపల ఆదాయాలమీద గరిష్టపరిమితి పెట్టాలి. తప్పకుండా పెట్టండి.

Sri P. Sundarayya] [24th March 1956

సంవత్సరానికి ఏకుటుంబంయొక్క ఆదాయంకూడా 20 వేల రూపాయిలకు మించి ఉండకూడదని పెట్టండి. దానికిమించిన ఆదాయం ఏరూపంలో వచ్చినాసరే ప్రభుత్వం తీసుకుని పరిశ్రమలలో పెట్టుటకు తయారుకావాలి. భూమి విషయం వచ్చేటప్పటికి 5 వేల ఆదాయంవచ్చే భూమికన్నా ఎక్కువ వుండకూడదంటే, factory యజమానులకూ, banker లకు, వడ్డీవ్యాపారస్థులకూ, పెద్దఉద్యోగస్థులకూ 5 వేలు కాకుండా 20 వేలు పెట్టండి. ఈరెండో పంచవర్ష ప్రణాళిక మూలంగా ఆదాయం మీద ceilings పెట్టాలి. ఒకళ్ళకు dearness allowance తో కలుపుకుని 50 రూపాయిలజీతంఐతే, దానికి 30 రెట్లు పైగా నేవుంటుంది పైవారికి. 30 రెట్లు వుంటే చాలదా? దీని నే Taxation Enquiry Committee "ఒక average కుటుంబానికి ఈరోజున census లెక్కబట్టి వచ్చేదానికి 30 రెట్లు ఉండాలి" అనిచెప్పింది. మేముకనీసపుకూలికి 30 రెట్లు పెట్టాలని అంటున్నాము. ఈ రీతిగాచేస్తే 20 వేలుకన్న ఎక్కువ ఉండాల్సిన అవసరంలేదు. ఈ రోజున అయినా 20 వేల రూపాయిలతో నివసించవచ్చును. పాత అలవాట్లు, పాత దర్పాలు—ఇన్ని మేడలు ఉండాలి, ఇంత హాయిగా డబ్బు ఉండాలి అనుకుంటేమాత్రం లాభంలేదు. మనది బీదదేశం కాబట్టి; ప్రతివారు త్యాగంచేయాలి అంటున్నారు. నెలకు రు. 1500 తీసుకొని జీవించండి, రు. 500 లు తిండిలేనివారికి ఇచ్చి సేవచేయండి అంటే తప్పు ఏమి? రు. 0—4—0 వస్తే రు. 0—1—0 ఇవ్వాలని appeal చేస్తున్నారు. వారు అడుగుతారు.

THE HON. SRI K. VENKATA RAO :—వారు అడగడంలేదు; మీరు అడుగుతున్నారు.

SRI P. SUNDARAYYA :—పోనీ, వారితరఫున నేనే అడుగుతున్నాను అనుకోండి. వారు అడగడానికి ధైర్యంలేక మీరు వినిపించుకోరని అనుకుని వుండవచ్చు. వ్యక్తులకు వచ్చే ఆదాయాన్ని పరిమితం చేయవలసియున్నది. Factories లో వచ్చే లాభాలలో 6% కు పైబడిన లాభాలను bonds రూపంలో ఇవ్వండి. చెల్లించని bonds ఎన్ని ఇచ్చినా అభ్యంతరం లేదు. 6% కు పైబడి వచ్చినలాభాలను తీసుకుని తిరిగి పరిశ్రమలలో పెట్టడానికి ఎందుకు ఒప్పుకోరు. వాళ్లు పెట్టకపోతే మనమే పెట్టుకుంటాము. బ్యాంకులు తీసుకొంటాము అంటున్నారు; త్వరగా తీసికోండి. ముఖ్యమయిన వస్తువులలో విదేశీ వ్యాపారం చేస్తాము అంటున్నారు. Foreign Exchange banks ద్వారా [illegible] పెట్టుబడులను ఈదేశంలోనికి రానిచ్చి అప్పుతీసుకుని కొద్దివడ్డీ ఇచ్చేపదతికి

24th March 1956] [Sri P Sundarayya

అభ్యంతరం లేదు. ఈ దేశంలో విపరీతంగా వచ్చే లాభాలను బయిటకుతీసుకుపోతున్నారు. దానికి అవకాశాలు లేకుండా, ఈ బ్రిటిషుకంపెనీలు అన్నింటిని స్వాధీనం చేసుకోడానికి వీలులేకపోతే, 6% చొప్పున లాభాలను తీసికొననిచ్చి మిగతా లాభాలను ఇక్కడ పారిశ్రామికాభివృద్ధికే వినియోగించేట్లా చర్య తీసికొనండి. విపరీతమైన నష్ట పరిహారం జమీందారులకు, రాజాలకు, factory యజమానులకు ఇస్తున్నారు. వారిలో తిండిలేకుండా బాధపడేవారుంటే 20 వేల రూపాయిలవరకు ఇవ్వవచ్చును. బ్రతకలేనివారికి నష్టపరిహారం ఇవ్వండి.

THE HON. SRI K. VENKATA RAO: —Constitution ను amend చేయాలని చెప్పండి; దీనికి second plan ఏమి చేస్తుంది?

SRI P. SUNDARAYYA:—నష్టపరిహారం ఎంత ఇవ్వాలనేది ప్రభుత్వం నిర్ణయించాలి. Amendment అవసరమయితే 3/4 వంతులు majority కాంగ్రెసుకే ఉన్నది. మీ ground అదికాదు కాబట్టి ఈసంగతి చెప్పవలసిన అవసరం వస్తోంది. భారీపరిశ్రమలను, పెద్ద పరిశ్రమలను తీసుకుంటాము అంటున్నారు. మేము ఇంకా ఎక్కువ తీసుకోమంటాము. కాని నష్టపరిహారం విపరీతంగా ఇచ్చి పెద్ద పరిశ్రమాధికారులనే 40, 50 చొప్పున directors గా వేస్తే ఉపయోగం ఏమిటి? State Bank తీసుకొనిచూస్తే 45% sharesవాళ్ళ చేతిల్లోనే పెట్టుకొంటున్నారు ఇదివరకు directors ఎక్కువభాగం ఇక్కడా ఉంటున్నారు. విపరీతంగా నష్టపరిహారం చెల్లిస్తున్నారు. ప్రజలపై పన్నువేసినడబ్బును విపరీతంగా నష్టపరిహారం క్రింద చెల్లిస్తూ డబ్బులేదంటే అర్థంలేదు

THE HON. SRI K. VENKATA RAO :—జమీందారులకు ఎకరానికి రు 6 లు నష్టపరిహారం ఇచ్చారు.

SRI P. SUNDARAYYA :—ఏపని చేయవలసివచ్చినా ఒక క్రొత్త ఉద్యోగస్థుణ్ణి పెట్టుకోవాలి. ఉద్యోగస్థులను పెంచుకుంటూపోతున్నారు. అవసరం లేదా అంటే కొంతమంది అవసరమే. మరొకప్రక్కన గ్రామరాజ్యాలు పంచాయితీరాజ్యాలు అంటున్నారు. వాటికిఉన్న అధికారాలను తీసివేస్తున్నారు. వాటికి ఎన్నుకునే పద్ధతులలో ఉండే పొరపాట్లను పోనీయండి గ్రామాలకు కొంత ఇస్తున్నాం. వీటిని పూర్తిగా ఉపయోగించుకోకుండా Village guides, community project directors ను వేస్తున్నారు Community projects క్రింద ప్రతిసంవత్సరం ఖర్చుచేసేడబ్బులో మూడవ వంతు administrative

Sri P. Sundarayya] [24th March 195(

ఖర్చుల క్రింద పోతున్నది. 30% గ్రామాలకు ఇచ్చి పనిచేయకూడదని చెప్పకూడదా? Engineer గురించి చెప్పడంలేదు; Doctor గురించి చెప్పడంలేదు; Technicians గురించి చెప్పడంలేదు. Administration చేయడానికయినా ప్రజలచేత ఎన్నుకోబడిన పంచాయితీలు, జిల్లాబోర్డులు పనికిరావా? ఉద్యోగస్థులతో తప్ప పనికిరాదనే తత్వంతో వెడితే ప్రజల సహకారం ఎట్లా వస్తుంది? సహకారం 64% వరకు వచ్చింది అంటున్నారు ఉద్యోగస్థులతోనే అన్నీ నడిపించుకుంటూపోతే అది ఇంకా క్రిందకుపోతుంది కాని పెరుగదు. ప్రజలద్వారా ఎన్నుకోబడిన స్థానికసంస్థలకు అధికారాలు ఇచ్చి final గా check చేయడానికి జిల్లాబోర్డులు, ప్రభుత్వం, మంత్రివర్గం ఉండగా కేవలం ఉద్యోగస్థులద్వారా పరిపాలనచేస్తాము; ప్రజలుచేత ఎన్నుకోబడిన సంఘాసలహాలు సంఘాలుగా మాత్రమే ఉంటాయి అంటే సరికాదు.

THE HON. SRI. K. VENKATA RAO:—రష్యానుంచి నేర్చుకున్నాం ఇది అంతా.

SRI P. SUNDARAYYA:—మంచిది ఏది ఉన్నా, ఎక్కడ ఉన్నా నేర్చుకోడానికి అభ్యంతరంలేదు. కొంచెం పారిశ్రామికాభివృద్ధి అయినది అంటే సంతోషించడానికి వీలులేదు. స్వతంత్రంగా నిలబడ్డానికి కావలిసిన పరిశ్రమలు నెలకొల్పాలి, ప్రజలు అవసరాలు తీర్చడానికి కావలిసిన చర్యలు తీసుకోవాలి. ఈ ప్రణాళికక్రింద కార్మికులకు చిన్న ఉద్యోగస్థులకు జీతాలు పెంచడంలేదు. బీద ప్రజలకు కావలిసిన వస్తువులధరలను guarantee చేయడంలేదు నూటికి జాతీయాదాయం 25% పెరుగుతుంది అంటే జీతాలు 15% అయినా పెరగాలికదా? ఆవిధంగా పెరుగకపోతే ఏమిప్రయోజనం. మరొకపర్యాయం వీటి నన్నింటిని ఆలోచించండి. ఇది అంతా Communist party ప్రచారంకోసమని చేస్తున్నదని త్రోసివేస్తే మేము చేయగలిగింది ఏమీలేదు. దేశానికి దురదృష్టం అని బాధపడవలసి వస్తుంది. దేశాన్ని ముందుకు తీసుకుపోవడానికి మనస్సులోఉన్న అనుమానాలు ముఖ్యంకాదు. అనేక సందర్భాలలో మీతో భేదిస్తాము; రేపు అవసరమయితే తిరిగి భేదిస్తాము. దేశసేవచేయడంలో ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అనేది అలా ఉంచండి మేముచేసిన సూచనలన్నీ ప్రచారమే అనకుంటే సహకారం ఎట్లా సాధ్యం అవుతుంది? జాతీయ ఆదాయం 25% పెంచుతాం అని చెబుతూ [illegible]% అయినా జీతాలరూపంలో కార్మికులకు, చిన్న ఉద్యోగులకు పెంచకుండా, ఇప్పుడు ఉంటే ఆర్థికస్థితిని మార్చకుండా ధనవంతుల ఆదాయాలు తగ్గించడానికి [illegible]కుండా లాభాలమీద పరిమితిపెట్టకుండా అంతా పన్నులద్వారా— [illegible]ద్వారా—చేస్తాము అంటే న్యాయంకాదు; దేశాన్ని ముందుకు

24th March 1956] [Sri P. Sundarayya

తీసుకుపోయే పద్ధతికాదు. National Development Council లో కాంగ్రెసు వారు majority గా ఉన్నచోట అంగీకరించిన తీర్మానాలు ఇవి. ఇవి ఒక అడుగు ముందుకు పోయిఉండవచ్చు. వీటిని అన్నింటిని అమలులోపెట్టకపోతే plan జయప్రదం కాదు. ఇంతకన్న జయప్రదం కావాలంటే మీరు చెప్పినవాటిని అమలులో పెట్టడానికి కృషిచేయాలి. ఆ విధంగా కృషిచేస్తే మేము సహాకారం ఇవ్వగలమని చెబుతూ విరమిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS :—Allot చేసిన 3 రోజులలో ఒకరోజు అయిపోయింది. ఒకరోజు ఎక్కువ ఇవ్వడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON SRI K. VENKATA RAO:—నేను 27 వ తేదీకి వెళ్ళి హాస్పిటల్లో చేరాలి.

THE HON. DR. B. GOPALA REDDI:—రేపు 4 గంటలకే కూర్చుందాము.

SRI SHAIK MOULA SAHIB :—అధ్యక్షా, మంత్రిగారు ఈనాడు ప్రవేశపెట్టిన ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోని అభివృద్ధి పథకాల జాబితాను చూచి ఇది ఒక నూతన శకం మాదిరిగా భావించవలసి ఉంది. మనమందరము 200 సంవత్సరములనుండి ఏనాడు కని, విని ఎరుగని ఈ ప్రణాళికను ప్రవేశపెట్టేటప్పటికి దేశమంతటికిని ప్రత్యేకంగా మన ఆంధ్ర రాష్ట్రంలో అభివృద్ధి పెరిగి ఒక నూతన శకము ప్రారంభించే రోజుగా మనం భావించవలసియున్నది. అయితే ఇందులో మనకు కేంద్రప్రభుత్వం మంజూరుచేసిన మొత్తమును బట్టి చూస్తే మనము ఒక్కసారిగా దేశమును అంతాకూడా వైకుంఠంలాగున చేయాలంటే అది సాధ్యపడే విషయంకాదు. ఇంతకాలంనుంచి ఏమీ లేని ఈ దేశంలో క్రమేణ అభివృద్ధికొరకు ఎన్నో పథకాలు తయారుచేసి, డబ్బువచ్చే విధానాలను కనిపెట్టి, నిర్ణయాలను కొన్నిటిని చేసి ఒక పర్సెంటేజి ప్రకారం సంవత్సరం వారీగా ఏఏ కార్యక్రమానికి ఎంత వినియోగ పడాలనో, ఒకేటే తూరిగా పెట్టకుండా అంచెలవారిగా ఆ పనులు ప్రారంభం చేయాలని చూపించారు. సంతోషమే. మంత్రివర్గంవారికి ఒక చిన్న మనవి చేయదలచాను. బ్రిటీషువారి హయాములో నీటివనరులు కలిగి నీటిపారుదల వల్ల అభివృద్ధి చెందిన తాలూకాలకే, రైల్వే సౌకర్యాలు, తారు సిమెంటు రోడ్లు మున్నగునవి చేకూరినవి. విద్యా సౌకర్యాలు, ఆరోగ్య సౌకర్యాలుకూడా వాళ్ళకే చేకూరినవి. తుదకు వ్యవసాయానికి సంబంధించినటువంటి electricity సౌకర్యం కూడా వాళ్ళకే చేకూరినది. వెనుకబడిన ప్రాంతాలలో, అధిక ఖనిజ సంపదతో కూడుకొన్నట్టి ప్రాంతాలలో ఎలాంటి పరిశ్రమలూ లేకుండాపోయినాయి. పరి

Sri Shaik Moula Sahib] [24th March 1956

శ్రమలుకూడా అభివృద్ధి చెందిన తాలూకాలలోనే అభివృద్ధి అగుచున్నాయి. అది వాళ్ల పలుకుబడివల్లనో ప్రభుత్వంవారి ముఖప్రీతి తత్వంవల్లనో ఆ రకంగా జరిగింది. ఇన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెట్టే ఈ ప్రణాళిక కాలంలో వెనుకబడ్డ ప్రాంతంలో లోహపరిశ్రమలను స్థాపించాలి. యుద్ధములో పడిపోయిన జర్మనీని ఈనాడు చూస్తే ప్రపంచంలోని అగ్రరాజ్యాలతో దానికి ఏ రకంగా సవాలుచేసే బలం ఏర్పడిందో తెలుస్తుంది. ఖనిజములద్వారా కనకం చేకూరింది. కనకంద్వారా సర్వాన్నికొనే పరిస్థితి యేర్పడుతుంది. ప్రభుత్వం ఈ పంచవర్ష ప్రణాళికలో చూపించిన ఈమొత్తమును వెనుకబడ్డ ప్రాంతాలకు ఉపయోగించి తోడ్పడ్తారని నేను ఆశిస్తూన్నాను. రాకపోకల సౌకర్యాలు అభివృద్ధి అయితేనే దేశంకూడా అభివృద్ధి కాగలదని ఇండియా ప్రభుత్వపు ఆహార శాఖ ఉపమంత్రిగారు ఈ కర్నూలు టౌనలోనే చెప్పిఉన్నారు. పరదేశములలో చూస్తే పల్లె పల్లెలకు 4½ మైళ్లు పొడుగు చొప్పున రోడ్లు ఉన్నదని, అన్నికూడా metal roads, tar roads అనిన్నీ చెప్పారు. మనదేశంలో చూస్తే ½ మైలుకూడా అట్లులేదు. ఇది చాలా విచారకరమైన విషయము. అట్టి రోడ్లు సౌకర్యాలుంటే, ఒక గ్రామమునుండి మరొక గ్రామానికి పోవడానికి, ఒకరిని మరొకరు చూచి నేర్చుకోవడానికి, ఇక్కడ వుండేటటువంటి పాడి పంటలు మరొకచోటికి తీసుకొనిపోయి అమ్మడానికి, ఎగుమతి దిగుమతి సౌకర్యాలుకూడా ఉంటాయి. ఆ రకంగా నాగరికత అభివృద్ధి చెందటానికి ఇది మొదటి మార్గము. కాబట్టి రోడ్ల అభివృద్ధి లేకపోతే దేశం పురోగమించడం చాలా దుర్లభం, నేను అనేక చోట్ల తిరిగి చూచివచ్చాను అని వారు చెప్పారు. ఈ రకంగా ఈనాడు పెద్ద పెద్దరోడ్లు లేకపోయినప్పటికీ, దారి సౌకర్యాలు లేనిచోట మట్టి రోడ్లకైనా డబ్బు ఖర్చుపెట్టి అభివృద్ధి చేయాలని కోరుతున్నాను. ఇప్పటివరకుకూడా వేసిన మట్టి రోడ్లు మరమ్మతులులేక నిరుపయోగమవుతున్నాయి. పంచాయితీలను ఎక్కువ చేస్తున్నారు. వీటి అభివృద్ధికొరకై ఒక పొలిమేరనుంచి ఇంకొక పొలిమేరవరకు వేసినటువంటి మట్టి రోడ్లను మెటల్ రోడ్లుగా వేసే బాధ్యత ఆ పంచాయితీ బోర్డులపై పెట్టినట్లయితే connection లు చెడకుండా అవన్నీకూడ ఒకటి రెండు సంవత్సరాలలో కంకర రోడ్లయి అభివృద్ధి చెందుతవి. ఇక వేయబోయే రోడ్లనుకూడా ఈ రకంగా వేస్తే అభివృద్ధి కాగలనని నేను ఆశిస్తూ ఉన్నాను. Irrigational improvements గురించి కూడా ఈ ప్రణాళికలో ఉన్నది. మొత్తంమీద పెద్ద projects, మధ్య తరగతి projects, చిన్న projects అని ఈ మూడు తరగతులున్నప్పటికీ పెద్ద projects సౌకర్యాలు లేనిచోట, ఏలాంటి జలాధారంలేక ఏ జీవనదులు లేనటువంటి ప్రాంతాలలో చిన్నచిన్న ప్రాజెక్టులను ఆరంభిస్తే నిజంగా నూతన శకము ప్రారంభ

మైందని, మన ఆంధ్ర ప్రభుత్వము ప్రపంచానికి చాటించగల్గుతారని నేను ఆశిస్తున్నాను. ఎన్ని ప్రణాళికలు తయారుచేసినప్పటికిన్నీ, ఏ తరహాలో చేసినప్పటికిన్నీ సౌకర్యములన్నీ అభివృద్ధి చెందినటువంటి ప్రాంతాలకూ, తాలూకాలకూ, నియోజిక వర్గాలకూ చెందుతున్నవి. అట్లా చెందకుండా మనం కని, విని ఎరుగని ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనయినా, భారతదేశములోని దారిద్ర్యము పారద్రోలి, ప్రతివాడికి జీవనోపాయం కలుగచేసి నిరుద్యోగాన్ని నిర్మూలింప చేస్తారని మంత్రి వర్గాన్ని కోరుతున్నాను. 168 నియోజక వర్గాలలోనుంచి శాసన సభ్యులువచ్చి యున్నారు. అందరి ఎదుట ఈ ప్రణాళిక తయారగుచున్నదికదా! మళ్లా ఏదైనా మీరు ఆక్షేపించడం భావ్యమా అని మీరు ప్రస్తావించకుండా ఆ దృష్టితోనే ఈ కార్యక్రమలను అమలు జరిపి ఈ ఆంధ్ర రాష్ట్ర ప్రజల ప్రేమను చూరగొంటారని ఆశిస్తూ విరమించు కొంటున్నాను.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, ఈ దినము పూజ్యులు కళా వెంకట్రావుగారు ప్రవేశపెట్టిన రెండవ పంచవర్ష ప్రణాళికను మనస్ఫూర్తిగా బలపరస్తున్నాను. దేశములో మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయిపోతున్నది. రెండవ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాలను ప్రభుత్వంచేయు దలచుకొన్నది. గాంధీగారు వెనుకనుండీ చెపుతూవచ్చిన స్వరాజ్యం పల్లెటిగ్రామాల్లో నున్నటివంటి ప్రజానీకమును అభివృద్ధిలోకి తేవటమే. కనుక ఈ ద్వితీయపంచవర్ష ప్రణాళికలో పల్లెటి గ్రామాల్లోని ప్రజలందరికి సౌకర్యములు కలుగజేయడం ప్రభుత్వ ఉద్దేశం. అలాంటప్పుడు ఈ ద్వితీయపంచవర్ష ప్రణాళికను మునిసిపాలిటీలకో పెద్ద పెద్ద పట్టణాలకో ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి ఖర్చు పెడుతున్నారు. అట్లా చేయడంలో మాకేమీ కష్టంలేదు. కానీ ఎన్నో తరాలనుండి బాగుచేదా మనుకొంటున్న పల్లెటిగ్రామాల్లో నున్నటువంటివారికి విద్యాసౌకర్యములు చిన్నచిన్న irrigation సౌకర్యములు కలుగజేయమని కోరుచున్నాను. పాడి పంటలు వగైరాలు పండించే పల్లెటి ప్రజలకు ఎక్కువ సౌకర్యాలు కల్గించాలని ప్రభుత్వ ఉద్దేశం. అలాంటప్పుడు నిజంగా జిల్లాలకు సంబంధించినంతవరకు అక్కడ ఉన్నటువంటి జిల్లా కలెక్టర్లువగైరాలు ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు చాలినంతవరకు ఈ పల్లెల అభివృద్ధికోసం కొన్ని ప్రణాళికలను ప్రభుత్వానికి పంపించారు. అలాంటప్పుడు ప్రభుత్వంవారు నిజంగా వారు చేసినటువంటి సూచనను కొంతవరకు అయినా ఈ 5 ఏండ్లలో పుగా అమలు జరుపుతారని ఆశిస్తున్నాను. పూజ్యులైనటువంటి మంత్రి కళా వెంకట్రావుగారికి మాపాత పట్టణం తాలూకాలో గొట్టిపల్లిరిజర్వాయరు ఉన్నదని తెలుసు. అది మా area లోని ప్రజలకు చూప

టానికి రెండవ పంచవర్ష ప్రణాళికలో ఉంది. కాని లెక్కలనుబట్టి చూచినట్లయితే ఒక్క దమ్మిడీ అయినా దానికి ఇవ్వలేదు. ఆ రిజర్వాయరు రెండు లక్షల రూపాయలతో తయారవుతుంది. ఆ రిజర్వాయరువల్ల కొన్ని గ్రామాలు సుక్షేత్రమవుతాయి. అన్ని విధాలైన పంటలను పండించి అన్ని విధాల ప్రభుత్వానికి సహాయంచేయుటకు అవకాశంకలుగుతుంది. అలాగే చిత్తిలలో ఒక గడ్డ ఉన్నది దానికి కూడా 2 లక్షలు ఖర్చుచేస్తే 5, 6 గ్రామాలకు ఉపయోగపడుతుంది. రైతులు అన్నివిధాల పంటలు పండించుకొని బాగుపడే సౌకర్యాలు కలుగుతవి. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో కొన్ని కొన్ని పెద్ద రోడ్లకు లక్షలాది యిస్తున్నారు, చిన్న చిన్న రోడ్లు గ్రామాభివృద్ధికి అవుసరం. ఒక గ్రామంనుండి మరొక గ్రామానికి రోడ్డు వేసుకోవాలంటే సగండబ్బు ఇవ్వాలని అంటున్నారు. ఆ సగం డబ్బులో చాలా భాగం అధికారులయొక్క కార్ల పెట్రోలుకోసం పోతుంది. ప్రభుత్వోద్యోగులు గ్రామాలకు వెళ్లి డబ్బు ఇస్తారా లేదా అని ఒత్తిడి చేస్తున్నారు. అలాంటి ఒత్తిడిలేకుండా ప్రజలను బాధించేవారిని తొలగించి, ఈలాంటి సౌకర్యాలను కలుగజేయాలి. ఉద్యోగస్థుల మనస్సును మార్పించడానికి గోపాలరెడ్డి గారి ప్రభుత్వం తప్పకుండా ప్రయత్నంచేసి ప్రజలకు 5 ఏండ్లలోగా కావలసినటువంటి సదుపాయాలను చేయవలెనని కోరుచున్నాను.

అదికాక మాజిల్లాను సంబంధించినంతవరకు ఒకటే ఒక రైలురోడ్డు మద్రాసు నుంచి కలకత్తా పోయేటటువంట రైలురోడ్డు ఉన్నది. మా జిల్లాలో 11 తాలూకాలున్నాయి. ఎంతో విస్తీర్ణంవున్నది. మేము కోరేదేమిటంటే కళింగ పట్నంనుంచి శ్రీకాకుళంవరకు.....

THE HON. SRI K. VENKATA RAO :—గున్నయ్యగారు తప్పు చెప్పకూడదు. రెండు రైలురోడ్లున్నాయి. విజయనగరంనుంచి పార్వతీపురం వెళ్ళేది రైలురోడ్డుకాదా ?

SRI P. GUNNAYYA :—మరచిపోయాను సార్. అది ఒకటున్నది. ఉన్నా రెండురోడ్లేవున్నాయి కాబట్టి గుణుపురంమీదుగా పాలకొండమీదుగా పార్వతీపురంద్వారా ఒక రైలురోడ్డు కోరాము. అది యీ రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చి కూడా కొంత రహదారి సౌకర్యంచేస్తారని ఆశిస్తున్నాను. తరువాత పశుసంపద వృద్ధిని గురించి కొంతడబ్బును యిందులో కేటాయించారు నిజముగా గోవంటె యీ ప్రపంచానికే మూలాధారం రైతంటే, ప్రపంచానికే మూలధనం. అలాంటి రైతులను, [illegible] అభివృద్ధి చేయవలసిన అవుసరమున్నదని మంత్రిగారికివ్రాసి నా

24th March 1956] [Sri P. Gunnayya

తెలుసును. అలాంటప్పుడు యీ time లో ఒకజత పశువులు కొనాలంటే 2,000 రూపాయలు 3,000 రూపాయలు అవుతుంది అలాంటి పశువుకు తగినటువంటి injections, మందులు యివ్వడానికి గ్రామాలలో తగినటువంటి సౌకర్యాలు లేవు. పోనీ కొన్నిలక్షల డబ్బు Budget లో ఉన్నదా ? అలాంటప్పుడు ఆ డాక్టర్ల సరైనటువంటి మందులుయిచ్చి రైతులను రక్షించడానికి ప్రభుత్వం పూనుకోవాలి. అలా లేకపోతే రైతు ఒక సంవత్సరం పంటపోయినప్పటికీకూడా పశువులు చచ్చిపోతే 3 సంవత్సరాలుకూడా దానికి తగినటువంటి ప్రోత్సాహం కలిగించలేడు, అలాంటప్పుడు పశువైద్యం తగిలినట్లు చేయించాలి. అలాగే కోళ్లు పెంపకం అభివృద్ధిచేయాలి. అలాగే నీటిపారుదల Schemes మా జిల్లాలోఉన్నాయి. 20 వేలు, లక్షలోపునే ఉన్నాయి. అలాంటి Scheme లు ఈ 5 ఏండ్లలోపులనే చేయించినట్లయితే యీ కృష్ణా, గోదావరి డెల్టా భూములకంటె ఎక్కువ ఆహారాన్ని మా జిల్లా రైతాంగం పండించగలరు. ఆంధ్రదేశానికి కావలసినటువంటి ఆహారము కావలసినటువంటి దినుసులు పండించి ప్రభుత్వానికి తగినటువంటి సహాయం అక్కడున్నటువంటి ప్రజలు చేస్తారు. మా జిల్లాలో వేరుశనగ, చెఱకు, గోగులు ఎక్కువగా పండుతున్నాయి. ఒక Agricultural Farm ఏదో ఊర్లో పెట్టమని Government కు యిదివరకు suggest చేశాము. దానిప్రకారం Agricultural Farm పెట్టి అక్కడవున్నట్టి రైతాంగానికి కావలసినటువంటి సదుపాయాలు యీ రెండో పంచవర్ష ప్రణాళికలో యిస్తారని అధ్యక్షులవారిని వినయపూర్వకంగా ప్రార్థిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

MR. SPEAKER :—నేనేమిస్తాను ?

Sri S. BRAHMAYYA :—రేపు 5 నుండి 9 గంటల వరకు కూర్చుందాముండి

MR. SPEAKER:—రేపు 4 గంటలకు meet అవుదాము.

**The House then adjourned to meet again at 4 p.m. on Sunday the 25th March 1956.**

